# ఆంధ్ర తులసీరామాయణము



అను

## రామచరితమానసము

(ఉత్తరకాండము)

మైలవరపు సూర్యనారాయణమూర్తి

ప్రథమ ముద్రణము
ప్రతులు ఐదువందలు

వెల రు. 1 - 50 నయాపైసలు.

హేమలంబి



ప్రాప్తిస్థానము
మైలవరపు సూర్యనారాయణమూర్తి
కృష్ణంపాలెం
వయా కొవ్వూరు
పశ్చిమ గోదావరి జిల్లా.

# పీఠిక

సాహిత్యరత్న
అయాచితుల హనుమచ్ఛాస్త్రి ఎం. ఏ (త్రితయ)
కేంద్రప్రభుత్వహిందీ ఉపన్యాసకులు మదరాసు.

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం, రఘుకులాన్వయ రత్నదీపం,
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం, నమామి.

బ్రహ్మశ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తిగారు కొన్ని నెలలక్రిందటఁ దాము రచించిన "ఆంధ్రతులసీ రామాయణము" బాల కాండము ప్రతిని దయతో నాకుఁ బంపియుండిరి. దాని నామూలచూడ ముగఁ జదివి తనిసితిని. ఎప్పుడో సుదూరకాలమున వారి దర్శనభాగ్య మబ్బకపోదని యాసపడుచుంటిని. ఇట్లుండ నొకనాటి సాయంసమయ మున నయాచితముగ వారు మద్రాసునందలి మా వసతిగృహమునకు విచ్చేసి వారి పరిచయభాగ్యము నాకుఁ గలుగఁజేసిరి. అతినిరాడంబ రమై, నాతిదీర్ఘము, నాతిహ్రస్వమునైన మూర్తి వారిది. వేసమునందు గాని బాసయందుగాని నేటిపోడుములులేవు. సన్నని గాత్రముతోఁ జిన్న జుత్తుముడితో నమాయకముగా వారు మాటలాడునపుడు మధ్యయుగ మునాటి తపనశీలమైన వారి యాత్మసేయు రవళులు వినవచ్చినవి. నేఁడు సర్వమానవులు, బహువ్యాపృతులై, యేయొక్క కార్యమును లెస్సగా జేయలేక సతమతమగుచున్నారు. సంఘర్షమయమైన యాధునికజీవన విధానమే తద్ధేతువుగాఁ గొందఱూహింతురు. మఱికొందఱు జీవితము లందలి యతృప్తిభావమే కారణమందురు. శ్రీ సూర్యనారాయణ మూర్తిగారనిన నేటి మానవున కొక యపవాదస్వరూపము. ప్రశాం

తనిర్మలమైన గ్రామజీవనము గడపుచు, ఆధునిక జీవనసంక్షోభమునుండి బహుక్రోశములు దూరముగా నున్నారు. కావుననే, ఏకనిష్ఠమైన బుద్ధితోఁ దులసీరామాయణము ననువదింపఁ గలిగిరి. ఇందులకు వారి నెంతయు నభినందింతును. "చుట్టముచూపుగావచ్చి వారు నాపై 'నుత్తరకాండము'నకుఁ బీఠిక వ్రాయు భారము మోపిరి. వారి ప్రణయానురోధమును గాదనఁజాల కియ్యకొంటినేకాని నాయయోగ్యతను గుర్తింపక కాదు.

'రామచరితమానసము' లేక తులసీరామాయణము నందలి 'సప్తమసోపాన'మైన 'ఉత్తరకాండము' లోకోత్తరమై యొప్పుచున్నది. ఇందుత్తరరామాయణకథ కన్పట్టదు. అట్లని దీని మహత్త్వమును కించపఱచుటకు వీలులేదు. తులసీదాసు 'కలికలుషవిధ్వంసన' మూహించి తనకృతి వినిర్మించెను. మానసావగాహన మొనరించు భక్తహంసములను 'సంసారపతంగ ఘోరకిరణములు' దహింపఁజాలవట.

పుణ్యం పాపహరం సదాశివకరం విజ్ఞానభక్తిప్రదం
మాయామోహాభవాపహం సువిమలం ప్రేమాంబుపూరం శుభమ్
శ్రీమద్రామచరిత్రమానస మిదం భక్త్యావగాహంతి యే
తే సంసారపతంగ ఘోరకిరణై ర్దహ్యంతి నో మానవాః.

ప్రత్యేకించిసప్తమసోపానమునకు 'అవిరళహరిభక్తిసంపాదిని' అను పేరుగలదు. (చూ-రామచరితమానస్. సం. శంభునారాయణ చౌబే-కాశీనాగరీప్రచారిణీ సభవారిచే ముద్రితము) కొన్ని ప్రతులయందు దీనికే 'విమలవైరాగ్యసంపాదిని' అనునామాంతరము గలదు. భక్తిజ్ఞానవైరాగ్య సామరస్యమును సాధించి తులసీదాసు యాతనామయ జీవుల కమృతరసాయన మందించెను. నాఁడు సాంఘికపరిస్థితులు విషమ పరిణామము పొందుచుండెను. దేశమున 'సంత'వాదము బయలుదేరి నిరక్షరాస్యులను బ్రహ్మజ్ఞానులను జేయుచుండెను. సగుణనిర్గుణభక్తి మార్గములమధ్య వైరుధ్యము హెచ్చు కాసాగెను. అంతర్ముఖత్వమును

భజించు సాధువులు లోకసంగ్రహావృత్తికి పాటువడలేకపోయిరి. నాటివరి స్థితులను తులసీదాసు కలికాలవర్ణన వ్యాజమున నుత్తరకాండమునందే చక్కగా వర్ణించెను.

సీ॥ చీకు చెవిటివారి...... (పద్యం 475)

"కల్పించిరి బహుపద్ధతు
లల్పులు మోహాంధులగుచు హరిభక్తిపథం
బల్పముగ నెంచి, యుంద్రా
కల్పాంతము ఘోరనారకంబుల వారల్". (పద్యం 481)

అంతర్బహిర్జగత్తులకు దేహళీదీపన్యాయమున వెలుగుఁ జూపఁ గలిగిన మహనీయుఁడు కావలసియుండెను. అట్టి మహనీయుఁడే తులసీదాసు. అతఁడు సకలకల్యాణగుణాభిరాముఁడైన శ్రీరామచంద్రుని తన కావ్యమున కధినేతగా వరించెను. అతఁ డన్యదైవము లన్నిగాక శక్తిశీల సౌందర్యములు వెల్లివిరిసినవాఁడు. కావున నేతత్కావ్యపఠనశ్రవణమన నాదికముచే లోకముపోకడ చక్కపడును. అంతర్బహిర్జగత్తులు రెండును, రామనామమణిదీపముచే వెలుఁగొందు నఁట.

"రామనామ మణిదీప ధరు, జీహ దేహరీ ద్వార్
తులసీ బాహర్ భీతర్ జో చాహసి ఉజియార్"

రామనామ మనెడు రత్నదీపము పెట్టి
జిహ్వ యనెడు ద్వారసీమ యందు
వెలిని లోనఁ గూడ వలయు నంతటి వెల్గు

హిందీసాహిత్యము Vol I

లోకమునకు శ్రుతిసమ్మతమైన హరిభక్తి పథము కావలెనఁట. అట్టి హరిభక్తి పథమును వీడి పెక్కు లల్పపథములు నిర్మించి రఁట,

"శ్రుతిసమ్మత హరిభక్తి పథ సంజుత విరతి వివేక్
తేహిన చలహినర మోహబస కల్పహి పంథ్ అనేక్."

కల్పించిరి............ (పద్యము 481)

తులసీదాసుని మతమున శివకేశవ భేదము కానరాదు.

"సంకరప్రియ మమద్రోహి సివద్రోహీ మమదాస్
తే నర కరహిఁ కలపభరి ఘోరనరకమహుఁ వాస్."

"శంకరప్రియుఁడై నాకును
వంకలు వెదకెడు నరుండు భవశత్రువు, మ
త్కింకరుఁడై వెలయు నరుఁడు
శంకింపం జనదు మనుదు రస్లోకములన్" (హిందీసాహిత్యము పు.168)

అట్లే భక్తిజ్ఞానమార్గములు రెండును వరణీయము లయ్యును, జ్ఞానమార్గము "అసిధారాతుల్య" మనియు భక్తిమార్గము సులభమనియు తులసిదాసుని మతము. భక్తిజ్ఞానముల యంతరువు నెంత హృద్యముగాఁ జెప్పియున్నాఁడో గమనింపుఁడు.

జ్ఞానవిరాగ విజ్ఞాన యోగములు పుం । రూపముల్ భక్తి స్త్రీరూప యగును
పురుషప్రతాప మేసరణిని ప్రబలమా । నబల సాజముగ దా నబలయ కద
అతిధీరులు విరాగులౌ వారలే కాని । విషయైషు లింతుల వీడలేరు
హరిమాయ జగతిని హరిణాక్షి రూపౌట । జ్ఞానిఘులె వీడఁజనరు సతుల
భక్తియును మాయ స్త్రీస్వరూపంబు లౌట ।
నిర్వు రొండొరుఁ దాము మోహించుకొనరు
భక్తిరామప్రభు ప్రేమపాత్రమగును ।
మాయ యెన్నఁగ నర్తకిమాడ్కిఁ దనరు. (పద్యము 588)

భక్తిమార్గ ప్రతిపాదకమగు నీయుత్తమగ్రంథమున "నుత్తరకాండము" సర్వోత్తమము. అందును కాకభుశుండి వృత్తాంతము ఉత్తర కాండమున కాయువుపట్టు.

నేఁడు భారతము తిరిగి తులసిదాసుని సమయమునందువలె నానాసంస్కృతీ సంఘర్షణముల దారితెన్ను లేక యుక్కిరిబిక్కిరి పాలగుచున్నది. పథచ్యుతమై, యుత్పథగామియై, యసత్పథకామియై నడచుచున్నది. నేఁడు విజృంభించు నీవిశృంఖలత ప్రశాంతి చెందవలెననిన రామాయణ సదృశ మహాకావ్యపారాయణమే శరణ్యము. తులసిదాసు కేవలము లోకసంగ్రహావృత్తికి పాటుపడిన వాఁడేకాదు. ఆత్మ

సాక్షాత్కారమును బొందిన మహానీయుఁడు. లేదా యిట్లు చెప్పఁదగి యుండును; మహాత్ముల యాత్మోన్నయనమునందు లోక సంగ్రహము దానొదిగి యుండును. రామాయణరచనారంభమున తులసిదాసు ప్రయోజన మిట్లుద్ఘోషించెను;

"నానాపురాణ నిగమాగమసమ్మతం య
ద్రామాయణే నిగదితం క్వచి దన్యతోఽపి
"స్వాంతస్సుఖాయ" తులసీ రఘునాథగాథా
భాషానిబంధ మతిమంజుల మాతనోతి"

తనయాత్మసుఖముకొఱకు రచించెనఁట. ఆత్మసుఖోపలబ్ధి యెట్లు కలుగునో గ్రంథాంతమునఁ దిరిగి తేటపఱచినాఁడు.

"యత్పూర్వం ప్రభునాకృతం సుకవినా శ్రీశంభునా దుర్గమం
శ్రీమద్రామపదాబ్జ భక్తి మనిశం ప్రాప్త్యైతు రామాయణం
మత్వాతద్రఘునాథ నామనిరతం స్వాంత స్తమశ్శాంతయే
భాషాబద్ధ మిదం చకార తులసీదాస స్తథా మానసం"

స్వాంత స్తమశ్శాంతిచే కలుగునని ధ్వనింపఁజేసెను. సుఖమన నంతరంగమునందలి పెంజీఁకటులు విచ్చుటయే! కావున తులసీరామాయణము సకలతర్వంతర్వర్తియగు తులసింబోలి పవిత్రమై, శిరోధార్య మగుచున్నది. ఏవంవిధ పావిత్ర్యముఁ బ్రోదిచేసికొనిన తులసీరామాయణము నాంధ్రీకరించి శ్రీ సూర్యనారాయణమూర్తిగారు కృతకృత్యులైరి. తొలుతొల్త తులసీరామాయణము నాంధ్రీకరించినవారు సుగృహీతనామధేయులు, కవిపండితవరేణ్యులు పిండిప్రోలు లక్ష్మణకవి సమకాలికులు నయిన శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు. వారు దోహా చౌపాయి ఛందములందే యనువదించి యున్నారు. అది యింకను వెలుఁగుఁ జూడవలసియున్నది. (ఈ విషయము. "పరిశోధన" యందలి వ్యాసమువలనఁ దెలియవచ్చినది.

## అనువాద పద్ధతి.

ధారాసిద్ధిఁగనిన శ్రీ సూర్యనారాయణమూర్తిగారి కవనము

కమనీయముగా నున్నది. తెలుఁగు కవిత్వపుఁ బొంకము, బింకము, తీరు తీపులు తెలిసి వా రనువదించిరి. కాకభుశుండి గరుడికి రాముని బాల్య లీలల నభివర్ణించు సందర్భమున కవిత్వము మధురముగా జాలువాఱినది.

తరుణారుణ సరసిజమృదు
చరణనఖద్యుతులు మీఱుఁ జంద్రప్రభలన్
సరసిజ పవిధ్వజాంకుశ
వరరేఖాంచితము లౌచు వఱలు పదంబుల్"
చరణముల గజ్జెలందెలు
గరము మృదుస్వనము లీను ఘుల్లుఘుల్లని బం
గరువు మొలకట్టు బహుమణి
విరచితమై శోభమీఱు విభుకటిసీమన్.
ఆనవులాట లాకిలకిలాటలు దూటుచు నేమనన్ విభుం
డానృపమంది రాంగణమునందున నీడను జూచి యాడు, నా
తో ననువొప్పఁ బల్లతుల దూకు దుముక్కన గంతువైచు గై
తో నరుదెంచు నేఁబరువుగొన్న నపూపముఁ జూపి త్రిప్పునన్.
(ఆం॥ తు॥ రా॥ ఉ॥ కాం॥ పు. 70, 71

ఈ కవికి శబ్దాలంకారలోభము మెండు. అట్లని కవితాసౌందర్య మును శబ్దాలంకారములకుఁగా బలివెట్టలేదు.

"రాజీవ భవార్చితపద
రాజీవ! మునీశ చిత్తరాజీవనిధి
భ్రాజిత రాజమరాళా
రాజీభసఖాన్వవాయ । రాఘవరాయా" (ఉ॥ కాం॥ పు. 37)

ఉత్తరకాండమున కథావిపర్యయము లెన్నేనిఁగలవు. సాధారణ ముగా శ్రీరామపట్టాభిషేకము యుద్ధకాండమునందే వర్ణింపఁబడును. తులసిదాసు పట్టాభిషేకవర్ణనము "ఉత్తరకాండము"నందు గావించెను. ఇందు సీతానిర్వాసకథ లేనేలేదు. కుశలవు లయోధ్యయందే జన్మించిరి.

వ రికిం బ్రతిబింబము లన
సురుచిరతను లమలగుణులు శ్రుతివిశ్రుతస

చ్చరితు లవు లవకుశాహ్వయు
లిరువురు సుతు లుద్భవించి రిల ధరణిజకున్. (ఆం॥తు॥రా॥ ఉ॥ కాం॥ పు. 28)

ఈవిధముగా కథను తారుమారుచేయుటలో తులసిదాసు మహత్తరమైన ప్రయోజనమేదేని యూహించి యుండును. ఉత్తరరామాయణకథ, తులసిదాసునకు దెలియదనుట చొప్పడదుకదా! మహాభక్తుండైన తులసిదాసు హృదయమున, లోకము నెదుట, శక్తి శీలసౌందర్యముల కధిష్ఠాన దైవతముగ దాను నెలకొల్పదలంచిన శ్రీరామచంద్రుని "ఉత్తరకాండకథ" నచ్చి యుండకపోవచ్చును. తిరిగి సీతానిర్యాసము సమర్థనీయముగఁ గనఁబడకపోవచ్చును. జనసామాన్యమునందు సగుణభక్తికి ప్రాధాన్యము నెలకొల్పవలెననిన, రామభక్తిని ప్రచారము గావింపవలె ననిన లోకులదృష్టి నకలంకముగ, నశంకితముగ, శ్రీరామచంద్రునిపై మరల్పవలెననిన నీకథ విడిచిపుచ్చుట మేలని భావించి యుండును. లేక తనస్వాంతఃసుఖమున కీకథ బాధకలిగించెనేమో! ఇది కేవలము నాయూహము. ఇందలి యౌచిత్యానౌచిత్యములు విపశ్చిద్వరేణ్యులు వితర్కింతురుగాక!

కాకభుశుండి చరిత్రమంతయు రమణీయ కవితాసన్నివేశమునకుపట్టు. కాకభుశుండి గరుడునకు శ్రీరామచరిత్రము తొలినుండి వినిపించును. (చూ. పు60-63.) ఇచ్చట కవిత్వము మఱింత రమణీయముగసాగినది. అచ్చటచ్చట శ్రీసూర్యనారాయణమూర్తిగారు అనువాదమున హెచ్చు స్వాతంత్ర్యముఁగూడ నవలంబించిరి. కాకభుశుండిదుర్గతిఁగాంచిభూసురుఁడు శంకరుని స్తుతించు సందర్భము గాంచుఁడు. ఆం.తు.రా.ఉ.కాం. పు 100.

అటు నాదుర్గతిఁ గనుఁగొని। కటకటపడి కరుణపేర్మి క్ష్మాసురవరుఁ డా
నిటలాక్షు మ్రోల నంజలి। ఘటియించి నుతించె గళము గద్గదికపడన్

పిమ్మట భూసురుఁడు "శ్రీశాంబుజాతాసనాద్యర్చితాంచత్పదాంభోజు..." అని దండకముచే స్తుతించును. ఇటమూలమున తులసిదాసు రుద్రాష్టక మనుపేర భుజంగప్రయాతవృత్తములందు సంస్కృతప్రాయమైన భాషయం దిట్టు మనోహరముగా వ్రాసియుండెను.

నమామీశ మీశాన నిర్వాణరూపం । విభుం వ్యాపకం బ్రహ్మవేదస్వరూపం
నిజం నిర్గుణం నిర్వికల్పం నిరీహం చిదాకాశ మాకాశవాసం భజేహం
నిరాకార మోంకారమూలం తురీయం । గిరాజ్ఞాన గోతీత మీశం గిరీశం
కరాళం మహాకాలకాలం కృపాళుం । గుణాగార సంసారపారం నతోహం
తుషారాద్రిసంకాశగౌరం గభీరం । మనోభూతకోటిప్రభా శ్రీశరీరం,
స్ఫురన్మౌళికల్లోలినీ చారుగంగా । లసద్భాలబాలేందు కంఠేభుజంగా
చలత్కుండలం భ్రూసునేత్రం విశాలం । ప్రసన్నాననం నీలకంఠం దయాలుం
మృగాధీశచర్మాంబరం రుండమాలం । ప్రియం శంకరం సర్వనాథం భజామి।
ప్రచండం ప్రకృష్టం ప్రగల్భం పరేశం । అఖండం అజం భానుకోటి ప్రకాశం
త్రయశ్శూలనిర్మూలనం శూలపాణిం । భజేహం భవానీపతిం భావగమ్యం.
కలాతీత కల్యాణకల్పాంతకారీ సదాసజ్జనానందదాతా! పురారీ ।
చిదానంద సందోహమోహాపహారీ! ప్రసీద ప్రభో! మన్మథారీ!
నయావత్ ఉమానాథపాదారవిందం । భజంతీహ లోకేపరేవా నరాణాం
నతావత్సుఖం శాంతిసంతాపనాశః । ప్రసీదప్రభో సర్వభూతాధివాసిన్!
నజానామి యోగం జపంనైవపూజాం నతోహం సదాసర్వదా శంభు తుభ్యం
జరాజన్మదుఃఖౌఘతాతప్యమానం ప్రభోపాహి ఆపన్న మాశీశ శంభో
రుద్రాష్టకమిదం ప్రోక్తం విప్రేణహరతుష్టయే ।
యే పఠంతి నరాభక్త్యాతేషాం శంభుః ప్రసీదతి॥

ఇచ్చట నీకవి తెలుఁగుప్రబంధముల నట్టితావులఁ గనవచ్చుదండకములఁగాంచి దండకమునే స్వతంత్రముగా రచించెను. ఇది యౌచిత్యమునకు భంగము కాదనుకొందును. ఈ కృతియందు దటనట "చ్యుతసంస్కృతి" దోషములు కనఁబడుచున్నవి. అవి లేకుండిన గ్రంథగౌరవ మినుమడించి యుండెడిది. ఉదాహరణమునకు, వీరువాడిన "పయోముక్కులు, పోని (పోనిమ్ము" అనునర్థములో ప 641). ఇతనికు సంధి నిత్యముగాఁగూర్చి వెగటు పుట్టించినాఁడు (చూ. ప. 661) ఇట్టివేమటి కొన్నికలవు. అవియన్నియు నితరగుణములముందరఁ బాటించి పెద్ద సేయఁదగదు. వీరు తమ పూడని, ఇంకని, జంకని, పుల్లవిడని, కూలిపైఁబడని దేగాక భవతారకమైన తమకృతిసంతానమును పితృపాదుల కర్పించి ధన్యజన్ములైరి. శ్రీరామచంద్రుఁడు వీరినెల్ల వేళలఁగాపాడుఁగాక!

—అయాచితుల హనుమచ్ఛాస్త్రి.

# మనవి

గతసంవత్సరమున ఆగస్టు నెలలో మా ఆంధ్రతులసీరామాయణము బాలకాండమును ప్రథమసంపుటముగా బ్రచురించి పాఠకలోకమున కందించితిని. అయోధ్యాకాండమును ద్వితీయ సంపుటముగాను, అరణ్యకాండాది లంకాకాండపర్యంతమును, తృతీయ సంపుటముగను బ్రచురించు తలంపుకలదు. ప్రకృత ముత్తరకాండమును మాత్రము జతుర్థసంపుటముగా బ్రచురించి మాసహృదయపాఠకుల కర్పించుచుంటిని.

ఈ మాతులసీరామాయణమున పూర్వభాగము షట్కాండములను శివాంకిత మొనర్చి సప్తమ కాండమగు నీయుత్తరకాండమును శివసామ్యులగు మాపితృపాదులపేర కృతియిచ్చితిని. ముందుగా వారి సమక్షమున దీనికి పుస్తకాకార మొసఁగి సమర్పించు నుత్సాహామే దీనిని ముందు ప్రచురించుటకు కారణమైనది. గ్రంథ మంతయు నక్రమమున నొక్కసారి ప్రచురింప నోపమి కార్థికలోపమే కారణము. బాలకాండమునకువలెనే ఈ యుత్తరకాండమునకును ముద్రణాదివ్యయ మంతయు శ్రీమానాయనగారే వహించి యీకృతికి వెలుగుమొగముఁ జూపిరి. వారికీర్తి చాటుటకిది శాశ్వతపతాక కాగలదని భావించుచు కృతజ్ఞుఁడనై కృతాంజలినై వారికీ కృతి సమర్పింతును.

## తులసీదాసుని రామచరితమానసము — ఉత్తరకాండము

తులసీదాసమహాకవియుఁ డీరామచరితమానసమును తనస్వాంతస్సుఖమునకే వ్రాసికొంటినన్నను ఆనాట బదునాఱవశతాబ్దిని జెలరేగి నిత్యము బ్రజల నెదుర్కొనుచున్న వివిధసాంఘిక సామాజిక మతకల్లోలములను శాంతపరచి తనరచనముద్వారా సర్వమత సామరస్యము నెలకొల్పి శాంతవాతావరణమును గూర్చెను. గ్రంథరచనమునకు శ్రీకారముఁజుట్టి తనకృతిముఖమున నాటి జటిలసమస్యల నెన్నింటినో చిక్కడ

లించి మతసామరస్యమూలకమగు శాంతిస్థాపనము ద్వారా కావ్యప్రయోజనమగు విశ్వకల్యాణమును సాధించి సంకల్పసిద్ధుఁ డయ్యెను. మహాత్ముల స్వాంతస్సుఖ మన విశ్వకల్యాణ మూలమైనదే కదా!

ఉత్తరకాండమున రామప్రభువు భరతునితల జడకట్టినజుట్టు నాత్మకరంబులఁ జిక్కుడలించి నట్లే తులసీప్రభువును భారతావనిని గరుడుగట్టిన మతాంధ్యమును, మూఢవిశ్వాసములను, జడకట్టిన జటిల సమస్యలను తన రచనముద్వారా చిక్కుడలించెను. మోహగ్రంథుల చిక్కుడలించు దారిఁజూపెను. మాయదారి మాయనుండి జీవుఁడు తప్పించుకొను దారిఁజూపెను. భక్తిజ్ఞానముల యభేదప్రవృత్తిని జూపుచు తత్తత్ప్రథావలంబములఁగల సాధకబాధకముల సహేతుకముగ నిరూపించెను. సగుణనిర్గుణారాధనము లందలి సుగమాగమభంగు లెఱింగించెను. మాయాభక్తు లొండొంటఁగల పరస్పరస్పర్ధాకారణమును దెలిపి భక్తివిజయమును, దన్మహిమాధిక్యమును జాటెను. భవామయముకికి రామభక్తి యేకైకసాధనమనెను. భక్తిమణిదీప ప్రభావమును దెలిపి దానిని బడయు మార్గమును జూపెను. రామునికంటె రామనామమును, దన్నామజాపకుఁడగు భక్తుఁడును ఘనమనెను. తులసీగోస్వామికి రామనామమునగల భక్తిశ్రద్ధావిశ్వాసముల నుగ్గడింపఁ బూనుట యేటి కేతాము నెత్తుట వంటిది. రామస్వామి ఆదర్శప్రాయముగ సుఖసమృద్ధులకు ప్రసిద్ధమగు రామరాజ్యము నెలకొల్పగా తులసీస్వామి తన రచనముద్వారా విశ్వమున శాంతియుతమగు ధర్మరాజ్యము నెలకొల్పెను. ఈ యుత్తరకాండమున కవి కథావస్తువునకు ప్రాధాన్య మీయక గురుశిష్యసంవాదము బోలు గరుడకాకభుశుండి సంవాదము నొండేర్పరచి వారిచే పెక్కు తాత్త్విక విషయికములగు ప్రశ్నోత్తరములు, శంకాసమాధానములు గావింపించి వివాదాంశముల నెన్నియో పరిష్కరించెను. మహాభారతమున యక్షప్రశ్నముల కుత్తరము లిప్పించి నట్లేందు

గరుడుని సప్తప్రశ్నముల కుత్తరము లిప్పించెను. సదసల్లక్షణముల వర్ణించి సత్సంగ మహిమమును వేనోళ్ల బొగడెను. భక్తితత్త్వనిరూపణమున దులసీదాసుఁ డుత్తరకాండమునఁ జర్చించిన దేమియను ప్రశ్నమునకు జర్పింపని దేమి యనునదే సమాధానము.

శ్రీరామచరితమానస వ్యాఖ్యాతలు శ్రీరామనరేశ త్రిపాఠీపండితు లన్నటు లీయుత్తరకాండము కవితా సౌందర్యమున నెట్లున్నను భక్తితత్త్వవిచారణమున నుచ్చకోటి కెక్కవలసిన ప్రశంసాత్మకమగు రచనము. తులసి ఇందుఁ దనసంపూర్ణ ప్రతిభ నుపయోగించి నట్లనిపించును. రామకథ కష్టాంతమైనదైనను దనకావ్యము సుఖాంతము జేయగోరి కవియిందు తనబుద్ధి పూర్వకముగనే సీతాపరిత్యాగకథను విడిచి రామరాజ్య సుఖవైభవవర్ణన మొనర్చి సమాజమున వ్యక్తియలవఱచుకొనఁదగు రాముని యాదర్శప్రవర్తనము, ననుకరణీయ గుణములను బేర్కొని ధీరోదారవర్తనమునకు వలయు సందేశముల నిచ్చెను.

మానసికామయ పీడ్యమానులగు కలికల్మషగ్రస్త జనులఁ గూర్చి తులసీదాసుని కోమలహృదయ మెంత నొగిలి వాపోయెనో, వారి భవామయ నివృత్తికి, కలికల్మషవిముక్తికి నతఁ డెంత పాటుపడెనో యనునంశ మాతని రచనమున బ్రత్యక్షరమునఁ బ్రత్యక్షమగుచునే యుండును. మోహజనిత మానసికరోగగ్రస్తులగు కష్టజీవులకు తాను దిక్కయ్యెను. వారికి సద్గురువైద్యునిఁ జూపి రోగనిదానము, చికిత్సా విధానము నూహించెను. జపతపోవ్రతాది సాధనౌషధముల వాడినను నయముగాని వారిరోగముల శ్రద్ధానుపానముతో రామభక్తిసంజీవిఘుటిక నూటిపోసి నయమొనర్చెను. పథ్యాపథ్యనిర్ణయ మొనర్చి ఇంద్రియ నిగ్రహమన్న పథ్యపానముల నిచ్చెను. విషయ కుపథ్యముల దరిఁజేరనీక రోగవిముక్త దుర్బల శరీరులకు విరాగబలకరౌషధంబుల వాడి జిజ్ఞాసాక్షుధఁ గల్గించి తుదకు వారిని సువివేకమయాబ్ధిలో నారోగ్యస్నానము

చేయించనిదే కొడువలేదు. ఇందుత్తరకాండమున కవి కాకభుశుండి పాత్రమున ప్రతిబింబించు నట్లుండును. తానే కాకభుశుండి పాత్రమై బాలరామునితో దాబూచులాడు కొనుచున్నట్లుండును. భక్తితత్త్వము నిరూపించుచు, సగుణారాధనవాదమును బ్రతిపాదించి లోమశుని నిర్గుణారాధనవాదము ఖండించునెడ తులసీవాణియే భుశుండిగొంతున వినిపించును. ఇటు లీమానసోత్తరకాండ రచన విశేషములు పేర్కొన్న కొలఁది కొలఁది మీఱుచునే యుండును.

తులసీ ప్రసాదితమగు నిట్టి రామభక్తి ప్రసాదమును మున్ను [1] కొందఱు కవీంద్రులు తెలుఁగునాట నాబాలవృద్ధులకు సుసేవ్యమగు నట్లు భక్తిమణికీలితంబగు గద్యపాత్రమున వడ్డించి యందించిరి. ఆ భక్తి రసాయనమునే [2]కొందఱు తమ అభిరుచులనుబట్టి భక్తజనగేయంబులౌ గేయ పాత్రములలోను, [3]మఱికొందఱు భక్తిసంపాద్యంబులౌ పద్యపాత్రంబులలోను బోసియందించిరి. మానసామృతపానులగు పాఠకులు తమపాత్రతాభిరుచులను బట్టి యీరామభక్తి రసాయనమునేపాత్రముతోనైనఁ గ్రోలవచ్చును. తులసీసుధీమణి వాక్సుధామధురిమ భక్తి మణిమయములయిన జాతీయపాత్రముల నందించినను, దేశీయపాత్రముల నందించినను, మఱియేమార్గకవితాపాత్రముల నందించినను భక్తలోకమునకు శ్రుతిప్రేయమే యగునుగదా !

సుధాపాత్ర ప్రశస్తి తదంతర్గత సుధావిషయికమైనదేకాని పాత్రనిర్మాణ లోహవిషయికమైనది కానట్లే, యీ మాఆంధ్రతులసీ

---

(1) ఈ తులసీకృత రామచరితమానసమును దెనుఁగున గద్యమున వ్రాసినవారు శ్రీ పసుమర్తి శ్రీనివాసరావుగారు (2) గేయకవితలో వ్రాసినవారు. మహోద్దండ పండితకవులు శ్రీ శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి, మండనహరికామయకవిగార్లు, మంజరీద్విపదను వ్రాసినవారు. రామతీర్థసేవాశ్రమస్థాపకులు పూజ్యపాద శ్రీశ్రీ కేశవతీర్థస్వామివారు (3) పద్యకవితలో వ్రాసినవారు. శ్రీ భాగవతుల నృసింహశర్మగారు (బరహంపురం) ప్రకృతమున నీయనువాదకర్త యొకఁడును.

రామాయణ ప్రశస్తియు రామనామ పునీతమైన తులసీతీర్థవాసనా వాసితమైనదే కాని మదీయ భాషాజ్ఞాన కవితాచాతుర్యోపార్జితము కాదని మనవి జేసికొందును. ఇందు నాయనువాదమున గుణవిశేషము లేవేని చూపట్టిన నవి మూలగ్రంథకర్తవే. కాని ఇందలి దోషభారమును మాత్రము మూలకారున కాపాదింపక మదీయ ప్రమాదాజ్ఞానజనిత ముగా మన్నించి నాకే విడిచెదరు గాకయని మా సహృదయ పాఠకుల వేడుకొందును.

## కృతజ్ఞతాంజలి

మా బాలకాండమునుబంపి కోరినంతనే యమూల్యములగు సమీక్షలను తమ పత్రికాముఖమున వెలువరించిన [1] భారతి; [2] ఆంధ్రపత్రిక; [3] ఆంధ్రప్రభ; [4] స్రవంతి; [5] రామదర్శన, [6] ప్రజావాణి, [7] పుస్తకప్రపంచాది పత్రికల సంపాదక మహాశయులకును, నాకృషి కత్యంతప్రోత్సాహమొసగుచు తమ అమూల్యాభిప్రాయములంపిన పండితప్రకాండులకును నా హృదయపూర్వకములగు కృతజ్ఞతాంజలు లర్పించుకొందును.ముఖ్యముగా మాగ్రంథప్రచురణోద్యమమున కత్యంత ప్రోత్సాహకులైనముఖ్యగుసారస్వతాభిమానులను మాత్రమిందుదెల్పకున్న కుండనుండజాలను. వారిలో ప్రప్రథములు. కొప్పూరు సంస్కృతకళా శాల ప్రధానాచార్యులు. శ్రీ కేశిరాజు వేంకటనృసింహ అప్పారావు గారు ఎం. ఏ. వీరు మాగ్రంథమును సంస్కరించి యిచ్చుటయే కాక తమ యమూల్యమగు తొలిపలుకుతో గ్రంథప్రాశస్త్యమినుమడింపఁ జేసిన సహృదయులు-, తా మున్నతోద్యోగులయ్యు, సంతతవాఙ్మయ

చూ:- (1) భారతి 1956 సం. సెప్టెంబరునెల సంచిక. (2) ఆంధ్రపత్రిక 7-10-56 తేదీని, హేమలంబి ఉగాది సంచికలో దుర్ముఖి సం॥ర గ్రంథాల సమీక్ష సింహావలోకనము. (3) ఆంధ్రప్రభ 28-10-56 తేదీ. (4) స్రవంతి 57 సం॥రం మార్చినెల సంచిక (5) రామదర్శనము 56 డిశంబరునెల సంచిక (6) ప్రజావాణి కన్నడదినపత్రిక 10-3-57 తేదీ. (7) పుస్తకప్రపంచ మైసూరుస్టేటు. కన్నడమాస పత్రిక 57 మార్చినెల సంచికలు ఆంధ్రతులసీరామాయణ సమీక్షల బ్రచురించినవి.

కృషి నెడ తెలుపి లేనివారయ్యు నన్నెఱుఁగకపోయినను మా గ్రంథ మంపినంతనే అత్యంతవాత్సల్యమున "ఆంధ్రతులసీరామాయణ సమీక్ష" వ్రాసి పంపించిన సారస్వతాభిమానులు. మదరాసు విశ్వ విద్యాలయాంధ్రభాషాశాఖాధ్యక్షులు. విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ఎం. ఏ. వీరు సమీక్షాముఖమున మాకృషికి గల్గించిన ప్రోత్సాహమింతింతయనరానిది. పిమ్మటఁ బేర్కొనఁదగినవారు. హిందీసాహిత్యౌన్నత్యము దాక్షిణాత్యులకును, ఆంధ్రసాహిత్యౌన్నత్యము నౌత్తరాహులకును పరిచయమొనర్చు నుద్గ్రంథగ్రంథకర్తలు, కేంద్రప్రభుత్వహిందీభాషోపన్యాసకులునగు "సాహిత్యరత్న" శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రిగారు. ఎం. ఏ. (త్రితయ) మదరాసు. నే నీమధ్య మదరాసు వెళ్ళినపుడు వీరిని సందర్శించి హిందీసాహిత్యమంతయు తమకు కరతలామలకప్రాయమైనదికదా! మా తులసీరామచరితోత్తర కాండము నకొకింత పీఠిక వ్రాసిపెట్టుఁడని కోరితిని. బహుకార్యవ్యాపృతులయ్యును వారు నాకోరికను మన్నించి యీ మాయుత్తరకాండమునకు మహోత్తమమా పీఠిక వ్రాసి పంపించుటేకాక తమ్ము నేసందర్శించిన ఫలముగానోపు. నారూపుజాడలు గ్రంథమునకెక్కించి మా అపరిచితపాఠక లోకమునకు నా రూపమూహించుకోదగు చిన్నెలేర్పరచి పరిచితునిజేసి యిందు నాఛాయాచిత్రములేనిలోపముగూడ దీర్చిరి. ఇట్టి సత్సౌహార్దహృదయులగు సారస్వతమూర్తులకు నా కృతజ్ఞతాంజలిశతము లర్పించుకొందును. వీరు తమ సహజసౌజన్యసౌహార్దములతో నాకారోపించి వ్రాసిన యంతటి గుణవిశేషములు, శక్తిసామర్థ్యములు నాకు లేకున్నను అమోఘములగు పండితవాక్కు లాశీస్సులుగా భావించి వాని శిరసావహింతును.

ఆంధ్రపత్రిక, భారతిమున్నగు పత్రికలసమీక్షలన్నియు గ్రంథ విస్తరభీతిచే నిందుజేర్పజాలనైతిని పాఠకమహాశయు లింతకుముందే యవి పత్రికాముఖమున జదివియుందురుగదా యని ముద్రితసమీక్షల

విడిచి పండితాభిప్రాయములను మాత్ర మనుబంధమున నిందుఁ బొందుపర చితిని. పండితులు తామూ గుణములే కాని దోషముల గణింపని సహృద యు లగుట కతమున మాగ్రంథమున గుణములనే యుగ్గడించిరి.మాకృషి ప్రోత్సాహమునకు వారొసర్చిన గుణప్రశంసతో మాకృతి సర్వాంగ సంపూర్ణమైనదని మురియక యితోఽధిక శ్రద్ధతో మిగులు కాండములు కూడ సంస్కరించి ప్రచురింప బ్రయత్నింతుమని విన్నవించుకొందును. బాలకాండమును గూర్చిన అభిప్రాయములు, సమీక్షలు నిందు జేర్ప వలసి వచ్చుటచే ముందుగ నుత్తరకాండ పీఠికయు, తత్సంబంధ వివర ణములను, వెనుక బాలకాండమును గూర్చిన సమీక్షలు, నభిప్రాయ ములు ననుబంధింపఁబడినవి. ఈముందు వెనుకల తారతమ్యమునకు విజ్ఞు లన్యథా భావింపకుందురు గాత.

తనుదాను సొంతముగా బ్రచురించు కొనుచున్న గ్రంథమున నొరుల యభిప్రాయములు సేకరింపవలసివచ్చినచో నేయొకింతేని యాత్మప్రశం సయు నాత్మగ్రంథప్రశంసయు బ్రకటించుకొనిన ట్లుండక తప్పదు అయిన నీప్రశంసలు చాలవరకు మూలగ్రంథకర్త కందవలసినవే కాని యనువా దకుని సొత్తుకావుగదా!అమరకావ్య కర్తయగు తులసీమహాకవికృతివట్టున పండితులు చూపు ప్రశంసాత్మకమగు శ్రద్ధాసక్తులు వెల్లడింపకుండు టెట్లు? అదియును గాక తులసీ మానసతీర్థరాజమున రామచరితామృతముఁ గ్రోలవచ్చు పాఠకతైర్థికులకు మానసమహిమాభివర్ణన మొనర్చి తద వగాహనబుద్ధి నెక్కొల్పి పుణ్యము గట్టుకొనుదును తలంపున వాదోడుగా నీపెద్దల సుద్దుల నిందు బొందుపరచితిని. మఱియు మానసావగాహ మొనర్ప వెనుక ముందాడువారికి సుగమప్రవేశ సాధనములుగా మానస

సోపానప్రాయములైన పండితాభిప్రాయముల నిరువంకల నీ మానస గ్రంథమున కనుసంధించితిని. మాపాఠకతైర్థికు లెద్దరినుండియైనను నిరపాయంబుగ మానసావతరణ మొనర్చి రామచరితామృత స్నానపానముల సకలకలికలుషవిముక్తు లగుదురుగాక !

కృష్ణంపాలెం }
23-8-57 }

ఇట్లు, విధేయుఁడు,
మైలవరపు సూర్యనారాయణమూర్తి.

# విషయానుక్రమణిక



# కృతి సమర్పణము.

ఉ. తొల్లిఁటి యాఱుకాండములు ధూర్జటికిం గృతిఁ బెట్టి భక్తిభా
వోల్లసితంబు రామచరితోత్తరకాండసకృతిన్ బహూకృతిం
దెల్ల మొనర్తు భక్తిఁ బితృదేవుల కంకితముం బొనర్చి నేఁ
దల్లిని దండ్రి మించు నొకదైవము లేదను సూక్తి పెంపునన్.

క. వ్యాప్తిని, నిశ్శ్రేయస సం
ప్రాప్తి కనువు, రామచరితమానస కృతికిన్
సప్తమ సోపానం బగు
సప్తమ కాండంబు దీని జనకున కిడుదున్.

ఉ. తారక మంత్ర రాజ జపతత్పరతన్ శివసామ్యు లంచు నే
నేరిమిఁ దాతపాదుల గణించి రచించితి వారిపేర నీ
తారకనామ భవ్యచరితం బిది పాపవిదారకంబునై
యారవిచంద్ర తారకము నై భవతారక మై తనర్చుతన్

## కృతి ప్రశంస.

తే. సప్త సంతానములలోఁ బ్రశస్తము కృతి
కృతుల సప్తమకాండ సత్కృతియు మిన్న
దుర్గమంబైన స్వర్గాపవర్గ పదవి
కమరు సప్తమ సోపాన మగుటఁ జేసి.

తే. పూడ దింకదు జంకదు పుల్లవిడదు
కూలి పైఁబడ దేనాఁడు గొడ్డువోదు
దొరల చాయల పాల్గాదు తఱుగు పడదు
సప్తసంతతులం గృతిసంతతి యిది.

తే. కృతిపతుల కీర్తిలతల శేకెత్తఁ గొలిపి
దశదిశలఁ గ్రమ్మి యారవితారకమ్ము
సద్యశస్సౌరభముఁ జిమ్మి శాశ్వతమ్మె
సుకృతిసంతాన మిది మహాసుకృతి కొదవు.

షష్ఠ్యంతములు.

క. సంతత హరిచరిత రత
స్వాంతునకున్, సుగుణగణనిశాంతునకు, సదా
శాంతున, కనఘకథాను
చ్చింతనదూరునకు, సాధుచింతనుఁ, కిలన్.

క. అతిశాంత ప్రకృతికి, స
ద్వ్రతరతమతి, కాంధ్రతులసిరామాయణ స
త్కృతి సుప్రకాశ సుకృతికిఁ,
దతసంతర్పిత పితృప్రతతికిన్, బితకున్.

క. శిష్టునకు, సదాచారవి
శిష్టునకున్, సత్తపోవశిష్టునకుఁ గృపా
విష్టునకును, సంతత సం
తుష్టునకుఁ, బ్రకృష్టగుణ వినుత శిష్టునకున్.

క. పంచానన పంచాయత
నాంచిత పూజాభిరతున కనఘునకు సదా
పంచాక్షరీమహత్తు
ర్యంచిత మంత్రార్థజపిత కస్మత్పితకున్.

క. సజ్జన సమ్మాన్యుండు, న
మజ్జన పాపాపహరణ మాన్యసుగంగా
మజ్జనసఫలీకృతజని
మజ్జనకుఁడు, రామమూర్తి మహితాత్మునకున్.

క. ఏవంవిధ గుణనిధి, పిత
కే వందనపూర్వకముగ నీ నేర్చిన సీ
తావిభు చరితోత్తరగా
థావిధ మెఱిఁగింతు సావధానము వినుఁడీ.

# కృతిపతులు



భవవిదారక తారక భవ్యమంత్ర
సంతతధ్యాన మనన దీక్షారతుండు
శ్రుతిమతాచారపరుఁడు మత్పితృవరుండు
రమ్యగుణమూర్తి, సత్కీర్తి, రామమూర్తి.

శ్రీ

# ఆంధ్రతులసీరామాయణము.

## ఉత్తరకాండము.

★

### మంగళాచరణము.

శా. కేకిగ్రీవవినీలు విప్రపదవంకేజాంకితోరస్థలున్
గాకుత్స్థున్ గరుణాసముద్రు విలసత్కంజాయతాలోకనున్
క్ష్మాకన్యాయుతు ఋక్షవృక్షచరరాట్సౌమిత్రిసంసేవితున్
రాకాచంద్రనిభాస్యుఁ బుష్పకవిమానస్థున్ బ్రశంసించెదన్. 1

క. భూజాకరలాలిత మం
భోజభవాభవసుసేవ్యమున్ జింతకహృ
ద్భ్రాజితమధుపాబ్జము రఘు
రాజపదాంబుజయుగంబుఁ బ్రణుతింతు మదిన్. 2

తే. మొల్లవలె మల్లెవలెను జాబిల్లివోలెఁ
దెల్లనైవానిఁ గోర్కులయిల్లువాని
నుల్లమునఁ బెల్లు కనికర మల్లువాని
మరుని బుగ్గి యొనర్చిన మహీమువాని
దుగ్గిసామినిఁ గొల్తుఁ గేలొగ్గి భక్తి.

### అయోధ్యను రామవిరహాతురులగు పౌరులకు శుభశకునము లగుట.

ఉ. అందు నయోధ్యలోని ప్రజలందఱు రామవియోగతప్తులై
కుందుచు బక్కమేనుల రఘుప్రభురాకకు వేచివేచి రాఁ
డెందుల కింత కాయనఘుఁ డింకఁ జతుర్దశవత్సరావధిన్.
గందుము వెల్తిగా దినమొకం డని యూర్పునిగుడ్చు నంతలో. 4

చ. శుభశకునంబు లంతఁ బొడచూపెఁ బ్రసన్నము లయ్యెఁ జిత్తముల్
విభువగు రాకఁ దెల్పెనన వీడు ముదావహమై తలిర్చె న
చ్ఛుభగతి "భూమిజాత, మనుజుండును దోనను దేర వచ్చె నా
ప్రభుఁ డను వార్త వచ్చె నన రాణులు సమ్మదమంది రాత్మలన్. 5

చ. భరతుని దక్షిణాక్షిభుజపార్శ్వము లం దదరొందె నంతలో
నరుసమునొందె యాతఁడు ముదావహమౌ శకునంబు నెంచి వా
సర మవలంబ ముండె నిఁక స్వామి ననున్ ఖలుఁ డంచు నెంచె నో
పురి కను దేరఁ డింతకును బోల్ప మదేమి కతంబగున్ గటా. 6

తే. రామపాదారవిందానురాగి యతఁడు
లక్ష్మణుఁడు మహాభాగ్యుఁ డిలన్ దలంప
ననుఁ జెనంటిగఁ బిన్నటనాఁటనుండి
యెఱిఁగి కానోపుఁ దోడరానీఁడు విభుఁడు. 7

ఉ. నా చెయిదంబు లెల్ల రఘునాథుఁ డెఱింగిన నిస్తరింపఁగా
నోచను వేయుగాలకుఁ గనుంగొన దీనదయాళుఁ డాతఁడున్
సైఁచు ద్రితాపరాధముల సైరణతోడ న దొక్కఁడె మాత్రమై
తోఁచు సతీసహోదరులతోఁ గననౌ విభు నంచుఁ దోఁచెడిన్. 8

హనుమంతుఁడు భరతునకు రామాదులయాగమనంబుఁ దెలుపుట.

తే. గడువు కడచినఁ బ్రాణముల్ గడనఁబెట్టు
కున్న నాయట్టి ఖలున మఱొక్కఁడున్నె
యంచు విరహాబ్ధిమగ్నుఁడౌ నతనిఁ గడప
నుడుపమై వచ్చె ద్విజరూప మూని హనువు.

మ. కృశగాత్రుండుఁ గుశాసనుండు నయి కైకేయీసుతుం డట్టు దృ
క్కుశజాతంబుల నీరునింపి మదిఁ గాకుత్స్థున్ రఘూత్తంసునిన్

భృశచింతన్ జపియించుచుండఁగని సంప్రీతిన్ మరుత్సూతి ప
ల్కు శరీరంబు గగుర్పడన్ జలముగారోఁగ్గవన్ దద్దయున్ 10

క. శ్రవణసుధామధురోక్తులఁ
బవనజుఁడనె ననఘ! నెవని భావించుచు రే
బవలిటు విరహాకులుఁడయి
యవిరతము జపింతొ యాతఁ డరుదెంచె నిదే. 11

మ. సురలగ్గింప సురారిఁగూల్చి సమరక్షోణిన్ సురత్రాత భా
స్కరవంశుండు రఘూద్వహుండిచటికిన్ భూమిజానుజోపేతుఁడై
యరుదెంచెన్ వినుమన్న" యన్న భరతుం డాపల్కు విన్నంతనే
మఱచెన్ దుఃఖములన్ దృషార్తుఁడు తృషన్ మాడ్కిన్ సుధాలబ్ధిచే 12

ఉ. అమ్మహనీయుఁడౌ రఘువరానుజుఁ డాతనిఁగాంచి తండ్రి! నా
కిమ్మెయిఁ గర్ణపర్వముగ నిట్టిముదావహమౌ నుదంతమున్
సమ్మతిఁదెల్పు నీసుకృతశాలి వెవండవొ తెల్పుమన్న "నేఁ
డెమ్మెరబిడ్డ నయ్య జగతిన్ హనుమంతుఁడ నన్న కీశుఁడన్. 13

క. దీనదయాళుండౌ భగ
వానుని రాముని భటుండఁ బ్రభువర! యనఁగా
నానుడి వినఁగనె భరతుఁడు
వానినెడన్ గూర్చి యనె నవర్ణ్యప్రీతిన్. 14

తే. ఒడలు పులకింపఁ గన్నీరు వొడమఁగనులఁ
"దరుచరోత్తమ! నేఁడు నీదర్శనమున
క్లేశముల్ వాసె, రాముఁడు లీలనన్ను
గూడినటులాయెనని మఱి కూర్మిమీఱ. 15

ఉ. మాటికిఁ దాటకాంతకుని మంగళమారసి యే మొసంగ శా
ఖాటవరేణ్య! యిట్టిప్రముదావహవార్త వచించినట్టి నీ

కేటికి వేయి మాటలిఁక నీనుడిఁబోలిన హర్షవార్త నె
ప్పాట మఱెందుఁగాన నెటువాపుకొనంగల నీఋణంబికన్. 16

క. వినిపింపు మింక త్రిభువనవినుతచరిత్రము నటన్న వినమిత శీర్షుం
డనె నిట్లు హనుమయాతని । కినకులగుణగాథ సకలమింపుదలిర్పన్ 17

శా. కైకేయీసుతుఁ డాడెనో యనఘ! నన్ గారుణ్యమొప్పారఁగా
నాకాకుత్స్థనరుండు దాసుఁడని యెప్పైనన్ మదిఁ బెట్టునే
వాకోవే! యనునంత మేను బులకింపన్ వాయుజుండాడె నిన్
వాకోనౌనె చరాచరాధిపుఁడె సంభావించు నీశీలమున్. 18

క. రాముని ప్రాణప్రియుఁడవు
నామాట నిజమ్ము నమ్ము నరనాథ! గుణో
ద్దాముఁడ వెటుకాకుండని
వేమఱు నాభరతుఁగలిసి ప్రేముడిమీఱన్ 19

తే. వానిపదముల శిరమంట వ్రాలి మ్రొక్కి
వేడ్క వీడ్కొని రామభూవిభునిఁ జేరి
సేమమెఱిఁగించె నంత నాస్వామి సపరి
వారుడై పుష్పకము నెక్కి బయలువెడలె. 20

మ. భరతుండిందు నయోధ్యకేగి యెలమిన్ భ్రాత్రాగమంబున్ వెసన్
గురుమాత్రాదులకున్ బురీజనులకున్ గూర్మిన్ వచింపన్ విభుం
డరుదెంచెన్ గుశలంబుగాననుచు విన్నంతన్ శుభోదంత మా
పురవాసుల్ నరనారు లిండ్లు విడి సమ్మోదమ్మునన్ వచ్చిరా. 21

క. తల్లులు సతీమతల్లిక
"లల్లదె రాముండువచ్చె" ననువార్త వినన్
జొల్లసమునఁ బఱతెంచినఁ
దల్లులకెఱిఁగించె సుతుఁడు తచ్ఛుభవార్తన్ 22

క. ఫలపుష్పదధిసుమంగళ
తులసీదళరోచనములు దూర్వాంకురముల్
పాలఁతులు బంగరుపళ్ళెర
ములనిడి తెచ్చిరి సుగీతములఁబాడుచు౯ాగిన్. 23

ఉ. వెన్నడివచ్చు పిల్లలను బెద్దలఁ దోడ్కొనకుండ యున్నవా
రున్నటులేగుదెంచ్రితు జను లొండొరుల౯ "గనుఁగొంటిరే? తటి
త్వన్నిభగాత్రు రాము రఘునన్వయుని మీరా" రని మాటికడ్డు కొం
చన్నగరు౯ గరంబలరె నావిభురాక నెఱింగెనో యనన్. 24

భరతుఁడు సపరివారుఁడై రాము నెదుర్కొన నేగుట.

సీ. శీతమందసుగంధవాతముల్ వీచెను
సరయూతటిని స్వచ్ఛసలిలయయ్యె
ద్విజగురుపరిజనానుజయుతుండై యన్న
కెదురేగె భరతుఁ డందెలమిమీఱ
నింతు లుప్పరిగల నెక్కి యుప్పరవీది
నేతెంచు పుష్పక మెలమిఁగాంచి
మధురస్వరంబుల మంగళగీతముల్
స్వరనైపుణి యెసంగఁ బాడి రపుడు

తే. రామరాకాశశిం గాంచి రఘువరపుర
సింధు వొక్కుమ్మడిని బొంగె స్త్రీజనంబె
లహాయలై పెల్లుకోలాహలంబుసేయఁ
దిరిగి విభుఁ డట్లు పురికి నేతెంచువేళ. 25

క. రవికుల కమలాహర్పతి
ప్లవగుల కనెఁ బురముఁజూపి "భటవరులారా!

యవలోకింపరె యీపురి
ప్రవిమల మతిపావనంబు రమణీయమునా. 26

శా. వైకుంఠంబును మత్ప్రియాస్పదముగా వర్ణించినన్ వేదముల్
నాకీప్రోల్ ప్రియమైన భంగి నది కానన్ రాదు ప్రేమాస్పదం
బై కన్గోరిదెవారొకాని కడు రమ్యంబైన యీప్రోలెసూ
నాకుంబుట్టిన యూరయోధ్య యిది పుణ్యస్థానగణ్యంబగున్. 27

క. ఈపురమున కుత్తరదిశ
నేపారుచుఁ బాఱు సరయు వెవ్వారిల నా
యాపగ జలకము లాడుదు
రాపుణ్యులు మత్సమీపమందుదు రెలమిన్ 28

ఉ. "కోసలరాజధాని యదిగో! సుఖరాశి యయోధ్య, తత్పురీ
వాసులు నాకతిప్రియులు, వారలకేనుఁ బ్రియుండ" నన్న సం
తోసమునొంది యాకపితతుల్ ప్రభువాణికి ధన్య ధన్యవో
కోసలరాజధాని రఘుప్రభుఁడే నిను మెచ్చె నం చనెన్. 29

ఉ. అమ్మెయివచ్చు నాపురజనావళిఁ గాంచి పురోపకంఠ మం
దిమ్ముగ నాగ నాజ్ఞ నిడియెన్ విభుఁడంతటఁ బుష్పకమ్ము క్షి
ప్రమ్మున నేలడిగ్గఁ బరివారముతో డిగి యాతఁ డావిమా
నమ్ముఁ గుబేరుపాలికిఁ జనన్ బనుపన్ విరహార్తితోఁ జనెన్ 30

రాముఁడు భరతాదుల నెల్లర యధార్హముగఁగలిసి గారవించుట.

ఉ. రామవియోగవేదనను రంగుఁదొఱంగిన బక్కనేనులన్
రామదిదృక్షు నచ్చిరల రామపురీనరనారులెల్లరున్
ఆమెయి రాముఁడున్ శరశరాసనముల్ మహిఁబెట్టి తమ్ముతో
నాముని వామదేవచతురాననసూనుల యంఘ్రు లంటుచున్, 31

తే. ముదము తళుకొత్తఁ బులకలు మొలకలెత్తఁ
బత్తిఁ బఱువెత్తి గురువరుపదములొత్త
సేమమే రామ! యని మునిసేమ మడిగి
యక్కుఁగూర్చిన నాకకుత్స్థాన్వయుండు. 32

క. మీకృప సేమమెచుండీ
మాకెల్లర కనుచుఁ బలికి క్ష్మాసురతతి క
స్తోకానురక్తి నెరఁగిన
గైకేయీసుతుఁడు వచ్చి కాళ్ళన్ బడియెన్. 33

ఉ. భవరాజీవభవార్చితంబులగు భాస్వద్వంశు పాదద్వయిన్
దవులన్ శీర్షము సాగిమ్రొక్కినఁ గృపాధాముం డతండాప్తితో
నవలోకాబ్జములన్ ముదాశ్రులలమన్ శ్యామాంగమున్ గగ్గురన్
భువిపైనుండి బిరానలేపి పినతమ్మున్ గౌఁగిటం గూరిచెన్. 34

తే. రామవిభుఁ డట్టు లనుజునిఁ బ్రేమఁ గూడి
కవుఁగిలించిన నుపమింపఁగాన నుపమ
భక్తివాత్సల్యములు మేనువడసి కూడి
నట్టి శోభనుమీఱినం దనఁగవచ్చు. 35

ఉ. అంతఁ గృపాంతరంగుఁడు మహోద్ధృతిఁ దమ్ముని సేమ మారయన్
సుంతయు మాటరా దతని నోట సుమా! కనుఁగొంటె! తత్సుఖం
బింతని వాఙ్మనంబులకు నే గణుతింపఁగరాదు సుమ్మతం
డంత వచించె నన్నా! శుభమందితిఁ మీపద దర్శనంబునన్. 36

క. దీనుఁడనని నాపయి దయ
నూని యిటుల్ దర్శనంబు నొసఁగి విరహాపా
థోనిధినిమగ్నుఁడౌ ననుఁ
బూనికిఁ గేలూఁత నొసఁగి ప్రోచితి దేవా. 37

క. అనునాపిమ్మట రాముఁడు
పినతమ్ముని నక్కుఁగూర్పఁ బేర్చిన పేర్మిన్
మనమున నిముడని ప్రేముడి
ననఘుఁడు లక్ష్మణుఁడు నతని నక్కునఁ గూర్చెన్. 38

చ. తదుపరి నక్కుఁగూర్చి పినతమ్మునసహ్యవియోగవేదనన్
విదిలిచె నాతఁ డంతఁ బృథివీసుత యంఘ్రుల వ్రాలి మొక్కఁ దాఁ
బదపడి తమ్మితోఁ గయికపట్టి ముదమ్మునఁ గాంచెఁ బౌరులున్
సదమల రామచంద్రముఖచంద్రుఁ గనుంగొని పాసి రార్తులన్. 39

క. ప్రేమాతురులగు పౌరుల
నామెయి రాఘవుఁడు కాంచి యమితాకృతులన్
బ్రేముడి నొక్కటఁ గూడె ని
ట్లామెయి వారందఱన్ యథార్హవిధమునన్. 40

మ. బహురూపుండయి స్వామి యప్డు లనుకంపాదృష్టి నాపౌరులన్
రహినొక్కుమ్మడిఁ గూడుకోఁ బోలఁగ దుర్వారంబుగా తద్వ్యథల్
మహి నీమర్మమెఱుంగ రెవ్వ రపు డామాతల్ సుతున్ జూడఁగా
రహి నేతెంచిరి లేఁగకై యడలి చేరంబాఱు నాలం బలెన్. 41

చ. ఇలువిడి మేఁతకై వనులకేగిన లేఁగటి యాలమంద సం
జల నగరోన్ముఖం బగుచు జాను పొదుంగులఁ బాలుచేపఁ బె
య్యలఁ గలయంగ నంబెయని యార్చుచుఁ బర్విడివచ్చుభంగి మా
తలు పరతేరఁగాంచి రఘుతల్లజుఁ డెల్లరఁ గూడె నర్మిలిన్. 42

క. మృదుమధురోక్తుల వారల
మదిఁగల తాపంబుఁ బాప మాతలు వారల్
ముదమంది రంత రాఘవ
పదభక్తుండని సుమిత్రపట్టిని [illegible]నన్. 43

క. కాకుత్స్థుని గదిసినదా
కైకయు లో జంకుఁ గొంకుఁ గాఱియ వెట్టన్
గైకమ్మఁ గదిసె లక్ష్మణుఁ
డాకులమున నతని కాక యణఁగదదేమో! 44

ఉ. మాతలనెల్లరన్ గలిసి మన్నన దీవన లొందె లక్ష్మణుం
డాతతభక్తి సీతయును నత్తల కెల్లర కుత్తమాంగమున్
బ్రీతిని వంచి దీవనల పెక్కిటిఁ గాంచెను రామరాట్పదా
బ్జాతము లెల్లరుంగని శుభంబని బాష్పముఁ బాపుకొండ్రెటో. 45

ఉ. మాటికిఁ దాటకాంతకుని మాన్యతనుచ్ఛవిఁ గాంచి పాడుచున్
బోటులు పైఁడిపళ్లెములఁ బూని నివాళుల నిచ్చి రింపునన్
దీటగు వస్తుకోటి దిగఁదీయుచు నమ్మెయి రామమాతయున్
బాటితశత్రుఁ బుత్రుఁ గని పల్మఱు లోఁదలపోసె నివ్విధిన్. 46

చ. కొమరులు వీర లీకుసుమకోమలమూర్తులు కూర్చిరొట్టు లా
యమరవిరోధి రావణుని నక్కసిరక్కసిమూక నేక్రియన్
సమయఁగఁ జేసిరంచుఁ బలుచందములన్ దలపోయుచున్ గనెన్
బ్రమదము మీఱ మే గగురువారఁగ సావనిజానుజున్ సుతున్. 47

చ. అనిలసుతాబ్జబంధుతనయాంగద జాంబవదాదియోధులున్
దనుజవిభుండు నయ్యెడలఁ దాల్చి మనోహరమానుషాకృతుల్
వినుతి యొనర్చి రాభరతుప్రేమము నేమము సీతి నిష్ఠలా
జనులవిధంబుఁ బ్రేముడుల స్వామిపదార్పిత చిత్తవృత్తులన్. 48

క. కాకుత్స్థుఁ డంత నాసుమ
మాకారుల సఖులఁ బిలిచి యనేఁ గన్గొనిరే
మా కారాధ్యునిఁ గులగురు
లోకేశసుతున్ వసిష్ఠు లోకారాధ్యున్. 49

ఉ. వీరి దయామయంబయిన వీక్షణమే గెలిపించె నన్ను నిన్
ఘోరసురారులన్ గయి మొగుడ్చుఁడు వీరికటంచుఁ బల్కి యా
వ్వారల నాజ్ఞ కిట్లెఱుఁగఁ బల్కె గురూత్తమ! సంగరాబ్ధి ని
వ్వారలె పట్టుఁగొమ్మలయి పారముఁ దేర్చిరి నన్ను నమ్ముఁడీ. 50

చ. అనయము మద్ధితాచరణ మందునె పుట్టువు లెల్లఁ బుచ్చినా
రనఘులు వీరు నాకు భరతాధికు లౌదురు ప్రేముడింపఁగా
నని కొనియాడ హర్షవశులై యపు డందఱునున్ క్షణక్షణా
భినవసుఖంబు లొందుచును వీనుల నవ్విభువాణి విందొగిన్. 51

క. అక్కౌసల్యాపదంబుల
మ్రొక్కిన వారంత నామె మ్రొక్కినవారిన్
మక్కువ రాముని వలె నా
కెక్కుడు ప్రియులౌదు రనుచు నిటు దీవించెన్. 52

## రాముని పురప్రవేశ మహోత్సవము.

సీ. విరులవాన గురియ వేల్పులు వినువీది
నింతు లుప్పరిగల నెక్కిచూడ
నానందకందుఁడౌ నారామచంద్రుండు
భవనంబునకు నంతఁ బయన మయినఁ
బ్రతిగృహద్వారమున్ ధ్వజతోరణపతాక
పూర్ణకుంభంబులఁ బొలుపు మీఱ
దిద్ది వీథుల నెల్లఁ దద్దయుఁ దడిపి రం
దొత్తుగఁ బన్నీట నత్తరులను
ముత్తెముల్ వోసి ముద్దులు మూటఁగట్ట
దిద్ది రంగళ్లు ముంగిళ్లు దీర్చి మిగుల

శోభనాలంకృతులవెల్ల జూడ నొప్పెఁ
బ్రబలెఁ బురినెల్ల మంగళవాద్యరవము. 53

ఉ. తీరుగ స్వామిపైన దిగఁదీయుచు వస్తువు లెన్నొ తత్పురీ
సారసనేత్ర లందఱును జానగు బంగరు పళ్లెరంబులన్
హారతులుంచి తెచ్చి శుభహారతు లిచ్చిర టార్తిహారి! యో
నీరజబాంధవాన్వయమణీ! కొను మారతులంచుఁ బాడుచున్. 54

క. ఆకల్యాణ విశేషము
లాకమనీయతలు సుఖము లాశ్రుతిభాషా
కాకోదరాధిపాముతె
వాకోఁ జనరన్న నగుఁడు వాకోఁ జనునే. 55

క. రామపురీ సరసిని నా
గామాకుముదినులు విరిసె రహిఁ గ్రుంకంగా
రామవియోగాఖ్యం డభి
రామంబై నట్టి రామరాకేందుఁ గనన్. 56

తే. మురజముఖవాద్యముల్ మింట మొనసి మ్రోయ
భద్రశకునంబు లెదురురా బయలు వెడలి
పౌరనరనారు లెల్లర భద్రదృష్టిఁ
గని సనాథులఁ జేయుచుఁ జనె విభుండు. 57

క. కైకమది నారటం బది
కాకుత్స్థుఁ డెఱింగి ముందుగాఁ జని వెతలన్
బోకారిచి యూపెను సువి
వేకోక్తులఁ దుష్టిపరచి వేశ్మముఁ జేరెన్. 58

# శ్రీరామ పట్టాభిషేకమహోత్సవము.

చ. సదనముఁ జేరె రాఘవుఁడు సమ్మద మొందఁ బురీజనంబు ల
య్యదనున నావసిష్ఠుఁడు ధరామరు లందఱఁ బిల్చి నేఁడె సూ
సుదినము సన్ముహూర్తము ద్విజుల్ సెలవిండికఁ బ్రీతి గద్దె ని
ల్పుద మిదె కౌసలేయు నన భూసురు లంతఁ బ్రహృష్టచిత్తులై. 59

క. రామాభిషేక మియ్యది
యీమై లోకాభిరామ మెటు కాకుండున్
స్వామి! విలంబ మిఁ కేటికి
రామున్ బట్టాభిరాము రహి సలుపుఁడయా. 60

చ. అని మది మోదమంది ద్విజులందఱు సమ్మతిఁ దెల్ప నాసుమం
త్రునకు వచించె నాకులగురుం డటఁ దేఁదగు వస్తులెల్ల నా
యనఘుఁడు మూని కంజలిడి హస్తితురంగ శతాంగరాజి నే
ర్పొనర నలంకరించి భట యూథముఁ బంచి గడించె వస్తువుల్. 61

తే. వలయు సంభారములతోడవచ్చి మంత్రి
గురువసిష్ఠునకున్ గేలు గూర్చెనంత
విరులవానల గురిసిరి వేల్పులపుడు
నాటి యవ్వీటి సొగసేమనంగ వచ్చు. 62

ఉ. ఆవిభుఁ డంత నాభటుల కాజ్ఞ నిడన్ జలకంబు లార్చ సు
గ్రీవముఖ ప్లవంగులకు గింకరు లెందఱి వార లందె ముం
దావనచారులన్ జలకమార్చిరి రాఘవుఁ డంతఁ బిల్చి యా
త్మావరజాతు దజ్జటల నాత్మకరంబుల జిక్కెడల్చుచున్. 63

క. పిమ్మటఁ దమ్ముల ముప్వుర
సమ్మతి నీరార్చ భటుల శాసించె విభుం

డమ్మోయి విభువాత్సల్యముఁ
దమ్మోలభాగ్యమ్ముఁ బలుకఁ దగ దహిపతికేన్. 64

ఉ. అమ్మోయిఁ జిక్కెడల్చుకొని యాత్మజటావళి గుర్వనుజ్ఞ నం
దమ్మహిరాన్వవాయమణి యాదట మజ్జన మాడి మేన మేల్
సొమ్ము లలంకరించుకొని సూనశరాయుతశోభ మీఱె సీ
తమ్మనుగూడ నత్తలు మహాధృతి మజ్జనమార్చి తెచ్చినన్. 65

తే. దివ్యపటమణిభూషల దీర్చి దిద్ద
రూపగుణఖని శ్రీదేవి యాపె రామ
వామపార్శ్వంబునం దొప్పె నామెఁ గాంచి
పుట్టువుల్ పండె నని యెంచు పొలఁతులెలమి. 66

క. విను మోవిహంగపుంగవ!
వనజభవాభవసురర్షి వరు లావిభునిన్
గనుఁగొన విమానములపైఁ
జనుదెంచి రయోధ్యకపుడు సమ్మదలీలన్. 67

ఉ. తద్దయు బ్రేముడింప సుఖధామునిపై మది మాని సింగపున్
గద్దియనొండు దేఁబనుప తత్సురకోటికి సాగి మ్రొక్కి యా
ప్రొద్దుకొలంపుఁ బెద్దదొర ప్రొద్దువెలుంగుల నీను గద్దియన్
ముద్దియతోడ నిల్చె మునిముఖ్యులు కన్గొని మోద మందఁగన్. 68

మ. అవనీదేవులు వేదపాఠమును సేయన్ వ్యోమవీథిన్ మునుల్
దివిషత్కోటి జయధ్వనుల్ సలుప నాదిన్ దద్వశిష్టుండు రా
ఘవుఫాలంబున నుంచి రాడ్తిలకమున్ తన్మోదేవతాకోటి క
య్యవలన్ సెల్వొసఁగెన్ గుమారుఁగనియాయంబల్ ప్రమోదింపఁగన్

క. ఆర్తిహరుండౌ విభునకు
నార్తులనిడి రింతులంత నఖిలవిధేచ్ఛా

పూర్తిని దన్పి ద్విజాళి నొ
నర్థి రయాచకులు గాఁగ నలి యాచకులన్. 70

ఉ. అద్దరి ఛత్రచామరగదాదులఁ దాలిచి నిల్వ సోదరుల్
గద్దియఁ గూరుచుండఁ ద్రిజగత్పతిఁ గాంచి నిలింపు లింపునన్
దద్దయు మింట దుందుభులఁ దప్పెటలన్ మొరయించి రచ్చరల్
ముద్దుగ నాడి పాడి రెదమోదిలి రాముని ముఖ్యు లెల్లరున్. 71

క. క్రేవల నాభరతాదులు
పావనిముఖకీశరాజి పలభుగ్విభుఁడున్
సేవింప భరతుఁ డందున
బూవిల్తునిశోభమీఱె భూజాయుతుఁడై. 72

శా. ఆ నవ్యాంబుద నీలిమాంగమును నాయాజాను బాహుద్వయం
బానాళీకదళాయతాక్షియుగళం బా పీనవక్షమ్ము నా
హానిస్వాంత విమోహనంబయిన హేమక్షౌమ మాహాళి నా
నానాభూషణ భూషితాంగములు గన్నన్ ధన్యులౌదుర్ గదా. 73

క. భాషాయోషకు శ్రుతులకు
శేషాహికిఁగాక సుఖవిశేష మదెల్లన్
భాషింప నొరుల కగునే
శేషవిభూషణుఁడె దద్విశేషమెఱుంగున్. 74

## వేదములు వందిరూపముల వచ్చి శ్రీరాముని నుతించుట.

క. వినుతించి వేఱువేఱుగ
జనిరి దివిజులెల్లరపుడు స్వస్థలములకున్
వినుతించె బట్టురూపులఁ
జనుదెంచి చతుశ్శ్రుతుల్ విశాంపతి నిట్టుల్. 75

ఆ. ఆదయామయుండు నఖిలాత్ముఁ డోటను
నాదరించె వారి నాత్మ నెఱిఁగి
యెవ్వరెఱుఁగరైరి యీమర్మ మపుడందు
విభుగుణముల విట్టు వినుతిసేసె. 76

సీ. సగుణనిర్గుణరూప! క్షత్రియకులదీప
కరధృతశరచాప! వరకలాప!
దశకంధరాది బృందారకారివిదార!
ఘనభవాకూపార కర్ణధార!
ప్రణతపాల! కృపాళ! ప్రణుతనిర్జరపాల!
త్రిభువనపరిపాల! దివిజపాల!
శక్తిసంసక్త! సద్భక్తసమాసక్త!
ఆశ్రిత భక్తజనానురక్త!
వందనం బిదె నీమాయ బంధములను
బడి భవాపథభ్రాంతులై పవలు రేలు
గాలకర్మంబులన్ జిక్కి గాసిలు విధి
సృష్టి యదియంత నీదయాదృష్టి వడసి. 77

క. తాపత్రయమునఁ జిక్కక
ప్రాపించు భవాంబురాశిపారము భవసం
తాపాపహరణ కుశలా
పాపాపహా! పాహిపాహి! ప్రణతార్తిహరా! 78

శా. జ్ఞానాహంకృతిఁ గన్నుగానక భవాశాపాశవిచ్ఛేదియౌ
నా నీభక్తిఁ దలంపఁబోక జను లాయస్వప్న దుష్ప్రాపహా
స్థానం బందియు నీచయోనులఁ బునర్జన్మంబుఁ గైకోభువిన్
గానంబోదుము దేవ! యేజనుఁడు కాంక్షల్ బాసి విశ్వాసియై. 79

మ. నిను సేవించుచు నీకథాళి వినుచున్ నీనామసంకీర్తనం
బనయంబున్ బొనరించుచున్ మెలఁగు నీయాయాశ్రితుం డీభవాం
బునిధిన్ దాఁటు శ్రమంబులేకని కృపాంభోరాశి! నిన్నెంతు మో
వనజాతాసన శంకరార్చితపదా! వందారుబృందారకా! 80

ఉ. ఏపదపంకజాతరజ మింత స్పృశించి పునీతయయ్యెనో
తాపసభామినీమణి పదంబెది పుట్టినయిల్లు భవ్యదే
వాపగ లోకపావని కె దబ్జరథాంగపవిధ్వజాంకితం
బేపద మెద్ది కానఁ జరియింపఁగఁ ముండ్లను గాయఁగాచెనో. 81

ఉ. ఆపదముల్ భజింతు మనయంబుఁ జరాచరసేవ్య! నిన్ బుధుల్
వ్యాపకుఁ డంచు బ్రహ్మము ననాదియు స్వానుభవైకవేద్యుఁడం
చేపగిదిన్ నుతింపఁ జన నిమ్మొటు లెంతురు కాంత్రు వారలే
రూపున మేము నీ సగుణరూపమె పాడుదు మయ్య! నిచ్చలున్. 82

సీ. క్షితిని జాతుర్వర్ణ్యసృష్టి నా ద్వచమున
నవ్యక్తమాయామయాంఘ్రితోడ
శీతోష్ణసుఖదుఃఖ చిదచిత్సుశాఖల
బహువాసనారూప పత్రములను
సంకల్పసుమముల సత్పుణ్యపాపౌఘ
మయమధురామ్లఫలయుత మగుచు
క్రొంజిగుళ్లను బూలఁ గ్రొత్తయై నిచ్చలు
వల్లిరెయొక్కఁ డలమి ప్రాఁకుకొనఁగఁ

దనరు సంసారభూరుహాత్మకుఁడవైన
నిన్ను వందింతు మోదేవ నీపదముల
నెడ నుడి యెడల్ల బొచ్చెం బొకింతలేని
యమలభక్తి నొసఁగు దయాళు! యనుచు. 83

క. వందించి రామవిభు నటు
లందఱుఁ గనుచుండ నందు నంతర్ధానం
బొంది చతుశ్శ్రుతులు శతా
నందుని మందిరముఁ జేరె నయ మొప్పారన్. 84

శివుఁడు రాముని నుతించుట.

ఉ. అంతఁ బురాంతకుండు నొడలంత గగుర్పడ గద్గదోక్తి న
త్యంతవినీతుఁడై రఘుకులాధిపు నీవిధి సన్నుతించె, దు
శ్చింతుని రావణున్ నిహతుఁ జేసి హరించితి భూభరంబు దై
త్యాంతక! పాహిపాహి! ప్రణతార్తివిమోచన! పద్మలోచనా! 85

సీ. మదమోహమమతాతమస్వినీ గాఢాంధ
తమసనివారణ తపనతేజ!
చండబాణానలజ్వాలాకదంబక
భస్మీకృతాసురభటపతంగ!
దండితాఖిల ఖలదండ భూమండల
మండన! చండకోదండకాండ!
ఈశ! రమేశ! సర్వేశ! సుపర్వేశ!
ఆశకేశవినాశ! యఘవినాశ!
స్మరకిరాతుఁడు మృగలోకసముదయమును
బ్రచ్చుచుండెను భోగాస్త్రపంక్తి వఱపి
శరణ మంటిని నేఁడు నీచరణమంటి
నన్ను శరణార్థిఁగావు మనాథనాథ. 86

ఉ. నీపదపంకజాతముల నెయ్య మొసర్పక తత్ఫలంబుగాఁ
బాపులు కొంద ఱవ్విషయవాటిక భ్రాంతమతిన్ జరించుచున్

ప్రాపుఁ గనంగలేక భవవార్ధి మునింగి వియోగరోగముల్
పైపడఁగా నశింత్రెపుడు వ్యాకులదీనమలీమసాత్ములై. 87

చ. భవఘన సాగరప్లవ భవచ్ఛరితావిరతావలంబులా
ప్రవిమలహృత్సరోజులకుఁ బ్రాణపదంబగు సాధుకోటి ప్రా
మవుమదిఁ గామకోపమదమానము లొక్కఁడుగా విపత్తివై
భవముభయంబు నెంత్రెపుడు వారిమదుల్ పరితుష్టిఁదేలెడున్. 88

మ. అనఘుల్ మానులు యోగమూనరు దృఢేకాలంబచేతస్కులై
ఘననిష్ఠన్ విమలాంతరంగము నిన్ గాంక్షించి సేవించు స
జ్జను లాభూషణ దూషణాదుల నొకే చందంబునన్ గాంచుచున్
దినముల్ బుత్తురుహాయి నీయవనిపై నిశ్చింతితస్వాంతులై. 89

శా. ఎంతున్ ఖండనమండనున్ రఘుకులాబ్ధీందున్ బ్రశంసింతు వం
దింతున్ ఘోరభవామయాపహునిఁ గీర్తింతున్ రమాకాంతు పే
రెంతున్ మానిమనోనిశాంతు హృతదైత్యేశున్ వరం బర్థి న
ర్థింతున్ దత్పదభక్తి సాధుజనరక్తిన్ సంత్రసాదింపఁగన్. 90

ఉ. త్వచ్చరణానపాయినిని భక్తిని సాధుజనానురక్తినిన్
నిచ్చ లనుగ్రహింపు మవనీపతి! యంచు నుతించి మాటికా
చిచ్చుఁజకంటివేల్పు చనె శ్రీరఘువీరుఁడు నంతమెచ్చి భూ
భృచ్చరకోటి మచ్చికను బిల్చి యొసంగె సుఖావహాంశకముల్. 91

## శ్రీరామాయణకథాఫలశ్రుతి.

క. వినుతాభిషేకచరితము
వినతాసుత! వినుము దీని వినినఁ బఠింపన్
వినుత సువివేక సంపద
ఘనతాపత్రయ విముక్తిఁ గాంతురు జనముల్. 92

ఉ. కోరికతోఁ బఠించినను గోరుకులెల్ల ఫలించు నిచ్చలీ
డేరును సౌఖ్యసంపద మహిన్ సురదుర్లభసౌఖ్యలీలలన్
దేరినపైన సద్గతి తుదిన్ లభియించు ముముక్షు లిచ్చ నె
వ్వారు పఠింత్రు దీని భవపాశవిముక్తిని గాంత్రు వారిలన్. 93

తే. దీనివిషయమై యెవ్వరేన్ దీపినినఁ
జదివినన్గాని సౌఖ్యసంపదలఁ గాంత్రు
కాములు పఠించి పరిపూర్ణకాములైన
మోక్షకాములు పఠియించి ముక్తిఁగాంత్రు. 94

క. వర్ణించితిఁ జరితమి దా
కర్ణింపు సువర్ణ! చిత్ప్రకాశిని, సంసా
రార్ణవతరణి, కకుత్స్థకు
లార్ణవపూర్ణేందుగాథ, యారసిచూడన్ 95

క. భక్తిజ్ఞానవివర్ధని,
ముక్తిప్రద, భవభయార్తిమోచని, వరధీ
శక్తి వికాసిని, యిది హృ
ద్వ్యక్తను శుద్ధిన్ బఠించువారల కెందున్. 96

ఉ. అందు నయోధ్యలోని జను లందఱు నిత్యనవీనమంగళా
నందములందుఁ దేలుదు రనారత, మయ్యరవిందజేశ సం
క్రందనవందితంబు లగు రామనరేంద్ర పదారవిందముల్
డెందములందుఁ దాలిచి, కడిందిప్రియంబున సేవసేయుచున్. 97

క, సురముని వంద్యములౌ రఘు
వరపదముల నన్యభక్తి వఱలఁగ, నద్దే
వరఁ గొల్చి యిష్టసిద్ధులఁ
బొరిమఁగొనిరి విప్రవరులు, భిక్షుప్రవహుల్. 98

ఉ. నిచ్చలుఁ గ్రొత్తలై నెగడ నెయ్యముఁ దియ్యము రాఘవాంఘ్రులన్
గ్రచ్చఱ నాత్మ రేవగల రాకలుఁ బోక లెఱుంగకుండఁ బో
బుచ్చి కటా! యనూనసమములు, సొల్పుగ బ్రహ్మసుఖైకభోగులై
యిచ్చ నిజాలయస్మృతి యొకింత గొనర్పక యవ్వనౌకసుల్. 99

రాముఁడు కపులనెల్లర సంభావించి వారివారి నెలవులకనుపుట.

మ. కలనేనిన్ గృహచింత వారికెదఁ గల్గంబో దొకింతేని సా
ధులచిత్తంబుల ద్రోహచింతలకు నెందున్ దావు లేనట్లు, లా
నలినాప్తాన్వయుఁ డంతఁ గీశసఖులన్ నల్వారఁ బిల్పింప నౌ
దలలన్ వంచి యెఱింగి రంద రపుడాధాత్రీశ్వరాగ్రంబునన్. 100

క. దరిఁదీసి భక్తసుఖదుం
డరిమిలి శాఖాటకోటి కనెను మృదూక్తిన్
"దరుచారులార! నన్నన
వరతము సేవించి రెట్లు వర్ణింతు మిమున్. 101

చ. భవనసుఖంబులెల్ల నెడఁబాసి ప్రయాసలకోర్చి మీరు నా
యవిధిఁ దొలంచి; లెట్టుకొని యూడ? ముఖస్తుతిగాదుచుండు, నా
కవనిసుతానుజన్మలు, ధరాధిపతిత్వము, దేహగేహముల్,
ప్లవగవరేణ్యులార! మిమువంటి ప్రియంబులు గావుచూడఁగన్. 102

క. మిమ్మున్బోలు ప్రియాస్పదు
లిమ్మహినాకెందు లేర యెల్లరకు భటుల్
నెమ్మిఁగనఁ దగుదు రైనను
బమ్మను మత్ప్రేమ వారిపై ముమ్మడిగన్. 103

క. మీమీ నెలవుల కరుగుఁడు
నేమమ్మున నన్నుఁ గొలుఁడు నెఱి సర్వాంత

ర్వామి నని సర్వహితుఁడని
ప్రేమించుచునుండుఁ డెపుడుఁ జేర్మి"ననంగన్. 104

ఉ. ఆవిభువాణి కంతఁ గపులందఱు నివ్వెఱఁగంది నిల్చి, ప్రే
మావిలచిత్తులౌచు, నుడియాడక మోముల, బాసగట్టి యా
దేవరమ్రోలఁ గేల్మొగిచి, దృష్టిని దత్పదసీమ నిల్పఁగా
నావిభుఁ డంతఁ బంచి వివిధాంబరభూష లొసంగె వారికిన్. 105

క. కట్టించె వెట్టవేలుపు
పట్టికిఁ బుట్టంబుఁ గైకపట్టి స్వయముగాఁ
బట్టి యొకపట్టుపుట్టముఁ
గట్టించెను లక్ష్మణుఁడును గర్బురపతికిన్. 106

క. నలనీలజాంబవన్ముఖ
వలీముఖాచ్ఛవరుల కినవంశుఁడు కడున
ర్మిలి మీఱఁ గట్టబెట్టెను
వలువల వారరిగి రెరఁగి ప్రభుపదములకున్. 107

ఉ. వారటు భావవీథి రఘువర్యుని నిల్పి చనంగ, నంగదుం
డారఘునాథుఁ గాంచి, వినయమ్మున లేచి, శిరమ్ము వంచి, జా
ల్వారఁగ బాష్పవారి కనులన్, గరముల్ మొగిడించి, పల్కె నిం
పారఁ "కృపారసాబ్ధి! వినుతామర! తామరసోద్భవార్చితా! 108

క. అశరణ శరణుఁడ వీవని,
యశరణు నను, నాదు జనకుఁ డవసానదశన్
దిశమాలి, త్వత్పదాంబుజ
వశు నొనరిచె, నన్ను విడువ భావ్యంబవునే! 109

ఉ. తల్లియుఁ, దండ్రియున్, గురుఁడు, దైవము, సర్వము నీవెకాఁగ, ని
న్నుల్లమునందు నమ్మికొని యున్న యనన్య శరణ్యుఁడన్ విడన్

జెల్లునె దేవదేవ! ననుఁ జెప్పుమ! యీనె యిటుజ్జగింప నీ
సల్లలితాంఘ్రిపద్మపరిచర్యఁ దొఱంగి మఱేడ కేగుదున్? 110

క. నీపదకంజములన్ విడి,
యేపని కిలుసేయువాఁడ, నీవే చెపుమా!
పాపఁడ, వివేకహీనుఁడఁ
బాపఁగనన్ బాడియగునె, భవదంఘ్రులకున్. 111

తే. ఇంటిపనులెల్ల సేతు, నీవెంట నిలుతు,
బరిచరింతుఁ, జరింతు, నీపదసపర్యఁ
బదముఁ బొడగందుఁ గడగందు భవజలధికి,
విడువనాడవకు, మొడయఁడ! వీని''నంచు. 112

క. అడుగుందమ్ములఁ బడఁగా
నొడయఁడు రాఘవుఁడు కరుణ యుట్టిపడంగా
నొడిఁజేర్చి ప్రేముడిందన
మెడఁదాల్చినమాల వాని మెడఁ దాల్పించెన్. 113

క. మెడఁదాల్చిన మణిమాలల,
మడువులఁ గట్టంగఁ బెట్టె మఘవుమనుమనిన్
గడు బుజ్జగించి నుడువుల,
నొడయఁడు వీడ్కొలిపె నవరజోపేతుండై. 114

ఉ. అంతఁ బ్లవంగరాజసుతుఁ డాకరుణాకరు మాటిమాటి కిం
తింతనరాని ప్రేముడి మొయిన్ గను వెన్కకుఁ దిర్గి తిర్గి త
న్నింతకు నేని యాగు మనునేమొ విభుం డని మాటికెంచు న
త్యంతముఁ దళ్కొత్తాస్యరుచి, యందము, గూరిమిఁ గూడుచందమున్

క. అనగ వానడవడి యనుఁ
గానుఢికారంపు సొంపు నక్కటికపు చూ

పానెనరాదిన కూటమి
లోనా తచ్చేష్ట లెల్లలోఁ దలపోయున్. 116

క. తలఁచి తలఁచి తచ్చేష్టలఁ
దెలిసి తదింగితముఁ బ్రస్తుతించెఁ బలుమఱున్
నిలిపి మదిఁ దత్పదాబ్జము
లెలమిని జన నంగదుండు నినవంశుండున్. 117

ఉ. తమ్ములతోడఁ గూడుకొని తన్నగచారుల వీడుకొల్పి సౌ
ధమ్మునుజేరె, నిందున సదాగతి సూతి దినేశసూతి పా
దమ్ముల కౌదలన్ మొగిచి తద్దయు వేఁడె "విభూ! రఘూత్తమున్
సమ్మతిఁ గొల్చివచ్చి పదినాఁడులలో దరిసింతు మిమ్ములన్" 118

చ. అనవుడు భానుసూనుఁ డనిలాత్మజుఁ గన్గొని "పుణ్యరాశివో
యనఘుఁడ! నీవు రామచరణాబ్జము లట్టులె కొల్చి రమ్మ పొ"
మ్మని సెలవిచ్చి తా నరిగె నంగదుఁ డాహనుమంతు నంతఁ గ
న్గొని "వినుమన్నఁడా! విను కకుత్స్థకులుం గని మ్రొక్కిమాటికిన్.

చ. ననుఁదలపింపఁ జేయు కరుణానిధి కాదార కెప్పుడున్ నినున్
వినుతి యొనర్తుఁ గేల్మొగిచి పేర్మి"నటంచుఁ జనెన్, సమీర సం
దనుఁడిట రామదేవునిఁ గనం జని యాతని ప్రీతిరీతి వా
కొనవిని భక్తవత్సలుఁడు కూరిన పేరిమిఁ బ్రేమమగ్నుఁడౌ. 120

క. అర్కకులార్కు మనోగతిఁ దర్కింపఁగ
నెవఁడు నేర్చు? దంభోళిగతిన్
గర్కశపూఁ గసిఁగూరినఁ
జేర్కొన సుమపేశల మగుఁ బ్రేముడిఁగూరన్. 121

ఉ. పిమ్మట సౌకృపాబ్ధి రఘువీరుఁడు పేర్మి నిషాదనాథు వ
స్త్రమ్ములభూషణమ్ముల సుసత్కృతుఁజేసి వచించె "వత్స! నీ

విమ్మైన కేగుమింక స్మరియించుచు నన్నుఁ ద్రిశుద్ధి ధర్మమా
ర్గమ్మును దప్ప కెప్పుడును గ్రమ్మర వచ్చుచుఁ బోవుచుండుమా.122

క. అరుదెంచుచుండు మోయీ!
పురమునకున్ దలఁచు తోడఁబుట్టువుకంటెన్
బెరిమ నధికుండవగు దీ
వరయఁగ నాకన్న!" యనిన నాగుహుఁ డంతన్. 123

క. ఆతని వాక్యంబుల క
త్యాతతసంప్రీతిఁ గనుల నశ్రువు లలమన్
జేతులు మోడిచి రామ
త్మాతలవిభు సాఁగి మ్రొక్కి చనె గృహమునకున్. 124

క. పురిఁ జని నిషాదనాథుఁడు
పరిజనముల కాప్రభుప్రభావము నెల్లన్
బెరిమ వినిచె న టయోధ్యను
బురజను లారామచరితముల్ వినుతింత్రో. 125

## రామరాజ్య వర్ణనము.

ఉ. రాముఁడు రాచగద్దియ విరాజితుఁడైన జగత్త్రయంబునన్
బాములు బాసె భద్రములు పర్వెఁ బరస్పరమత్సరంబు లా
స్వామి ప్రభావమెంచి భువిఁ బ్రామవ వెవ్వరి రోగశోకముల్
బ్రామవు సుంతయైన నల రాముని రాచఱికంబునందునన్. 126

క. తమతమవర్ణాశ్రమ ధ
ర్మములసదా ప్రీతిఁజేసి మహితశ్రుతి మా
ర్గమునఁ జరించుచు మహిజను
లమలమతుల్ నిరతిసౌఖ్యమందుదు రందున్. 127

క. తాపత్రయంబు ప్రామదు
పాపము కలనేని జొరదు పర్వును ధర్మం
బాపురి నలుజాతులలో
స్త్రీపురుషులు రామపాదసేవాసక్తుల్. 128

ఉ. అందఱు రామభక్తిపరు లందఱు మోక్షపదాధికారులే
యం దపమృత్యుభీతి నొక రంద ర టందఱు నీరుజాంగులే
యందఱు ధర్మశీలురు శుభాచరణుల్ నరనాథు లందఱున్
సుందరు లందఱున్ గుణులు సూరిజనుల్ సువివేకు లందఱున్. 129

క. మందున కే నప్పురవర
మందునఁ గనరారు మందు లల్పాయులు ధీ
మందులు నంద ఱదంభు ల
మందప్రజ్ఞులును విబుధమాన్యులుఁ గానీ. 130

క. వినుతచరిత ! వినతాసుత !
విను మావిభురాజ్యమందు విశ్వప్రజ నె
ల్లను గాలకర్మగుణ వశ
జనితవ్యథ లొంద వెపుడు జగముల నెల్లన్. 131

గీతమాలిక :—

ఏడుసంద్రాలు జుట్టిన యెల్ల నేల
నేలె రాముఁడు భువనైకపాలకుఁ డయి
బంతులటువేలు బ్రహ్మాండపంక్తు లేని
రోమరాజిని వాని కీభూమిభరణ
మరయ నొక మేటిప్రాభవమా యటంచు
నెంతపాడినఁ దీర దనంతమహిమ
మీమహిమ మున్నెఱింగిన ధీమహితులు
మెచ్చి ప్రేమించుచుందు రీసచ్చరితము. 132

తే. రామమహిమామావగాహానరమ్యఫలము
రామదేవుని చరితానురక్తి యుంచుఁ
బ్రాజ్ఞమును లాడి రారామరాజ్యసుఖస
మృద్ధు లెంతురె వాణీఫణీశు లైన. 133

ఉ. అందఱుదారవర్తనులు సందఱుసుస్ సజదారవర్తనుల్
సుందరు లందఱున్ సతులు సుస్రపత ల్రగజపాదపంకజం
దిందిరు లంద ఱందుఁగల స్త్రీపురుషుల్, పరమోపకారు లం
దందఱు నీతిబాధ లెపు డుండదు తత్పరిపాలనంబునన్. 134

తే. క్షితిని భేదము నృత్యపు శేష మంద
దండ మారయ యతులహస్తంబు లంద
కానిలే దొండువట్లు నాఁటినాఁట
జేయవస్తువు వారికిఁ జిత్తమొుండె. 135

శా. పూచుంగాచు సదాద్రుమంబులు కరిస్స్వ్యాఘ్రంబు సింహంబు లం
దేచాయన్ వెనువెంటఁ దిర్గుఁ దిరులో నిసేద యుండొండు నెం
తోచెల్మిన్ సహజేర్ష్యల లోవిడి మృగవ్యూహం బహిఁసార్ధ్రిమై
యేచోటన్ వెఱపేది తిర్గెడు సమంచానంద మేపారఁగన్. 136

సీ. కలరవంబులఁ గూయు ఖగమృగసంతతుల్
నిర్భయవృత్తి వనిన్ దిరుగును
జల్లగ మెల్లగఁ బిల్లతెమ్మెర వీచు
చేంట్లు జుమ్మంచుఁ బూఁదేనెఁగ్రోలు
వల్లితరుల్ గాయు వలసినన్ని ఫలంబు
లిచ్చువచ్చిన పాల నిచ్చుఁబసులు
సస్యసంపన్నయై సర్వదా మేదిని
కృతయుగఫలదాత్రి తేరిత యయ్యె

విశ్వమయుం డౌటెఱింగి యవ్విభునకేన్ను
మలల వెలువడెం దముతామె మణులగనులు
పాతె నేలులు శీతలస్వాదువారి
మేరమీఱకె చరింప వావారినిధులు. 137

ఆ. రత్నకోటి విసరు రత్నాకరము లొల్లఁ
దీరవాసు లవ్వి యేఱుకొంద్రు
కొలను లం దనెల్ల నలినసంకులములతోఁ
బ్రబిమల మగు దిగ్విభాగ మెల్ల. 138

ఉ. అక్కట మీఱకె కాయఁ డినుఁ డాతప మందున నోషధీశుఁ డే
చక్కి నిజామృతాంశునుల జ్యోత్స్నపలి నించుచు నుండె, నావయో
ముక్కలు మక్కువన్ గురిసె ముమ్మరుఁ గోరిన యప్పుడెల్ల నిం
పెక్కఁగ రామరాజటు మహీతల మెల్లను నేలుచుండఁగన్. 139

ఉ. కోటితురంగమేధములు కోరి యొనర్చి బుధేంద్రకోటులన్
మేటి వరప్రదానముల మెచ్చులఁ దన్పె రఘూద్వహుం డటుల్
నేటివఘూటి జానకియు మిత్రకులీనపదారవిందముల్
మాటికి నెమ్మదిన్ దలఁచి మన్ననఁగొల్చు సదా వినీతయై. 140

తే. ఇంట దాసదాసీజనం బెంతయున్నఁ
దనకుఁ దాసేయు సేవావిధాన మెల్ల
సలుపు నిజపాణి గృహపరిచర్యలెల్ల
నారఘుప్రవరాజ్ఞానుసారముగను. 141

ఉ. ఏవిధిసేవ రామవిభుఁ డెట్లు సుఖించునొ యావిధానమౌ
సేవ లెఱింగి సేయుచు భజించును నిచ్చలు నత్త లందఱన్
భావమునన్ మదంబు విడి భక్తిమెయిన్ గురులన్ భజించు నం
దావిధి జానకమ్మ ముగురమ్మల మెచ్చులఁ గాంచు కొమ్మయై. 142

చ. తనదు కృపాకటాక్షమును దద్దయుఁ గోరు నిలింపకోటిఁ గ
న్గొనకయె రామపాదరతిఁ గోరి యెుసఁగ్చు రమావధూటి నె
మ్మనమున నైజచంచలత మాని యనారత మందుఁ దమ్ములున్
వినయవిధేయులై మెలఁగి బ్రీతి భజించుచు నుండి రవ్విభున్. 143

క. కింకరు లట్లు సోదరు లిరు
వంకల నిలుచుండి భ్రాతృపదకంజాప్తిన్
బొంకము మీఱఁగఁ దన్ముఖ
పంకజముం గాంతు రేమి పనుచునొ యంచున్. 144

క. తమ్ములఁ గనుఁగొని గారా
బమ్మున బోధించుఁ బెక్కువడువుల నీతుల్
సమ్మదమున రాముఁడు నం
దెమ్మెయిఁ బ్రజలెల్లరుండి రెలమిన్ గలిమిన్. 145

క. సురదుర్లభభోగంబులు
వఱలఁగ రేపగలు బ్రజలు ప్రార్థింత్రు విధిన్
దరణికులాభరణుని స
చ్చరణరతిన్ గోరి యెపుడు సద్భక్తిమెయిన్. 146

క. హరికిన్ బ్రతిబింబము లన
సురుచిరతను లమలగుణులు శ్రుతివిశ్రుతస
చ్చరితు లవు లవకుశాహ్వయు
లిరువురు సుతు లుద్భవించి రిల ధరణిజకున్. 147

క. అనలువురు సోదరులకు
మానితగుణశీలరూపమాన్యులు పుణ్యుల్
మానుగఁ బుట్టిరి తత్త
న్మానినులం దిరువురేసి నందను లోజన్. 148

తే. ఎవఁడు మాయాగుణాతీతుఁ డెడకు నుడికి
నెఱుక కింద్రియంబుల కెవ్వఁ డెఱుఁగఁబడక
బాముబంధాలఁ బడఁబో డెవఁడొ యట్టి
సచ్చిదానందుఁ డొనరించె జరితలెన్నొ. 149

ఉ. వేకువఁ గ్రుంకువెట్టి రఘువీరుఁడు తత్సరయూతటిన్ ద్విజా
నీకముతోడ వచ్చి సభ నిల్చి గురుప్రవరుండు తెల్పు త
త్ప్రాకటవేదవాదములు భవ్యపురాణము లాలకించు ము
న్నాకథలెల్లఁ దా నెఱిఁగి నట్టివయే నఖిలాత్ముఁ డయ్యుఁదాన్. 150

చ. జనములు మోదమొంద ననుజన్ములఁగూడి భుజించుఁ బావనిన్
గొని భరతాదిసోదరులఁ గూడి తమిన్ జను బూలతోఁట కం
దున భరతాదు లడ్గఁ దను దోరపుబత్తి వచించు నమ్మరు
త్తనయుఁడు వారలున్ దనియఁ దద్దయుఁ దద్గుణవైభవమ్ములన్. 151

• అయోధ్యాపుర వర్ణనము •

ఉ. రామకథాపురాణ మనురక్తిఁ బఠింత్రట యింటనింటఁ నా
రామయశోవిశేషముల రమ్యగతిన్ నరనారులెల్లరెం
దేమెయిఁ బాడుచుంద్రు పవలియ్యది రేయిదటం చెఱుంగ కా
రామపురీప్రజాసుఖపరంపర నెంచఁగలాఁడె శేషుఁడున్. 152

క. ఆరామదర్శనార్థము
నారదసనకాదిమును లనయ మప్పురి కిం
పారఁ జని వారివైభవ
మారసి కోల్పోవుచుండి రాత్మవిరక్తిన్. 153

తే. రంగురంగులఁ బొలుపారు రావలకల
మణులు తాచిన బంగరుమాడువులను
వీట నలుగడఁ జుట్టిన కోటగోడ
నలరు బలువన్నెలొ బురుజులఁ బుర మది. 154

తే. అల నవగ్రహసమితి సేనలనుబన్ని
క్రమ్మిన మహేంద్రపురమన రాణమీఱెఁ
బెక్కువన్నెలరాలఁ దాపింపఁబడిన
యయ్యెడలవెల్ల మునిమనోహరము లయ్యె. 155

చ. నిజకలశద్యుతిన్ గుముదినీఁ లినీసఖకాంతి మీఱుచున్
నిజశిఖరోన్నతిన్ జెలఁగి నింగిని ముట్టెడు మేడలందు ర
త్నజటితమౌ గవాక్షముల నాడెపు నమ్మణిదీపరాజి నం
బుజభవనిర్మితం బయిన పోల్పునఁ బొల్చు గృహంబు లప్పురిన్. 156

క. ఇంటింట మణిస్తంభము
లింటింటను బటికరాల నెసఁగెడు నడవల్
ఇంటింటఁ బసిఁడితలుపులు
నింటింటను జిత్రశాల లెసఁగును బురిలో. 157

క. సుందరకనకకవాటము
లెందునఁ బవడంపు గడపలెందునఁ గన నం
దంద సువిశాలగృహములు
విందయి చూపఱకుఁ గానుపించున్ బురిలో. 158

సీ. నిచ్చ లంద ఱచట నిర్మింతు రిచ్చమైఁ
బూలతోఁపుల యత్నపూర్వకముగ
బలువిధంబులఁ బూచు వల్లీమతల్లికల్
నిత్యవసంతాభ నెగడి యందు
దుమ్మెదల్ పూఁదేనె జుమ్మంచుఁ గ్రోలును
వీచును మెలమెల్ల పిల్లగాలి
బాలకుల్ వేడుకఁ బలుతెగల్ పులుఁగులఁ
బెంతు పల్కింతు రాడింతు పేర్మి

నలరు నిలయాగ్రభాగములందు నందు
హంసకేకీ కపోత విహంగరాజి
తమదు రూపులఁ గాచపాత్రములఁ గాంచి
పాడు నాడును దాండవం బాడు నవ్వి. 159

ఉ. రాముని బిల్వవే చిలుక! రాఘవుఁ బాడవె రాజకీరమా!
ప్రేముడి నంచు నేర్పుదురు పెంపుడుచిల్కల కప్పురీజనుల్
రామపవిత్రనామమును రాణ వచింపఁగ దాని వైభవం
బేమనఁ గాంచుమాత్రమున నిచ్చలఁగొల్పు విరాగికేన్ మదిన్. 160

ఉ. వీటఁ గుబేరుఁ బోల్పఁదగుఁ బేరులు నిల్చి నిజాపణంబులన్
గోటి యమూల్యవస్తువులఁ గూర్చి యమూల్యముగాఁగ నిత్తు రె
ప్పాటను దత్తదర్థులకుఁ బాటియె యప్పురపణ్యవీథిఁ జూ
క్కాట మలంతులే సిరిముగం దుదయించినభ్రోలి సంపదల్. 161

క. అం దందఱు సుచరిత్రులు
సుందరు లందఱును సుఖులు సువ్రతు లనఘుల్
వందింపఁ దరమె తత్సుఖ
మందిరుఁ డిరవున్నప్రోలి మహితోన్నతులన్. 162

క. ఆరాజద్వారముతీ
రారాజగృహంబు సొంపు నావీథులసొ
గారాచవీటి సోయగ
మేరికి వర్ణింప నలవి యిమ్మహిలోనన్. 163

క. పురి కుత్తరదిశఁ బాఱును
సరయూతటినీవరేణ్య స్వచ్ఛాంబువునై
దరి కడు నిష్పంకముగా
వఱలును సోపానపంక్తి ప్రతిష్ఠితమునన్. 164

క. తెఱవలు నీరాడంగా
మఱుపు గలిగి యొక్కరేవు మగవారలకున్
జొరఁబడ రాకుండఁగఁ గడు
నొఱపు గలిగి చెన్నుమీఱు నొకయెడఁ బురిలో. 165

శా. చాతుర్వర్ణ్యజనంబు లొక్కయెడ స్వేచ్ఛంగూడి నీరాడఁగా
నాతీరంబున రాజఘట్ట మొకఁడొప్పారున్ హయానేకప
వ్రాతం బొక్కట నీరుత్రావఁగను దూరంబందు రేవొక్కఁ డం
దే తీర్పంబడియుండె విస్తృతిని బ్రత్యేకంబుగా నప్పురిన్. 166

మ. ప్రతిఘట్టంబున నొప్పు దేవళము లారామంబు లందందునన్
యతు లెంతే నియతిన్ దపోనియతి శ్రద్ధాన్వితులై తాపసుల్
సతతం బందు వసింత్రు పూనిరచితాంచచ్చారుబృందావనం
బతిశోభన్ జెలువారుఁ బల్కఁదరమే యప్పోటివిన్నాణమున్. 167

శా. పాపంబుల్ పఱచున్ బురోపవనశోభన్ గాంచుమాత్రన్ బురిన్
వాపీకూపతటాకశోభ తరమే వర్ణింప నెవ్వారికిన్
సోపానంబుల నచ్ఛవారిఁగని పూనుల్ గూడ మోహింత్రు రం
దేపారన్ వివిధాబ్జముల్ విరియ హాయిన్ మూఁగు నందం దళుల్. 168

క. పలువన్నెల దామరల
కొలఁకుల విరియన్ ఖగాళికులములు మూఁగున్
గలనాదంబులఁ బాంథులఁ
బిలిచెడినో యనఁగఁ గూయుఁ బికములు వనులన్. 169

క. శ్రీపతియే భూపతియై
కాపాడ నయోధ్యసోయగం బది వాకో
నోపు నెవం డింక ననయం
బాపురి వ్యాపించియుండు నణిమాదికముల్. 170

చ ఎడనెడఁ బౌరు లారఘుకులేశ్వరు నిష్ణుసుకౌశిఁ బాడు చోం
డెడ గుమిగూడి యొండొరుల నిక్కపజేరు మొనక్కుకొందు రిం
పడర భజింపుఁ డయ్య! ప్రణతార్తినివారణునుఁ బద్మలోచనున్
జడధిగభీరు ధీరు ఘనసంశయశోకతమిస్రహంసన్. 171

సీ. శ్రితహరిచందను శ్రీరఘునందను
వినుత సంక్రందను విబుధవంద్యు
సాధుసారసవనసారస బాంధవుఁ
బ్రణతార్తినిమిత్త కృపావిశేషు
మదమోహ మృగయూథ మదన కిరాతుని
భవభీవిఘాతుకు భవ్యమూర్తి
భూరికాల భుజంగ భుజగభుక్ప్రముఖుని
బంచశరేభేంద్ర పంచముఖుని
ఆ. దనుజగహన దహనదహను దుర్వాసనా
మశక తుహినరాశి మలవినాశి
క్షితిసుతాసనాథు శ్రీరఘువంశజుని గొలువుఁ
డయ్య! యంచ్రము వరమాత్మమిత్రుఁ 172

ఉ. వింటి నలుంగులన్ బొదిని విన్ననువొప్పఁ ధరించి నిచ్చలున్
గంటికి ఱెప్పచందమునఁ గ్రమ్మి నిజాశ్రితకోటిఁ బ్రోచు నా
దంటను రాఘవున్ దులసిదాసవిభున్ గొలువుం డటంచు నిం
టింటఁ బ్రబోధముల్ జెలఁగు నెచ్చటఁ జూచిన నప్పురంబునన్. 173

క. ఈమెయిఁ బురనరనాథులు
ప్రేముడిఁ గొండాడుచుండ విభుగుణగణ మా
స్వామియుఁ బ్రసన్నుఁడై గా
రామునఁ గనుఁ బ్రజలఁ గన్న ప్రజలన్ బోలెన్. 174

ఉ. రామవిభుప్రతాపరవి రా విడె మున్న వివేకరాత్రి యం
హోమయ ఘూకముల్ మొఱఁగె నాఱెను గామరుషోత్పలంబు లీ
ర్ష్యామద మోహతస్కరులు జాఱిరి ముత్తెగలైన కర్మముల్
భూమగుణ స్వభావమయు భూరిచకోరము లంగలారిచెన్. 175

చ. చెలఁగెను ధర్మరూపసరసిన్ వరయోగవివేకవారిజం
బులు చెలువారె మోదమున మోదవిరాగ సుఖైకకోకముల్
వెలిఁగెడి నీప్రతాపరవి వేనిమనమ్మునఁ దన్మనంబునన్
బొలియును షడ్వికారములుఁ బొల్చు వివేక విరాగ సంపదల్ 176

• సనకసనందనాదులు రాముని సందర్శింప వచ్చుట •

చ. ఒకపరి జానకీశుఁ డనిలోద్భవుఁ దమ్ములఁ దోడుకొంచుఁ గౌ
తుక మలరన్ జనెన్ హవుసుతోఁటకు నొక్కెడ కంత దర్శనో
త్సుకులయి బ్రహ్మమానససుతుల్ సనకాదుల చేగుదెంచి ర
క్షకులుని పాలికిన్ బహుసనాతను లయ్యుఁ గుమారమూర్తులై. 177

మ. సమదర్శుల్ గుణశీల సంయుతులుఁ దేజఃపుంజు లాశాంబరుల్
యములున్ దుఃఖసుఖ ద్వయాతిగులు బ్రహ్మానందమగ్నుల్ రఘూ
త్తమగాథా శ్రవణైకలోలు రలవేదంబుల్ లసన్మూర్తి మం
తములౌ చొప్పడరంగ వచ్చిరటు తద్వైధాత్రు లచ్చోటికిన్. 178

ఉ. ఓగిరిరాజపుత్రి! కలశోద్భవుఁ డాడఁగ విన్నవార లీ
యోగవివేకశుచ్యరణి నుత్తమ రామచరిత్రఁ దొల్లి నీ
యోగిసనందనాదులు ఘటోద్భవు నాశ్రమమందు నుండి యం
చాగిరి పుత్రికిన్ గిరిశుఁ డవ్వలిగాథ వచించె నివ్విధిన్. 179

క. ఆగతి రఘుపతి నిజసిత
టాగతులగు మానివరుల కంజలి యిడి త

త్స్వాగత మడిగి నిజాంశుక
మూఁగకులను నాసనముగ నయ్యెడఁ బఱిచెన్. 180

క. తమ్ములు మువ్వురు మఱి యా
తెమ్మెరబిడ్డఁడును బ్రముఖ్యదోర్ష్ఠుల కం
దెమ్మెయి రామముఖచ్ఛవి
నమ్మునులున్ గాంచి రనిమిషాలోకనులై. 181

చ. పరివిమలమేచకాంగు భవబంధ విమోచనుఁ బద్మలోచనున్
ఛవినిధి నాకకుత్స్థకులచంద్రుని నమ్ముని పుంగవుల్ గనుం
గవల ముదశ్రుపూరములు గ్రమ్మఁగ మే బులకింప మోడ్పుకై
గవల నిజోత్తమాంగములఁ గాంచిరి నివ్వెఱ నిర్నిమేషులై. 182

తే. వారిరాకఁ గాంచి యారఘుపతియుఁ దంతఁ
గనులు కన్నీటఁ దోఁగ మేనగురువొడమ
నుచితగతిఁ గేలువట్టి కూర్చుండఁ బెట్టి
వారి కిట్లనె మృదుమధువాణి యొసఁగ. 133

తే. తపసులార! నేఁ డిందు మీదర్శనమున
నఘము లెడఁబాసి ధన్యుండనైతి నిపుడు
సులభగతి సంసృతివ్యథల్ దొలఁచు సాధు
సంగతి లభించుటది భాగ్యభంగి కాదె. 184

క. సాధు లపవర్గపదవి క
సాధులు సంసారపదవిఁ జనుపథములు నా
బోధించు వేదకోవిద
సాధు పురాణాదు లెల్ల సద్గ్రంథంబుల్. 185

వ. అనవిని యమ్మిభూర్తికి నజాత్మజు లుచ్చి రొయెడల్ గగుర్పడన్
వినుతి యొనర్పసాగి రిటు వేడుకమై జయ! భాస్కరాన్వయా!

అనఘ! అనామయా! జలేశ! దయానుధా! దేవ! త్రయీమయా విభూ!
వినుతగుణాలయా! సురనిశేశ! గణేశ! యుమేశవందితా!. 186

తోదకవృత్తము :-

జయజయ! నిర్గుణ! సద్గుణసింధూ!
జయజయ! భాస్కరసత్కుల బంధూ!
జయజయ! సంశ్రిత సౌఖ్యవిధాయీ!
జయజయ! రాఘవ! జ్ఞానవికాయీ. 187

సీ. ఇందిర సుందర! సౌందర్యమందిర!
భవవార్ధిమందర! ప్రణతి నీకు
భవవార్ధికుంభజ! దివిషన్నిభాంబుజ!
భవనుతాంఘ్ర్యంబుజ! ప్రణతి నీకు
కామాదిభంజన! రామ! నిరంజన!
సురసాధురంజన జోత నీకు
పాపవిమోచన! ప్రణతార్తిమోచన!
రాజీవలోచన! జేజె నీకు.

తే. భక్తసంతాన సంతాన! ప్రణతి నీకు
భక్తసంతాన సంత్రాణపర! జొహారు
అంజలియ్యదె హంసవంశావతంస!
మానిమానసమానసమంజుహంస! 188

తే. మొద్దు కేలిడె భవతాపమోచనాఖ్య!
దోయిలియ్యదె సౌఖ్యసంధాయి దేవ!
దండ మియ్యదె కందర్పదర్పదళన!
దోసిలింతుము సర్వహృద్వాసి! నిన్ను. 189

క. అనఘుఁడ వనామయుండవు
ననుపముఁడ వనంతుఁ డజుఁడవంచును నిన్నున్
గొనియాడు శ్రుతులు నిచ్చలు
వనజాతాసన సుసేవ్యపదవనజాతా. 190

క. విజ్ఞుఁడవున్ దత్త్వజ్ఞుఁడ
వజ్ఞానవినాశకుండ వనఘుఁడవుఁ గడున్
ప్రాజ్ఞుఁడవుఁ గృతజ్ఞుఁడవని
సుజ్ఞాననిధాన! నిన్ను శ్రుతులు నుతించున్. 191

తే. సర్వహృద్వ్యాపి! సర్వవిశ్వంబుఁజూడ
నీస్వరూపము నీవయన్నింటనుంట
మా మనోమందిరమునుండి కామమోహ
బంధముల ద్రెంపి ద్వంద్వభావం బడంపు. 192

ఉ. పావననామ! రామ! సురపాల! నృపాల! కృపాలవాల! భ
క్తావనలోల! ఆశ్రితజనామరసాల! యొసంగవే జగ
త్పావనకారిణిన్ త్రివిధతాపభవామయ తాపహారిణిన్
దావకపాదభక్తిఁ బరితర్పిత చిత్తమునన్ రఘూత్తమా!. 193

క. ఈడేర్చు మా మనోరథ
మోడింపక దీనబంధు యోగుణసింధూ!
జోడుల తలమానిక మగు
దీ డెవ్వరు పుడమితోడవ! యిమ్మహి నీకున్. 194

క. రాజీవ భవార్చితపద
రాజీవ! మునీశ చిత్తరాజీవ నిధి
భ్రాజితరాజమరాళా!
రాజీవసఖాన్వవాయ! రాఘవరాయా!. 195

ఉ. తారకనామ! రామ! భవతారణకారణ! కారణోద్భవా!
దారుణదైత్యరాణ్మదవిదారణ! కారుణికాగ్రగణ్య! దు
ర్వారదురంత మోహమదవారణవారణకేసరీ! జగ
ద్భారనివారణా! తులసిదాసవిభూ! శ్రుతిసేతుపాలనా. 196

ఉ. వారక కామమోహమదవారనివారకు సంభవాబ్ధి ని
స్తారకుఁ గ్రవ్యభుజ్మదవిదారకుఁ దారకు సద్వివేకవి
స్తారకుఁ గాలకర్మగుణసంచయ భక్షకు లోకరక్షకున్
దారకనామ రాము నిను దద్దయుఁ గొల్తుమటంచుఁ బల్కెఱున్. 197

క. ఇవ్విధి నవ్విధినందను
లవ్విభు వినుతించి పడసి యభిలషితవరం
బవ్విభున కెరఁగి వీడ్కొని
యవ్విధినిలయమున కరిగి రామోదమునన్. 198

చ. సనకసనందనాది మునిచంద్రు లటేగిన మీఁద సోదరుల్
దనివిని గౌసలేయుని పదంబుల కౌదల లానమ్రమొక్కి పా
వనిముఖమున్ గనుంగొనిరి ప్రశ్న మొనర్పఁగ నన్నతోడి జం
కును మదిఁ బూని యిచ్చ వినఁగోరుచు దద్భ్రమభేదివాక్యముల్ 199

క. సకలాంతర్యామియు నా
సకలోదంతము నెఱింగి స్వాంతమున సమీ
రసుమారుఁ బిలిచి యనెఁ గొం
కక యడుగుమ! యిప్పుడడుగఁ గడఁగిన దెదియో. 200

రాముఁడు సోదరులకు సదసల్లక్షణముల విధ మెఱిఁగించుట.

చ. అనవిని గాలిచూలి వినయమ్మునఁగేలు మొగిడ్చి పల్కెనో
యనఘచరిత్ర! యీభరతుఁ డడ్గఁ దలంచుచు నేదొ మిమ్ము న

మ్మనమునఁ గొంకుచుండె ననుమానముతో నన రాఘవుం డనెన్
విను! సుత! నాకు నాకయికబిడ్డకు దాఁపుర మొక్కఁడున్న దే.201

క. నానైజము నెఱుఁగవె! పవ
మానసుతా! మఱుఁగు గలదె మద్భక్తునకున్
బూని వచియింపఁగాఁబో
రాని దనన్ భరతుఁ డంటె రఘుపతి పదముల్. 202

క. అన్నపదంబులఁ బడి పడి
విన్నపమాలింపు మన్న! వేఁడెద ని న్నా
పన్నశరణ్యా! యటం చిటు
లన్నరపతి సుతుఁడు పలికె నతిభక్తి మెయిన్. 203

శా. సందేహంబులు శోకమోహము లెవో స్వప్నంబునం దేని లే
వందున్ నీదయఁజేసి నామనసునం దానందసందోహా! నీ
వెందున్ దాససుఖప్రదాతవు కదా యేన్ దాసుఁడం గాన నీ
చందం బారసి పట్టు వట్టితి విభూ! సాధుప్రభావంబులన్. 204

మ. వినిపింపన్ గదె సాధులక్షణములన్ వేదప్రసిద్ధంబులన్
వినఁ నీనోటఁ గుతూహలం బగుఁ జుమీ వేనోళ్ల నీవేక దే
వినుతిం జేసితి మున్ను దద్విభవముల్ ప్రేమంబునున్ మెండు నీ
కనఘా! వారిపయిన్ వచింపు మిఁక నాయాసాధ్వసాధుస్థితుల్. 205

క. సదసల్లక్షణముల నువి
శదగతి వివరింపు మన్న జనపతి పలికెన్
గుదురగు మది వినఁ గదవే
సదసల్లక్షణము లెల్ల సరగ వచింతున్. 206

చ. సరిపడు సాధ్వసాధులకుఁ జందన ఘోరకుఠార సామ్యముల్
నఱుకఁగ వచ్చు గొడ్డలికి నైజసుగంధ మొసంగి చందనం

బిరవుగ వేల్పునెత్తలల కెక్కె జగన్నుతిపాత్ర మాట నా
కలుకుకుశారమున్ గొలిమిం గాలుచు సమ్మోటపోటు లందుటన్. 207

క. పరకీయ కష్టసుఖములఁ
బరికించుచుఁ దనవిగాఁగ వాక్తనుచేతః
పరిశుద్ధి నమాయకుఁడై
చరియించునెపు భక్తిఁ దగిలి సల్లక్షణమా. 208

క. దీనదయాళుత్వము మద
మానపరిచ్యుతియు మోహమమతాచ్యుతియున్
మానావమానసమమతి
జ్ఞానుత! విప్రాంఘ్రిరతియు సాధుగుణంబుల్ 209

క. సమశాత్రవ మిత్రులునున్
సమదస్న లతీంద్రియులును శమదమనిరతుల్
విమల స్వాంతులు శాంతులు
మమతాహంకారరిపులు మత్ప్రాణసముల్ 210

క. ఎన్నఁడుఁ బరుషము లాడని
సన్నయవిములున్ మదంఘ్రిసారస నిరతుల్
మన్నామజప పరాయణు లన్నా
మత్ప్రాణసముల టరయఁ గదన్నా!. 211

తే. తుల్యసుఖదుఃఖ భూషణ దూషణులును
స్నేహశీలురు నిష్కామచిత్తు లమల
గుణనిధానులు సుఖనిధుల్ క్షోణిలోన
సాధుపుంగవు లని పల్కఁ జనెడువారు. 212

చ. అనఘ! యసాధులక్షణము లాడుదు విన్మిఁక నేరకేని యం
దునఁ జేరఁబోకుమీ కపిల దొంగసం బడిపోయి బాము లొం

దినగతి వారిఁగూడి పలుత్రిక్కులలోఁ బఱచుంద్రు సాధువుల్
గని పరసౌఖ్యసంపదలఁ గ్రాఁగి తపించును వారి చిత్తముల్. 213

క. పరనిందా శ్రవణమునకుఁ
బఱతురు పెన్నిధికిఁ బేదపడువున నెందే
బరుల కడగండ్ల విని తమిఁ
బరగుదు రాసార్వభౌమపద మబ్బినటుల్. 214

ఉ. చేసెడు చేఁత లొండు మఱి చెప్పెడు మాట మఱొండు నారక
త్రాసము లేదు వారి కనృతంబున నోడను సంతతాంగనా
దాసులుఁ గామదాసులయి తత్పరదారధనాభికాంక్షులై
మోస మొనర్చుచున్ బరసమున్నతి కోర్వకయుంద్రసాధువుల్. 215

ఉ. స్వోదరపూరకుల్ పరసమున్నతి కూర్పు నిగుడ్చు వారు శి
శ్నోదరచింతనైకపరు లుర్విని మర్త్యశరీరధారిమ
ర్త్యాదు లకారణక్రుధులు స్వార్థపరుల్ పరివాదశీలు రీ
హాదికషడ్వికారజితు లాత్మజనాహితు లెందసజ్జనుల్. 216

క. కేకీకోమలవాణులు
కాకోదరభక్ష్యమాణకర్కశహృదయుల్
రాకేందువిమలముఖులు న
రాకారముఁ గొన్న పుడమిరాకాసులు జూ 217

ఉ. ఒజ్జలఁ దల్లిదండ్రులను నొంచు గణింపరు సాధులున్న యా
పజ్జకె పోరు పాఱులను వంచనఁ జేతురు మాయదారులై
రజ్జుల నాడుచున్ శ్రుతిపురాణములన్ దెగనాడు చుంద్రు నా
యజ్జుల నొల్లకే యొఱుల యాండ్రకు సొత్తుల కాససేయుచున్. 218

తే. పెక్కుమాయలఁ బచరించి చిక్కుపఱచు
చుండ్రసాధులు సానుల నొక్కకోఁతి

చెనటి తాఁజెడి వనమెల్ల జెఱచునట్లు
కూళ తాఁగూలి కుల మెల్ల గూలఁద్రోచు. 219

క. పరహిత సదృశ శ్రేయముఁ
బరపీడా సదృశ ఘోర పాపము లే దీ
ధర శ్రుతిపురాణ నిశ్చిత
చరమోక్తి యి దెఱుక పేరసారజ్ఞులకో. 220

మ. పరపీడాచరణుల్ దురంత భవసంబంధంబులన్ జిక్కి స్వా
ధరతిన్ మోహవశాత్ములై సలిపి దుర్వారంబుగా పాపముల్
పరలోకస్థితిఁ బాపుకొందు రకటా! వారెల్ల, తత్కర్మముల్
పరిశీలించి శుభాశుభంబు లిడనోపన్ గాలరూపుండ నేన్. 221

క. పాపులకుఁ గాలరూపుఁడ
నీపగి ది దెఱింగి చలుపు లేద దుఃఖమయం
బౌపుట్టు చావుబందము
లోపక విడి కర్మఫలము లొందుదురు ననున్. 222

క. సదసత్కర్మఫలంబుల
వదలి సురాసురులు నరులు వందింత్రు ననున్
సదసజ్జనగుణసంపదఁ
బదఁపడి యెఱిఁగిన యతండు పడఁడు భవాబ్ధిన్. 223

క. గుణదోషంబుల నెక్కుల
గణితముగ రచించె మాయ గణుతింపఁగ నా
గుణదోషము లరయుమియే
గుణమగు నవివేకహాను గుణగణగణనన్. 224

చ. అనుడుఁ బదుక్తి కారణమున నానరజుల్ మహదాత్ర్యభావము లో
ననయము వెల్లి వాఱు ప్రముదాంబుధిఁ బల్మరు నోలలాడుచున్

విని విని వేమఱున్ విభుని వేఁడుచు నందఱుఁగూడి యిండ్లకున్
జని రటు లవ్విభుం డెపుడు సల్పుచునుండె విచిత్రగాథలన్. 225

క. ఆచిత్రచరిత్రముఁ గన
వైచిత్ర్య విముగ్ధుఁ డగుచు వైరించి సతం
బాచోటికిఁ జని కనుఁగొని
యాచిత్రచరిత్రుగాథ లజుసభఁ బాడున్. 226

క. వైరించి పాడు గాథల
వారించక యాదరించి పల్కును వేధే
వైరించి! పాడు మింక నొక
సారి నగుచు వినఁగ ననుచు సారెకు నడుగున్. 227

మ॥ సనకాదుల్ కడు బ్రహ్మనిష్ఠు లయినన్ శ్లాఘింతు రానారదున్
జనుఁ డెవ్వాఁడు సమాధి నేమఱి రఘుశ్రీనాథు చారిత్రమున్
ననువొప్పాఁగ నాలకించు నతఁడే యస్వాండు తత్ప్రేమ క
య్యనఘుల్ విండ్రు సమాధి వీడి విభు బ్రహ్మజ్ఞానసంపన్నులేన్. 228

క. జీవన్ముక్తులు నయ్యు ర
మావిభుగుణచరితముల సమాధి మఱచి విం
ద్రావిధినుతు లాగుణగా
థావశమున్గాని తలఁపుఁ డిల్లఁపే తలఁపన్. 229

## రాముఁడు పౌరులకు హితోపదేశ మొనర్చుట.

ఉ. రామవిభుం డొకప్పుడు పురప్రజనెల్లరఁ బిల్వఁ బంచి గో
త్రామర సాధుసజ్జన జనాగ్రమునన్ వచియించె నివ్విధిన్.
భూమిజనుల్ మనుష్యుల వినుండి యహమ్మతిఁ బల్కఁజుండు భూ
స్వామిమదంబునన్ బలుకఁ బ్రాభవమూనియుఁ బల్కఁజుండి నేన్.

ఉ. నాయనుశాసనం బెవఁ డొనర్చునొ వాఁడె ప్రియుండు నాకు నా
యీయెడఁ బల్కు పల్కుల నొకింత యనీతియు నున్నఁ బాయుఁడీ
చేయుఁడి నాదుసూక్తి విని. చిత్తము వచ్చిన చొప్పు భూరిభా
గ్యాయుత సత్ఫలంబవుఁ గదా భువి మానుషజన్మ మారయన్. 231

మ. అపవర్గైకపదంబు సాధనముసేయంజాలు మేల్పట్టు వే
లుపు లాసించియు నందరాని దని పల్కున్ భాగ్యపున్ బంటగా
విపులన్ మానుషజన్మ మిట్టి జనినన్ పీతాఘుఁడై యెవ్వఁ డ
య్యపవర్గంబునకైన యత్నముల సేయం డాతఁ డంత్యస్థితిన్. 232

మ. దురపించున్ బలవించు వేసి చెడువాదుల్ కాలకర్మంబులన్
బరమేశున్ నడివెట్టు నీనరతనుప్రాప్యంబు భోగంబు గా
దరయన్ స్వర్గపదం బదే నచిరసౌఖ్యం బొచు దుఃఖాంతమా
నరుఁడై పుట్టియు నింద్రియార్థరతి నేనాఁడున్ విడన్ జాలఁడేన్.

మ. గుఱిగింజల్ గొని స్పర్శవేధిఁ గొనులాగున్ జేఁదు భక్షించి వేఁ
దుఱు పీయూషముఁ బాఱఁబోయుగతి నొందున్ గాదె తద్భంగియున్
దిరుగున్ జుం డవినాశి జీవుఁ డెపు డుద్భిజ్జాదివర్గంబులన్
ధరపై నెన్బదినాల్గు లక్షల తెగల్ దద్యోనికూటంబులన్. 234

తే. కాలకర్మ స్వభావసంకలితు లగుచు
మాయప్రేరేపణన్ బెక్కు కాయములను
దాల్చు జీవుల హరి దయఁ దలఁచి యెపుడొ
భవజలధిపోత మీమర్త్యభవ మొసంగు. 235

క. నరతనుతరణి భవాంబుధిఁ
దరిఁజేర్పఁగ వాలుగాలి ధర మత్కృప స
ద్గురు వరయఁ గర్ణధారుం
డరి దది దరిఁగనుట గురువు లబ్బకయున్నన్. 236

క. ఇట్టి సమాజము నొందియుఁ
గట్టిడి భవవార్ధి నెవఁడు కడతేరఁగఁ బో
డట్టి ఖలుఁ డాత్మనంచకుఁ
డట్టిం డాత్మఘ్నుఁ డొందు నయ్యఘ మొందున్. 237

క. వలచితిరే నిహపరసుఖ
ములు విని నాపల్కు పలుకు బుద్ధి నిడుండీ
యిల నాదుభక్తిమార్గమె
సులభము సుఖదంబు ననుచు శ్రుతులు వచించున్. 238

క. అగము సుగు జ్ఞానమార్గము
తగులును బెక్కుడుమ లందుఁ దత్సాధనమున్
సుగమంబు గాదు మది పలు
తగులంబులఁ దగిలి చపలతన్ జనుచునికిన్. 238

ఉ. భక్తివిహీనుఁ డైనఁ బలుబాముల నందియు జ్ఞానసాధనా
సక్తినతండు నాకృపకుఁ జాలఁడు సర్వసుఖాకరంబు మ
ద్భక్తి సుసాధుసంగతిని దక్క లభింపదు భూరిపుణ్య సం
సక్తినె యబ్బుఁ దత్సుజనసంగతి దానను ముక్తిఁ గాంచెడున్. 240

క. తనువాజ్మానసశుద్ధి న
వనిసురపదపూజ సేయవలయును నెమ్మిన్
వినుఁ డనుపమ మీపుణ్య మ
వనిసురసేవాభిరతుని వందింతు) సురల్. 241

ఉ. ఓ జనులార! గుప్తమత ముండె నొకం డెఱిఁగింతు నమ్ముఁడే
యోజ భవాంఘ్రిపద్మరతి నొందినఁగాని మదీయభక్తికిన్
భాజనుఁ డెందుఁ గాఁ డిఁకను భక్తిపథంబున నేప్రయాస మే
యేజపయోగయాగములు నేయుపవాసము లుండెఁ జెప్పఁడీ. 242

క. నాదాసుం డనఁబడు నరుఁ
డేదే నొక యాసఁ జేసెనే నితరులపై
నాదాసపోషణాఖ్యను
నే దఁక విశ్వాస మతని కెఱిఁగింపుఁ డయా! 243

తే. మది యథాలాభసంతుష్టిఁ గదిరి యకుటి
లం బవునయేని గడుసరళప్రవృత్తి
నొందవెనే వానికెపుడు వశ్యుండ నౌదు
నాడ నేటికి బహుభాష లన్నఁగారు!. 244

ఉ. వైరము నిగ్రహం బలుక పాపముఁ దాపముఁ ద్రాస మాస యెం
దేరిని జేరకుండు దెసలెల్లను సౌఖ్యమయంబు గాఁ దమ నొ
ప్పారు నెవారి కెవ్వరు గుణాతిగు లెవ్వరు దేహగేహ చిం
తారహితుల్ తృణీకృతసుధాశనలోకసుఖుల్ సదాశ్రయుల్. 245

ఆ. భక్తిపక్షమం దెవార లాగాముల
నాడకుండు రెవ్వ రనవరతము
మత్పదాబ్జరక్తి మన్నామ గుణకీర్త
నమ్మొనర్తు రిరహమ్మతులయి. 246

క. వేని కెఱుక వారల బ్ర
హ్మానంద సుఖానుభవ మదవ్వారికె కా
కేనరున కెన్నవచ్చును
దాని ననన్ బ్రజలు తత్సుధామధుకోకిన్ 247

చ. విని విభుపాదపద్మముల వేడుక నొదల లాన్చి వా రిటున్
వినుతి యొనర్తు రీ మాకు జననీజనకుల్ గురుబంధు మిత్రముల్
తను ధనధామ సంపదలుఁ దద్దయు నీవ చుమయ్య! యో కృపా
ఖని! తలిదండ్రులన్ గనముగా నినువంటి హితోపదేశకున్. 248

మ. తలియున్ దండ్రియు మిత్రు లెల్లరును స్వార్థం బర్ధిఁ గాంక్షించియే
చెలిమిన్ జేతు రెదన్ బరార్థమును గాంక్షింపంగఁబో రెన్నఁడే
నిల నిర్హేతుకజాయమానకృపుఁ డౌ దీ వొక్కఁడుం డిక్కలిన్
బలు కల్పమ్ముల మమ్ము సేవకుల నిస్స్వార్థుండవై ప్రోవవే. 249

క. నావుఁడు విని ప్రేమార్ద్రము
లౌ వారల పల్కు లెల్ల హర్షించె విభుం
డౌ వెనుక విభుని పీడ్కొని
యావిభు మృదుభాష లెంచు చరిగిరి పౌరుల్ 250

క. ఆపురనరనారుల నే
రూపునఁ బలుకన్ గృతార్థరూపులు వారల్
శ్రీపతి యానందమయుఁడై
భూపతియై యేలుచున్న పురి నెటు లెంతున్. 251

♦ గురుఁడు వసిష్ఠుఁడు రామునిఁ గనవచ్చుట. ♦

చ. కనుఁగొన వచ్చె నొక్కపరి కంజజసూతి వసిష్ఠమౌని య
జ్జననుతశీలు రాఘవుని, సద్గుణసాంద్రుఁడు రామచంద్రుఁడున్
విని గురురాక మోదమున వే యెదురేగి సమాదరంబునన్
మునిఁ గొని తెచ్చి కడ్గి పదముల్ తలఁ దాల్చెను బాదతీర్థమున్. 252

క. పిమ్మట నమ్మునిచంద్రుం
డమ్మిహిరకులావతంసు నారసి యనెఁ గే
ల్దమ్ములు మోడిచి వినవే
సమ్మతి నావిన్నపమ్ము శ్రద్ధాళుఁడవై. 253

చ. దినదిననూతనంబు భవదీయశుభ చరణంబు నిత్యమున్
గనుఁగొన మోహ మయ్యెఁ గడఁగాన కనంతము లంచుఁ నెంచి యె

వ్వని గుణజాలమున్ శ్రుతులు పాడునొ యట్టి విభుండ వెట్లు నిన్
వినుతి యొనర్చువాఁడ రఘువీర! పురోహితవృత్తి యేవమా. 254

శా. పౌరోహిత్యము గర్హ్యజీవనముగాఁ బ్రాఁబల్కు లెన్గించినన్
జేరం బోవమి నేను దానిదరి కే స్నేహంబునన్ ధాత నన్
జేరం జేరి వచించె లాభ మవనిన్ సిద్ధించు నీకొండు వ
త్సా! రాజాగ్రణియై పరాత్పరుఁ డిలన్ జన్మించుఁ గాకుత్స్థులన్. 255

క. అనుడు మదిఁ గుదురుపరచితి
ఘనతర జపయోగ యాగకర్మంబుల గ
న్గొనరాని విభుఁడు దీననె
కననగుచో దీనిఁ బోలఁగలదె యొకండున్. 256

చ. జపముఁ దపంబు యోగములు జన్నములున్ వ్రతముల్ వివేకమున్
గృపగల బుద్ధి ధర్మరతి కీ డొకయింతయుఁ జేయకున్కియున్
విపుల పురాణపాఠమును వీనులవిన్కియుఁ దీర్థమజ్జనం
బెపు డొనరింపఁగా ఫల మిదీ భవదీయపదాబ్జరక్తిగా. 257

క. శ్రుతివిహిత సకలసాధన
తతులకు నేకైకఫలము త్వత్పదరతియౌ
మతి నంతర్మల మణఁగుట
క్షితి భక్తిప్రేమవారిచేతనె కాదే! 258

తే. మలమునన్ దోమ మల మెట్లు మానవచ్చు?
వారిఁ దరిచిన ఘృత మెట్లు బడయవచ్చు?
ప్రేమభక్తి జలమ్ములఁ దోమకున్నఁ
గాని యంతర్మలం బెట్లు గడపవచ్చు? 259

తే. అతఁడె తత్త్వజ్ఞుఁ డతఁడె గుణాఢ్యుఁ డతఁడె
పండితుం డాతఁ డతఁడ ధీమండితుండు

దక్షుఁ డాతండె సకలసల్లక్షణుండుఁ
ద్వత్పదాంబుజరక్తుఁ డేతం డతండు. 260

క. భవదంఘ్రికమలరతి యది
భవభవముల కొదవఁ గొదవపారకయుండన్
బ్రవిమలమతి వర మిమ్మని
స్తవ మొనరిచి చనె గురుండు స్వగృహంబునకున్. 261

ఉ. అంత దయాంతరంగుఁ డతిహర్షముతో ననుజన్ములన్ సభ
స్వాంతుకొమారుఁ గూడి పురబాహ్యవనంబున కేగి తేపలన్
దంతిహయాళిఁ దేఁబనిచి తద్దయుఁ బెద్ద నుతించి వానినిన్
సంతస మొప్ప వారల కొసంగె నిజేచ్ఛ యథార్హరీతిగన్. 262

చ. అలసి శ్రమంబుఁ బాసె విభుఁ డాశ్రమవనంబున కేగి యంతటన్
వలువ యొకండు నేలఁబఱువన్ భరతుండు, భజింప సోదరుల్
పులకితగాత్రుఁడున్ సలిలపూర్ణవిలోకనుఁడై మరుత్సుతుం
డలయిక వాయ పీవనల నల్లనఁ జల్లనిగాలి వీవఁగన్. 263

క. ఎవ్వని సేవాప్రీతుల
నవ్విధి విభుఁ డెంచెఁ దా స్వయంబుగఁ బల్మా
రవ్వాయుసుతుని బోలిన
యవ్విభుచరణానురాగి యరసినఁ గలఁడే. 264

## -• నారదమహర్షి రాముని సందర్శించి నుతించుట •-

క. చేత విపంచిని మీటుచు
నాతఱి నారదమునీంద్రుఁ డాతనిఁ గన్గొ
నేతెంచి నిత్యనూతన
పూతగుణవ్రాతమున విభున్ వినుతించెన్. 265

మలయజవృత్తము :-

ననుఁ గృపఁ జూడుము నలినవిలోచన! నలినభవార్చిత!నయవినుతా!
దనుజవిభంజన! దశరథనందన! ధరణీసురప్రియ! దళితరిపూ!
మునిజనరంజన! మునివనితావన! ముదితసుధాంధన! ముదితమనా!
యనఘ! నిరంజన! యఘభయభంజన!యశరణపోషణ! యమలగుణా!

సీ. సర్వాంసహామరసస్యానలాహక!
సద్గుణగ్రాహక! శరణు శరణు!
అంబికాపతిమానసాంబుజేందిందిర!
యిందిరామందిర! వందనంబు
ఖరదూషణ విరాధఖండన పండిత!
కోదండపండిత! కొలువు నీకు
శ్యామలామల కోమలాంగ! కృపాపాంగ!
వాలిమదపభంగ! కేలుమోడ్పు
ప్రణతి శ్రుతివిప్రశుతచరిత్ర! త్వచ్చరిత్ర
మానిసురసాధు సత్సభామాన్య మౌను
రామ! తారకనామ! నీనామ మరయఁ
దాపహంబును గలికల్మషాపహ మగు. 267

క. రామగుణగ్రామము నిటు
ప్రేమంబున సన్నుతించి వేల్పుతపసి యా
రాముని శోభాధామునిఁ
బ్రేముడి మది నిల్పి చనియె విధిసన్నిధికిన్. 268

ఉ. రాముఁ డనంతుఁడో సతని రమ్యచరిత్రలు జన్మకర్మముల్
నామము లెం దనంతము లనంతము లాతని సద్గుణావళుల్

భూమిరజంబు నంబుకణములు గణుతింపఁగ వచ్చుఁగాని యా
రామకథల్ గణింపఁగఁ దరంబాకొ వాణికిఁ బావజునికిన్. 269

తే. ఆయనంతుఁ డనంతముఖాళి నైన
నాయనంతు ననంతకథాళిఁ బలుకఁ
జాలఁ డవి శతకోటివిస్తరము కాట
విను యథామతిఁ బల్కితి విశదకథను. 270

## పార్వతి ఈశ్వరుని గరుడకాకభుశుండీ సంవాదప్రకారము నడుగుట

చ. విను గిరిరాజపుత్త్రి! వినిపించితిఁ గాకభుశుండి మున్ ఖగేం
ద్రున కెఱిగించి నట్టికథఁ దోరపుబత్తిని, రామపాదప
ద్మనిరతి నిచ్చు నావుఁడు నుమాసతి ప్రీతివినీతయై మృదూ
క్తిని వచియించె ధన్యనయితిన్ విభు! రామకథాప్రసక్తిచే. 271

ఉ. కారుణికాగ్రగణ్య! వినఁగల్గితి నీకృప రామగాథఁ ద
ద్భూరిమహత్త్వమున్ దెలిసె దుంగెను మోహముఁ ద్వన్ముఖేందునం
దూరు కథాసుధారసము నుల్లము కర్ణపుటంబులన్ ముదం
బారఁగఁ గ్రోలియున్ దనియ దయ్యది నిచ్చలుఁ దత్కథారుచిన్.272

తే. విని రఘూత్తమకథఁ దృప్తిఁ గనిరయేని
యారసవిశేష మెఱుఁగని వార లనుమి
యవిరతముఁ దత్కథారుచిఁ దవిలి విందు
రాత్మవిదులైన బ్రహ్మనిష్ఠాత్ములైన. 273

క. తారకనాముని కథ భవ
తారకమా టరుదె? తరణి తద్భవపారా
వారతితీర్షుల కిది సం
సారులకున్ శ్రవణసుఖ మొసంగు గుణాళిన్ 274

ఉ. రామకథాసుధారసముఁ దా్రివ రుచింపని వార లుందురే!
స్వామి! నిజాత్మఘాతులను వారి నభాగ్యుల నిచ్ఛగింపలేన్
రామచరిత్రమానసము రాణ వచించితి వేడ్క యయ్యె నో
కామరిపూ! ఖగేంద్రునకుఁ గాకభుసుండి వచించె నంటివే. 275

ఉ. ఆమెయి సందియం బొదవె సామిష వానికి గాకిమేన నీ
రామపదానురాగము విరాగవివేకము లెట్లు లబ్బె న
శ్లేమికతంబునన్ బొడమె హీనభవం బది తెల్పు మెల్ల నా
రామపదానురక్తియు ధరన్ బహుజన్మతపఃఫలం బగున్. 276

ఉ. నూటికిఁగోటి కొక్కఁడు కనంగొన ధార్మికుఁ డుండు వారలన్
గోటికి నింద్రియాగవిముఖుం డగువాఁ డొకఁ డుండు వారలన్
బాటిలు జ్ఞానసంపద యెవానికొ యొక్కని కట్టిజ్ఞానులన్
గోటికి నొక్కఁడుండు ననఘుండు సదేహవిముక్తిభాగుడై. 277

క. జీవన్ముక్తులలోనను
వేవుర నొకఁ డుండు బ్రహ్మవిదుఁ డుత్తముఁ డెం
దీవా రిందఱ రామ
స్వామివిభుపదభక్తిపరుఁడు కడు దుర్లభుఁడో. 278

క. అట్టి సుదుర్లభ భక్తిని
గట్టిడి యాకాకిపుట్టు కాంచిన దెట్టుల్
దిట్టయు నెఱుక గలం డయి
యెట్టు పొడమె రామభక్తుఁ డేవపు మేనన్? 279

క. ఈపావన శుభచరితం
బేపట్టున మున్ను వాయసేశుఁడు విని నీ
వేపగిది వింటి దీనిఁ గృ
పాపర! సెలవిమ్ము నాకుఁ బావనమతివై. 280

తే. జ్ఞానవారాశి గుణరాశి సంతతహరి
పదసరోజాగ్రవాసి యావైనతేయుఁ
డేమికతమున మునివరు లింద యుండ
వారిగేడి యాశ్రయించె నవ్వాయసమును. 281

క. కాకభుశుండికి గరుడున
కేకరణి వివాద మయ్యె నెఱిఁగింపు మనం
గాకోదరభూషణుఁ డిటు
లాకమ్రవినమ్రవాణి కలరి యిటు లనెన్. 282

ఉ. రామపదానురక్తిని గరం బలరారెదు ధన్యధన్యయో
భామిని ! నీదుబుద్ధి, భవవారిధితారణి భ్రాంతిహారిణిన్
రామపదాంబుజాతయుగరాగవివర్ధని చారుగాథ శ్ర
ద్ధామతి నాలకింపు మనధానమువన్ వినిపింతు నంతయున్. 283

• ఈశ్వరుఁడు పార్వతికిఁ గాకభుశుండి వృత్తాంతమును దెల్పుట •

క. నను నీ వడిగిన యంశం
బునె కాకభుశుండి నడిగె మును వినతానం
దనుఁ డయ్యుదంత మంతయు
వినుపింతు గిరీంద్రపుత్రి ! విను మిద్దానిన్. 284

క. సుందరి ! భవమోచన మీ
సుందరకథ దీని వినిన సొబగు వచింతున్
ముం దీవు దక్షమందిర
మందు సతీనామధేయవై వెలసితిచూ. 285

శా. ఆదక్షుం డొకమారు నన్ను వెలిసేయన్ యాగభాగంబునం
దా దేహంబుఁ బరిత్యజించితివి పిత్రావజ్ఞ సైరింప లే

కాదతఁ డధ్వర మంత్ర సంఘటులు సంహారంబుఁ గావించి రా
పై దుర్వారభవద్వియోగ మది సైపన్ రాము నే జోగినై. 286

క. అటు పటు విరాగమునఁ బ
ర్యటన మొనర్చితి మనోహరాటవులఁ గుభృ
త్తటినీతటాకసరసుల
నటఁ గల వింతల నవెల్ల నరయుచు నెలమిన్. 287

చ. ఒనరు సుమేరుశైలమున కుత్తరమందున నీలశైల మొం
డనుపమమై సువర్ణశిఖరావళి నొప్పి మనోహరాకృతిన్
ఘనవట పిప్పలామ్ర జటికాంత మహీజ విరాజితంబుఁ బా
వనసరసీవిరాజితముఁ బక్షివితాననిషేవ్యమానమై. 288

క. ఘనమణిమయ సోపానం
బు నమలశీతలజలము విపులవర్ణాబ్జం
బును గూజత్ఖగ మధుప
స్వనమయి యాకొండమీది సర సొప్పారున్. 289

క. మాయాకృత గుణదోషము
లాయవివేకాది వికృతు లాగిరి నెపుడున్
డాయంబో వటఁ గలనే
మాయదు కల్పాంతమునను మాసిన జగముల్. 290

క. ఆమహిమాస్పద మాగిరి
నేమంబునఁ గాక మద్ది నెలవుగఁ గొని యం
దేమాడ్కి హరిభజించిన
దామాడ్కి వచింతు నింతి! యాలింపఁ గదే. 291

చ. కృతయుగ ధర్మమున్ దవిలి కేవల ధ్యానసమాధిఁ బిప్పల
క్షితిజతలంబునన్ సలుపుఁ జేయు నొగిన్ జపయజ్ఞ మంతఁ బ్ల

క్షితరుతలంబునం దవలిజాముని ౯ ద్రేతను ధర్మమూని స
మ్మతిమెయి మావిచాయలను మానసపూజనొనర్చు నాపయిన్ 292

చ. హరిచరిత ప్రసంగముల నర్థి నొనర్చుఁ జతుర్థయామ మం
దిరవుగ మఱ్ఱిచాయను రహిన్ గలిధర్మముఁ బూని నిచ్చలా
దరి కరుదెంచి పక్షు లనధానమునన్ వినుఁ దత్ప్రసంగముల్
పెరిమను బాడుఁ గాకమును బెక్కువిధంబుల రామగాథలన్. 293

చ. అమలమతుల్ మరాళతతు లయ్యెడ నిల్చి కథావిశేషముల్
ప్రమదమునన్ వినన్ గనులపండువగాఁ గని చోద్యమద్ది మో
దమున మరాళదేహమును దాలిచి యేనును వారితో రఘూ
త్తమచరితంబు వింటి నటఁ దద్దయు వేడుక కొంతకాలమున్. 294

గరుడుఁడు మోహాకులుఁడయి శివుని పనుపునఁ
గాకభుశుండిపాలి కరుగుట.

క. సుందరి! రామచరిత్రము
నందున నే వినిన చంద మాడితి వినతా
నందనుఁడు కాకసన్నిధి
కెందుల కేతెంచె నట్టిహేతువు వినుమీ. 295

మ. తలఁపన్ సిగ్గగు చెద్దుమొందు సలిపెన్ దజ్జానకీజాని య
యక్కలనన్ రావణిచేతఁ గట్టువడి, యాకట్టుల్ దొలంచన్ బులుం
గులతేనిన్ వెసఁ బంచె నారదుఁడు తార్క్ష్యుండున్ రఘూత్తంసు మో
సల కేతెంచి తొలంచెఁ బాశముల వేజక్కాడి నాగంబులన్. 296

క. బందాలఁ బాపి విభుఁ డటు
బందాలను బడుటఁ దలఁచి బహువిధముల లోఁ

గుండి కడింది విషాదము
నందుచుఁ దలపోసె నిట్లు లాఖగపతియున్. 297

చ. అనఘుఁ డనామయుం డజుఁడు వ్యాపకుఁడాద్యుఁడు బ్రహ్మరూపకుం
డనఁబడు నాపరేశుఁడె నరాకృతి రాఘవుఁడై జనించె నం
చని మును వింటిఁ గంటి నిపు డాతని దివ్యమహత్త్వ మింతయున్
గన భవబంధమోచనుఁడె కట్టిడి కట్టులలోఁ బడెం గటా. 298

క. ఎవ్వని పేరుం బేర్కొనఁ
బ్రెవ్వునో భవపాశ మట్టి దేవేశు నె నేఁ
డివ్విధిఁ గట్టిడి రక్కసి
చివ్వను ఫణిపాశములను జిక్కులఁ బెట్టెన్. 299

క. అని యిటు బహువిధముల నె
మ్మనమునఁ దర్కించి తద్భ్రమంబుల కెల్లన్
గొనకు మది సమాధానం
బొనరించు కొనంగలేక యున్మలికమునన్. 300

మ. బహుశంకాకులుఁడై విహంగపతి నీఘంగిన్ మహాభ్రాంతుఁడై
తుహినాహార్యతనూజ! నారదమునీంద్రుం జేరి ప్రశ్నింప న
మ్మహనీయుండు దయామయుం డనె గరుత్మంతున్ విలోకించి మో
యహిభుఙ్నాయక! రామమాయ యనివార్యంబై నినున్ జుట్టెఁ జూ.

ఉ. ఎద్ది వివేకిచిత్తములనేన్ బలిమిన్ జెడుదారి కీడ్చునో
బుద్ధిఁ దోలంచి మాటి కెది మున్నను జిందులు ద్రొక్కఁజేసెనో
యద్దియె యావరించె నిను నాహరిమాయ తొలంగ దద్ది నా
నుద్దులఁ గ్రద్దనన్ జని యజున్ గని యాతనిపన్ను సేయుమిా. 302

మ. అనుచున్ రామగుణంబు లెంచుచును మాయాశక్తి వర్ణించుచున్
జనె దేవర్షి ఖగేంద్రుఁడున్ నిజమనస్సంక్షోభమున్ విప్పి చె

ప్పినఁ బద్మాసను పాలికేగి, యతఁ డవ్వేళన్ మదిన్ రామ దే
వుని పాదాబ్జము లెంచి లోఁదలఁచి తద్భూరి ప్రభావోన్నతుల్.303

చ॥ మదిని విచార మూనె హరిమాయకు లొంగ రెవారు ప్రాజ్ఞకో
విదబుధమాన్యు లెల్లరును వేమరు తద్వశులై నటింపరే
యదవద చేయదే మును జరాచరభూతతతిన్ సృజించు న
న్నదవద లాడె నీఖగకులాధిపుఁ డన్నను వింతయే మిఁకన్.　　304

క. అతుల ప్రభావయుత యని
మతి నాహరిమాయ నెంచి మధుకోత్తల నా
చతురాననుఁడు పలికెన్
ఖగపతీ! చనఁ గదయ్య పశుపతి కడకున్.　　305

క. ఆశంకరునిన్ విడి నీ
యాశంకలఁ దీర్చువార లన్యు లెవారల్
నీశంకానిర్వృతి యగు
నాశంకరుపాలి కేగి యడుగు మనంగన్.　　306

మ. అనుడెంచెం బరమాతురుం డయి విహంగాధీశుఁ డేన్ గిన్నరే
శ్వరధామంబున కేగువేళ నపుడో శర్వాణి! కైలాసభూ
ధర మం దుంటివి నీవు నాదరికి నాతం డట్టు లేతెంచి నా
కెఱిఁగింపన్ దనసందియంబు లపు డే నిట్లంటిఁ గృ మోత్తలన్.　　307

చ. కలిసితి మార్గమధ్యమునఁ గ్రన్నన నీకెటు తెల్పువాఁడ నో
పులుఁగుల ఱేఁడ! నీవడు నపోహము లన్నిటి కు త్తరంబు ని
చ్చలు నొనరించితే సుజనసంగతి మోహ మణంగు శంకలున్
బొలియును రామగాథ వినఁబోలును నిచ్చలు దత్సుసంగతిన్.　　308

క. ముని సంకీర్తితమహా రా
ముని చరితము వినఁగ నగును మొదలం దుదలం

దనయము రామప్రతిపా
దనమూఁ దత్సూజను సంగతంబున నెందున్. 309

చ. హరిచరితప్రసంగ మనయం బొనరించెడు చోటి కన్పుదున్
హరికథ లాలకింపు భ్రమ మంత యణంగి వివేక మబ్బు శ్రీ
హరిచరితానురక్తి యొనరారు సదాశ్రయ మబ్బుమిన్ వినన్
దొరకవు సత్కథల్ భ్రమము ద్రుంగదు తత్కథ లాలకింపమిన్. 310

క. ఆమోహ మణంగని దే
రామపదాంబుజ దృఢానురాగ మొదవ దా
రామపదాప్తి లభింపమి
రాముఁడు చిక్కఁడు తపోవిరాగాదుల నేన్. 311

క. కల దుత్తరదిశ నీలా
చల మయ్యచలమున రామచరితము లెపుడున్
బులుఁగులకును వినుచును బ్ర
బలుఁ గాకభుశుండి నా తపస్వి యొకండున్. 312

తే. జ్ఞానవారాశి గుణరాశి సంతతహరి
భక్తిమార్గానుయాయి సద్వర్తనుండు
పెద్దకాలపు టాకాకిపెద్ద యెపుడుఁ
బులుఁగుగములకు వినుచు రామునిచరిత్ర. 313

క. హరిగుణచరితము లయ్యెడ
కరిగి వినుము మోహసంశయంబు లణంగున్
దురితములు దొలఁగు నన నా
గరుడుఁడు మత్పదము లంటి కనఁ జనెఁ గాకిన్. 314

ఉ. ఆగరుడుండు నొక్కపు డహంకృతిఁ దాలిచి యుంచు మాయ న
న్నేగతిఁ గ్రమ్ము సంతతర మేశపదాంబురుహాగ్రవాసి నం

చాగరువం బణంప హరి యాత్మఁదలంపఁగఁ బోలుఁ గాననే
యాగతిఁ గాంచియున్ దెలుప కంపితి నాతనిఁ గాకిపాలికిన్. 315

క. పులుఁగుల పలుకులె తెలిఁగన్
బులుఁగుల కగు ననియు ననిపిపుచ్చితి నతనిన్
బులుఁగుదొరఁ గాకిపాలికి
బలియుఁ డెవఁడు దైవమాయఁ బారముఁ గాంచన్ 316

క. సువివేకి భక్తవరుఁడున్
భువనేశుని వారువంబు పులుఁగుల ఱేఁడే
వివశుఁడుగా హరిమాయకు
భువిజను లభిమాన మూనఁ బ్రోడలె చెపుమా! 317

క. భవరాజీవభవాదులె
యవశులుగా మాయ కవిసి యన్యు లెవారల్
వివశాత్ములు గాకుం ద్రని
ప్రవిమలమతు లెఱిఁగి కొల్తు భగవంతు హరిన్. 318

మ. గరుడుం డంత ననంత భక్తిరతుఁ డక్కాకర్షి యున్నట్టి యా
గిరి కేగన్ గిరిఁ గాంచు నంతనె తొలంగెన్ మోహశంకావ్యథల్
సరసిన్ మజ్జన మాడి ప్రీతి వటవృక్షంబున్ గనంబో నతం
డరుదెంచెన్ విహగాళియున్ హరిచరిత్రాకర్ణనాసక్తమై. 319

తే. దేశదేశాలనుండి యేతెంచి పిట్ట
గుము లచోటను గుమిగూడి కూరుచుండె
బిట్టగుమికాఁడు కథ మొదలెట్టఁ జూచు
చుండె నాలోనఁ జేరెఁ దార్క్ష్యుండు నటకు. 320

మ. అటు లేతెంచిన పక్షిరాజుఁ గనుచున్ హర్షించి యాకాకి ని
ష్కుటిలప్రీతి నుపేతసభ్యతతిమై కొండాడి వేమాఱు లా

దటఁ దద్భద్రము నద్గి పీఠమిడి యత్యంతాప్తిఁ బూజించి తా
నిటు లాడెన్ ఖగరాజ! నిన్నుఁ గనుఁగో నీడేరె నాజన్మమున్. 321

క. వచ్చినపని సెలవిచ్చినఁ
జెచ్చెరఁ జేసెద విహంగశేఖర! కార్యం
బచ్చుపడఁ దెలుపు మన వా
క్రుచ్చని టూపులుఁగుఱేఁడు కోమలఫణితిన్. 322

ఉ. చిచ్చుఱకంటివేలుపె వచించెను నీమహనీయభావమున్
నిచ్చలు మెచ్చి వేమరును నీ వనయంబుఁ గృతార్థరూపుఁడౌ
దచ్చెరు వయ్యె నీమహిమ పూరయ నిన్ గనుమాత్రఁ దీఱె నా
వచ్చినకార్యమెల్ల మునివర్య! విడెన్ భ్రమ మీఁగిరిన్ గనన్. 323

క. వినుతింతు వాయసోత్తమ!
యనఘం బతిపావనంబు నార్తిహరమునౌ
నినవంశోత్తము చరితము
విన వేడుకయయ్యె దాని వినిపింపు మనన్. 324

• కాకభుశుండిగరుడునకు రామచరిత్రముఁ దెల్పుట •

ఉ. నావుఁడు వైనతేయుని వినమ్రవచోవిధి కబ్బ మందియూ
పావనశీలి వాయసతపస్వి కుతూహల ముప్పతిల్ల సీ
తావిభుసచ్చరిత్ర మవధానముననఁ దెలుపం దొడంగె ముం
దావిభుసద్గుణాళిఁ గడునాదట గాన మొనర్చి యాపయిన్. 325

ఉ. నారదమోహమున్ దనుజనాథుని జన్మము రామజన్మమున్
జారుశిశుత్వలీల మునిచంద్రుని రాకయు యాగరక్ష సీ
తారమణీకరగ్రహముఁ దత్పురి నయ్యభిషేకయత్నమున్
భూరివరప్రదానమును బూనికి రామవనప్రయాణమున్. 326

ఉ. పౌరజనానుతాప మటుపైన నిషాదునిభక్తిరీతి భా
గీరథి దాఁటుభంగి మునికేసరి దర్శనమున్ బ్రయాగలో
నారఘువీరు నున్కి యటు లాపయి వాల్మికి దర్శనంబునున్
వారక చిత్రకూటగిరివాసగతుల్ వినిపించి యాపయిన్ 327

చ. సచివపురాగమంబు నృపచంద్రుని యస్తమయంబుఁ గైక చూ
లుచితగతిన్ బితృక్రియల నోజ నొనర్చి ప్రజాసమేతుఁడై
రుచిరసుఖానుభూతి నెడరోసి సహోదరుఁ డోడితే నసం
కుచితమతిన్ వనంబునకుఁ గొబ్బునఁ జన్నవిధంబుఁ బల్కుచున్. 328

ఉ. ఆతని ప్రీతిరీతిఁ గొనియాడి రఘుప్రభుపాదుకాయుగం
బాతతభక్తిఁ దెచ్చినక్రియన్ వినిపించి తదీయనీతిని
ష్ఠాతతదీక్ష లాడుచు జయంతు దురాచరణంబుఁ దెల్పి యా
పూతచరిత్రు లత్రిమునిముఖ్యుల దర్శన మాడి యాపయిన్. 329

క. శరభంగతనుత్యాగము
విరాధవధమున్ సుతీక్ష్ణప్రేమవిధంబున్
వరుస నగస్త్య సమాగమ
మరిమిలి వినిపించి దండకాటవి నునికిన్. 330

సీ. దండకాటవి శోభఁ గొండాడి కొండాడి
శకునముఖ్యు జటాయుసఖ్యవిధముఁ
బంచవటీకుటీవాసమున్ వర్ణించి
మునిభయభంజనంబును వచించి
సౌమిత్రి వడసిన జ్ఞానవిధం బాడి
చుప్పనాతి చనిన చొప్పు వలికి
ఖరదూషణాదిప్రఖరరాక్షసవధంబు
దనుజుఁ డక్క లెఱింగిన విధంబుఁ

తే. బలికి రావణమారీచవాద విధము
నాడి యమ్మాయి సీతాపహరణ విధము
రామవిరహంబు వర్ణించి గ్రద్దపెద్ద
కాతఁ డంత్యక్రియల్ సేయురీతిఁ దెలిపి. 331

క. సొబగుగఁ గబంధవధమును
శబరీముక్తి ప్రదాన చరితము నాపై
విబుధర్షి సమాగమమును
బబు వాపం పాసరంబు పాలికిఁ జనుటన్. 332

క. పావనిసమాగమంబును
భూవరసుగ్రీవసఖ్యమున్ వాలివధం
బావల నా సుగ్రీవున
కావానర రాజ్య మొసఁగు టంతయుఁ దెలిపెన్. 333

శా. ఆపై తేఁడు ప్రవర్షణాద్రి పయి భ్రాత్రన్వితుండై నిల్చుటన్
గోపోద్దీపితుఁ డౌట యం దతఁడు జాకున్ జెంద కీశేశ్వరుం
డాపైఁ గీశుల నంపి పుచ్చుటయు సీతాన్వేషణార్థంబు వా
రాపాతాళబిలంబుఁ జొచ్చుటయు మునౌ సర్వవృత్తాంతమున్. 334

క. సంపాతిదర్శనంబు, న
పాంపతితారణము, దనుజపతిపురి సీతా
శంపాలతాంగిఁ గని ప్రా
కంపని వనిఁ గూల్చిప్రోలు గాల్చిన విధమున్. 335

క. రాకాసిదారకుఁ గపికుల
రాకాశశి బుద్ధిఁగఱపి రహిఁజని సీతా
రాకాజ్ఞానన సేమము
రాకాసులగొంగ కాడు క్రమమును దెలిపెన్. 336

క. పిమ్మట రఘుపతి యవ్వానిఁ
ద్రిమ్మరిబలగమ్ముతో సరిత్పతితట మా
దిమ్ముగ దిగుటయు రావణు
తమ్ముఁడు శరణార్థియౌ విధమ్మును బలికెన్. 337

క. మున్నీటిపొం గణంచుట,
యన్నీటంగట్టఁగట్టి యవ్వల లంకం
జన్నవిధి సంధి కంగదు
నన్నిశచరనాథుకడకు నంపినవిధమున్. 338

చ. వివిధవిధంబులన్ బలికెఁ బిమ్మట నాకపిభల్లుకాసురా
హవసువిశేషముల్ దశముఖాత్మజు భండనపాండితీవిధం
బవలను గుంభకర్ణువధ మవ్వల నారఘురామరావణా
హవసముదంత మాపయి దశాస్యవధం బసురీవిలాపమున్. 339

సీ. రావణానుజు దైత్యరాజ్యాభిషిక్తునిఁ
గావించినవిధంబుఁ గాసివాసి
జేజేలు వారెల్ల తేజరిల్లినరీతి
మైథిలీరామసమాగమమును
విభుని వేలుపులెల్ల వేఁడుకొన్న విధంబుఁ
బురికిఁ బుష్పకమెక్కి యరిగినగతి!
దనుజానుజానుజావనిజాసమేతుఁడై
క్షితిపతిపురిఁ బ్రవేశించినగతిఁ

తే. బలికి పట్టాభిషేకోత్సవమును బలికి
రాజ్యవర్ణన మొనరించి గాణమీఱ
రాజనీతివిధానంబు రహిం బచించి
వేమరున్ రామమహిమంబు విశదపఱచె. 340

## కాకభుశుండి గరుడునకు హరిమాయా ప్రభావము నెఱింగించుట.

ఉ. అవి యి వనంగ నేల యతఁ డారఘురామకథావిశేషముల్
వివిధవిధంబులన్ వినిచె వేమరు నీకు వచించినట్టి వే
యవనిధరాత్మజాత! విను మాగరుడుండు న వాలకించి తాఁ
బ్రవిమలచిత్తుఁడై యెలమి వాయసశేఖరుఁగాంచి యి ట్లనెన్. 341

తే. కరటవంశావతంస! యోపరమహంస!
సంశయంబు లడంగె నాశంస ముడిగె
రామకథ వింటి నీయనుగ్రహముఁ గంటి
హరిపదాప్తినిగంటి మోహంబు గెంటి. 342

చ. బవరమునన్ బ్రభుండు ఫణిపాశవశుం డవుటా దలంచి మో
హావశుఁడ నైతి బోధమయుఁడో విభుఁడే మనుజానుసారియై
యవశునిఁబోలెఁ గట్టుపడు నాకత మే మను సంశయంబునన్
భవికముగాఁ దలంతు నెద నాభ్రమమీమిష నిన్ను గాంచుటన్. 343

తే. ఎండ పడఁగొన్న వానికె యెఱుఁగ వచ్చు
దపుల నీడల పెనుజల్లఁదనపుసుగము
నే నిటుల్ మోహితాత్ముండ గాని యెడల
నెట్లు నినుఁ గందు నీభాగ్య మెట్లు కందు. 344

తే. ఈపు పాడిన హరికథ లెట్టు విందు
నెట్టు కడగందు మోహాబ్ధి నీఁది యీఁది
వేదశాస్త్రపురాణాది వాద మిదియ
సిద్ధమునివాద మిదె శంక సేయ వలదు. 345

తే. రాముఁ డెవ్వాని దయఁ జూచు నామహీతుఁడె
సాధుసంగతిఁ బడయఁగఁ జాలువాఁడు

రామకృపకల్మి నీయనుగ్రహము కలిగెఁ
బాసె నీకృప మోహవిభ్రాంతు లనఁగ. 346

క. ప్రీతివినీతపునీతము
లౌ తార్క్ష్యుని పల్కుపల్కు లాలించి దృగ
బ్జాతము లశ్రులఁ బులక
వ్రాతమునన్ మేను బొంగ వాయస మలరెన్. 347

చ. తతమతులున్ సుశీలురు కథారసికుల్ హరిపాదపద్మసం
యత మధుపాయమానమతులౌ తగుశ్రోతలు చిక్కినప్పుడే
క్షితిధరకన్యకాగ్రణి వచింతురు దాఁపక యెట్టి గోప్యమౌ
మతముల నేని సాధు లనుమాన మొనర్పక కోరినంతనే. 348

ఉ. అంత విహంగపుంగవున కాదటఁ గాకభుశుండి పల్కె నా
గాంతక! యెల్లభంగుల సమాదరణీయుఁడ వీవు జానకీ
కాంతునకుం గృపాస్పదుఁడవు కల్గదు నీమది మోహ మింత త
ద్భ్రాంతిమిషన్ నినున్ గనఁగఁ బంచి ననున్ దొర పెద్దఁజేసెఁజూ. 349

క. నీకేటి భ్రాంతి నన్ని
సాకునఁ గృపఁ జూడ నిట్లు చనుదెంచితి కా
కోకాకోదరభుగ్వర
వాకొంటి విటీవు మోహపడిన విధంబున్. 350

ఉ. అచ్చెరు వింత లేదల భవాబ్జభవుల్ సనకాదిసంయముల్
నిచ్చలు నాత్మవాదులును నేర రనన్ హరిమాయ దాఁట ని
న్నిచ్చఁ దలంప నేటికిఁక నెవ్వని మోహ మదంధుఁ జేయఁబో
దెచ్చటఁ గామ మేని నటియింపఁగఁజేయదు పిచ్చివానిగన్. 351

సీ. క్రోధ మెవ్వనిమదిఁ గుములంగఁ జేయదు
వెఱ్ఱిఁ బుట్టింపదు వేని కాశ

అధికారమద మేని బధిరాంధుఁ జేయదు
శ్రీమద మెవ్వానిఁ జెఱుపకుండు
గామినీనయనాస్త్ర మేమాన్యుఁ దాఁకదు
వెలితిపుచ్చదు వేనిఁ బసినితనము
అలయింప దెవ్వాని [illegible]వసజ్వర మది
మదమానములు వేని మలయకుండు
మచ్చరం బెవనికి మచ్చుఁ బెట్టకుండును
మమత వేని యశము మను గలుపదు
చెనకి క్రమింగ దెవనిఁ జింతాభుజంగంబు
మాయ భువి నెవానిఁ దాయకుండు. 352

క. పుత్రేషణము లను వి త్తక
శత్రేషణము ల నెవనిఁ గలంచక యుండున్
ధాత్రి మనోరథ ఘుణ మే
గాత్రతపువుఁ దొలఁచకుండు గణుతింపంగన్. 353

శా. ఈ మాయాపరివార మెల్ల ప్రబలం బెవ్వాఁడు సృష్టించు నం
దామృత్యుంజయుఁ డబ్జజుండు సయితం బమ్మాయకున్ జంకఁగా
నీమై నొడ్ల ననఁగ నేల జగమం దెచ్చోట వ్యాపించుఁ జు
మ్మామాయాబల మాబలాధిపులె మోహక్రోధలోభాదులున్.354

క. అటు లా మాయాబలముస
భటు లట పటుకపటదంభ పాషండంబుల్
భటురాలు మాయ హరి కది
తటుకునఁ దొలఁగంగఁబోదు తత్కృప లేమిన్. 355

తే. నటుఁడు కోఁతుల నాడించి నటులు మాయ
చిందుత్రొక్కించు జగములఁ జిత్రగతిని

దలఁచి "యిదమిత్థ" మన లేదు తచ్చరిత్ర
మట్టి మాయయను పరిచారికయంతఁ గూడి
విభుని కనుసన్న మెలఁగుఁ జుమీ! విహగరాజ! 356

ఉ. అనఘుఁ డనామయుం డజుఁ డనంతుఁడు వ్యాపకుఁ డప్రమేయుఁడున్
ఘననిభగాత్రుఁ డీశుఁడు జగత్పతి జ్ఞానమయుండు భక్తరం
జనుఁడు నిరంజనుండు గుణసాగరుఁడున్ సకలాంతరాత్ముఁడున్
ఘనుఁడు విమోహదూరుఁ డవినాశియు బ్రహ్మమునౌ పరాత్పరున్. 357

క. భ్రమ మంటునె? రవిప్రోలను
దమ మంటునె! భక్తజనుల దయఁ బ్రోవ నృపో
త్తముఁడై హరి ప్రాకృత చరి
తము గొనరిచెఁ బుట్టి మనుజతనువున ధరణిన్. 358

తే. నటుఁడు బహువేషధారియై నటనములను
హావభావమ్ము లెన్నియు నగుపరచిన
నారసవ్యాప్తి తన్మతి నంటనియటు
లంట దమ్మాయినటరాజు నటనలీల. 359

క. దనుజవిమోహన మాశ్రిత
జనసుఖదము నైన రామచరితంబును దు
ర్జనులు మతిమందులును గా
మనిరతు లెదఁ జేయకే భ్రమ మొనర్తు రిలన్. 360

తే. కామలారోగి పచ్చగాఁ గాంచు శశిని
బ్రొద్దు దిగ్భ్రాంతుఁ డస్తాద్రిఁ బొడిచె ననును
గిఱ్ఱునన్ దిర్గు కుఱ్ఱఁడు గృహము లెల్లఁ
దిరుగుచున్నటు కాంచుఁ దాఁ దిరుగుచుండి. 361

తే. ఓడనెక్కిన యాతఁ డవ్వాడ లెల్ల
కదలుచున్నటు కాంచుఁ దాఁ గదలకుండి

యటులై మాయాగ్రహగ్రస్తులౌచు జనులు
హరిని బ్రాకృతుఁ డంద్రుఁ డ త మ్మరసికొనక. 362

మ. సలుపంబోను జు మయ్యా! పక్షివర! యజ్ఞానప్రసంగం బటుల్
కలనే నాపరమాత్మునం జెపుడు నేఁ గామాదిలస్వాంతులున్
ఖలులున్ మోహవశాత్ము లౌచు నిజశంకా మోహముల్ స్వామిపై
వెలయింత్రజ్ఞులు మోహపుంజెర లెడన్ వేమారునున్ గ్రమ్మికో. 363

క. కామక్రోధపరాయణు
లేమయి హరి నెఱుఁగఁ గందు రిల నాసంసా
రామయపీడితులును మా
యావశ్వరయుతులు నిజతమోంధునిమగ్నుల్. 364

క. సుగమ మగు సగుణరూపం
బగమ్య మగు నగుణరూప మది కనలే రా
సుగమాగమ్య చరిత్రము
లగమ్య మయి మునుల భ్రమవశాత్ములఁ జేయున్. 365

క. విను మోవిహంగపుంగవ!
వినుతు యథామతిని రామవిభు వైభవమున్
మును నే మాయామోహిత
మనస్కుఁడ నగు విధమెల్ల మక్కువ మీఱన్. 366

ఉ. రామకృపైకపాత్రుఁడవు రామగుణశ్రవణైకలోలుఁ డే
దో మహనీయ! దాఁపురము నొం డొనరింపక తెల్పువాఁడ నీ
కామఱుఁ గెట్టిదైన విను మాశ్రితుఁ డాత్మ నహంకరించినన్
స్వామి సహింపఁ డద్ది పరిభావ మొనర్చి తొలంచకుండఁగన్. 367

శా. నానాశోకనిదానమున్ భవనిదానంబున్ వ్యథామూల మాఁ
గానన్ మానముఁ ద్రోలు దవ్వులకు భక్తస్వాంత మందుండి వే

తా నవ్యాజకృపన్ విభుండు శిశుగాత్రవ్యాప్తవిస్ఫోటమున్
మానింపన్ వ్రణశోధనంబుఁ గఠుణన్ సల్పించు మాతన్ బలెన్.368

ఉ. బాధ సహింప కేడ్చినను బాలునియేడ్పు గణింప కామె త
చ్ఛోధన మాచరించి విసు మన్ మొదలంట వ్రణంబు మాన్పఁగా
నీధర రాముఁ డేపుఁ డటులే దురహంకృతి మాన్చి భక్తహృ
ద్వ్యాధిఁ దొలంచుఁ దచ్ఛ్రితహితాచరణైక పరాయణాత్ముఁడై.369

క. అట్టి విభు జానకీవిభు
నెట్టు భ్రమం బుడిగి కొలువ వీ వో మనసా!
కట్టిడి భవబంధంబులు
నెట్టనఁ దెగు నామహాత్మునిన్ గొలిచితి వేన్. 370

క. రాముని కృపాస్వభావము
నాఖిలార్యంబును వచింతు నాగాంతక ! వి
న్మోమెయి నవహితమతివై
రామపదాంబుజసరోజరతచిత్తుఁడవై. 371

కాకభుశుండి తాను పూర్వము మాయామోహితుఁడైన
వృత్తాంతముఁ జెప్పుట.

ఉ. ఆవిభుఁ డెప్పు డియ్యల నరాకృతి రాఘవుఁడై జనించె భ
క్తావనశీలియై బహువిధాచరణంబు లొనర్ప నప్పు త
త్పావనబాలలీలఁ గనుపండువుగాఁ గనుఁగొ నయోధ్య కం
దావిధి నేగి కంటిఁ జుమి యాతని దివ్యచరిత్ర లింపునన్. 372

క. రాముని జన్మదినోత్సవ
మామెయిఁ గని బాలలీల లన్నియుఁ గని త
త్స్వామిక్రీడాలోకన
కాముకుఁడ నయి నిలిచితి నగరి నేనేండ్లున్. 373

చ. జితశతకోటి మన్మథ విశేషతనూ విభవుండు రాఘవ
క్షితిపతి బాలరూపకుఁడె చేకుఱెఁ నామది కిష్టదేవుఁడై
పతగపతీ! యటావిభుని బాల్యవిచేష్టల వెల్ల గాంచుచున్
గుతుకముతోడ నే సతతిఁ గూడి చరించితిఁ గాకిరూపునన్. 374

క. ఎందెందు బాలరాముఁడు
చిందాడుచు నాడు నందుఁ జెచ్చెరఁ జని వా
నిం దవిలి తలివి తిరుగుచుఁ
దిందుఁ దదుచ్ఛిష్టములను దీఱని ప్రేమన్.

ఉ. చిన్నతనాన రాముఁ డొకచిత్రచరిత్ర మొనర్చె దాని నేఁ
డెన్న నొడల్ గగుర్పడుఁ జుమీ! విభులీలఁ దలంచుకొన్నచోఁ
బన్నగవైరి! విన్ము విభుభక్తసుఖావహమౌ చరిత్ర మం
దెన్నఁగ రాదు రాజగృహ మెంతో యవర్ణ్య సువర్ణకుడ్యమై. 376

శా. ఆసౌధాంగణమందుఁ జిందులిడి భ్రాత్రన్వితుండై బాలలీ
లాసౌరభ్యముఁ జూపుఁ దల్లులకు నుల్లాసంబు సంధిల్లఁగా
నానానాస్త్రతనూవిలాసుఁడు ఘనశ్యాముండు రామప్రభుం
డాసంఫుల్లసరోజలోచనుఁడు నేత్రానందసంధాయియై. 377

క. తరుణారుణ సరసిజమృదు
చరణనఖద్యుతులు మీఱుఁ జంద్రప్రభలన్
సరసిజ పవి ధ్వజాంకుశ
వరరేఖాంచితము లౌచు వఱలు పదంబుల్. 378

క. చరణముల గజ్జె లందెలుఁ
గరము మృదుస్వనము లీను ఘులు ఘుల్లని బం
గరువు మొలకట్టు బహుమణి
విరచితమై శోభమీఱు విభుకటిసీమన్. 379

క. సురుచిరవళిత్రయంబునఁ
గర మలరును గుక్షి నాభి గంభీర మగున్
నెఱపగు వక్షస్థల మా
భరణాభరితంబునై యవర్ణ్యం బౌ నేన్. 380

ఉ. అచ్చెలువారు మోము, నరుణాధరబింబముఁ, జారునాసయున్,
ముచ్చట మీఱు లేఁగొనబు బుగ్గలు గౌదయు వంకకన్బొమల్
వచ్చియురాని పల్కుదురు వన్నెల వెన్నెలనవ్వు నవ్వు నా
వచ్చియురాని యాచిలుకపల్కులుఁ గుల్కులు మేమెఱుంగులున్

క. ఆ కర్ణశ్రీ వైభవ
మాకర్ణాయత విలోచనాభయు వాకో
నాకర్ణింపఁగ నగునే
జోకన్ గనులారఁ జూడఁ జొప్పడుఁ గానీ. 382

క. అలకంబులఁ గస్తూరి
తిలకంబున నలిక మెంతో తీరారంగాఁ
దలుకుఁ గులుకు నుంగ్రపు నెఱ
కల నొసల జెన్నుమీఱుఁ గనువిం దగుచున్. 383

మ. అమలాబ్జారుణ చారుపాణియుగళం బాబాలహర్మ్యక్షవ
క్షము నాజాను భుజద్వయంబు వరశంఖగ్రీవమున్ జారుఫా
లము నానాభరణాంచితాంగము లమూల్యక్షౌమకూర్పాస మం
దమితానందముఁ గూర్చె నావిభుని బాల్యాకల్ప చేష్టాకృతుల్. 384

ఉ. ఆనవులాట, లాకిలకిలాటలు, దూఁటుల నేమనన్ విభుం
డానృపమందిరాంగణము నందున నీడను జూచి యాడు నా
తోనను వొప్పఁ బల్గతుల దూఁకు దుముక్కున గంతువైచుఁ గై
కోనరుదెంచు నేఁ బరువుఁ గొన్న నపూపముఁ జూపి త్రిప్పినన్. 385

ఉ. ఏ దరికేఁగినన్ దనియు నేప్పును బైకెగయంగఁ గ్రమ్మఱన్
బాదము లంట డాసినను బాఱును వెన్కకుఁ దిగ్గి కాంచు చా
మాదిరిఁ బ్రాకృతాకృతి నమర్త్యవిభుం డొనరించు లీలలన్
లోఁదలపోసి మోహవికలుం డయితిన్ విభుఁడే మొనర్చినాన్. 386

తే. ఆచిదానందసందోహుఁడే విభుండె
యిట్టి చరితం బొనర్చెని దేమొ యంచుఁ
దలఁచు నంతన హరిమాయ యలముకొనియె
గాని యొరునట్ల నన్నది గాసిపెట్టి
భవమహాంధువునం గూల్పక వల నిల్చె. 387

ఉ. ఇంతకు హేతు వుండె వినుమీ విహగోత్తమ! స్వామి సచ్చిదా
నందమయుండు రాఘవుఁ డనంతచరాచరకోటి మాయచే
బందములందుఁ జిక్కి భువిఁ బ్రాణులు నెల్లరు జ్ఞానహీనులై సదో
నెందున నుండు జీవపరమేశ విభేదము చెప్ప నేర్పెనన్. 388

క. మాయావశుఁడే జీవుఁడు
మాయయు భగవద్వశమ్ము మాయేశుఁడు స్వే
చ్ఛాయుతుఁడు నద్వితీయుం
డేయెడఁ బరతంత్రు లిల ననేకులు జీవుల్. 389

ఉ. జీవపరేశ భేదము రచించెను మాయయ కాని పాయుదా
దేవర సత్కృపామహిమఁ జేరకయున్న నదెంతు మోక్షల
క్ష్మీవిభవంబు నాహరి భజింపక యుండిట నిచ్చగించు నా
నేవిధి వింతగా డగుఁ గదే భువి, హీనవిషాణపుచ్ఛుఁ డేన్. 390

మ. శశిబింబం బది మింట షోడశకళాసంపూర్ణమై క్రాలనీ,
విశదంబై యుడురాజితోడఁ బృథివీభృచ్ఛ్రేణి దావాగ్నికిన్
వశమై క్రాలఁగనీ, దినేశుఁ డుదయింపంబోక రే యెట్టుండిటన్
బ్రశమింపంబడ నట్లు పోవు హరిసేవం గాని జీవవ్యథల్. 391

చ. పరువ దవిద్య రామపదభక్తుల విద్యయె పస్వఁ దత్క్రపన్
బరగదు భక్తకోటి కొకపాటును బర్వ సభేదభక్తి యా
సరణి భ్రమించు న న్నరసి స్వామి రెయొకించుక నవ్వె నవ్విధం
బరయ రెవారు మాతృపిత లందున నాడెవు తమ్ముగుట్టలున్. 392

క. తరుణారుణాబ్జకోమల
కరచరణుఁడు రామశిశువు కై కొన నన్నున్
బరువిడి ప్రాఁకుచు రాఁగాఁ
గరములఁ జాపుచును బై కెగసితిన్ నేనున్. 393

సీ. ఏ నింగి కెగసిన నెగసెను నావెంట
బుజములఁ జాపు చాబుడుత రాముఁ
డెగయ నే దవ్వున కెగసె దవ్వునకు నే
విధిలోకమున కేగ వెంటఁబడియె
నేఁ బాటినకొలంది యెగసి వెన్నంటె నన్
రెండంగుళుల మేర యెుండెడగను
సప్తావరణముల సరగ నే భేదించి
చనఁగల్గిన కొలందిఁ జని యచోటఁ
గ్రమ్మఱం గాంచి యాబాలరామవిభుని
యలసి సొలసియుఁ గడు వికలాత్ముఁడ నయి
లోఁగి కనుమూసి తెఱచు నాలోనఁ గంటి
బాలలీలావిలోలు నృపాలబాలు
క్షితిపతిగృహస్థు నా త్రిలోకీగృహస్థు. 394

చ. అటు ననుఁ గాంచి స్వామి దరహాస మొనర్పఁ దదాననంబునన్
దటుకునఁ జొచ్చి కాంచితిఁ జఠరంబున ముజ్జగంబులన్

పటలవిలోచ నాబ్జభవ నీరజబంధు సుధాంశు తారకా
పటల దిగీశయుక్తము లపారసరోజభవాండభాండముల్. 395

చ. సురగరుడోరగావళులఁ జూచితిఁ జూచితి సిద్ధసాధ్య కి
న్నర నర యక్షరాక్షసగణంబులఁ జూచితి భూరిభూధరా
ధరధరణీరుహాబ్ధివనతండము సర్వము వేయు నేల నే
దొరకొని చూచితిన్ విధిచతుర్విధసృష్టివిచిత్ర మంతయున్. 396

క. మును గనివిని యెఱుఁగనియు
మనమునఁ దర్కింపరాని మహితాద్భుతముల్
కనుచును నూఱేం డ్లొక్కొక
వనజభవాండమున నుంటి బాలుని కుక్షిన్. 397

క. ఈగతిఁ బెక్కు లజాండము
లేఁ గనుచున్ దిరిగినాఁడ నేలోకము నం
దాగౌరీశర మేశుల
వాగీశుల వేఱువేఱు నసుసన్ గంటిన్. 398

క. నరకిన్నర రక్షస్సుర
గరుడోరగ సిద్ధసాధ్య గణముల భూభూ
ధర ధరణీరుహ జలధుల
నరసితి వేర్వేఱ నయ్యజాండము లందున్ 399

చ. ప్రతిభువనంబునందునఁ బ్రపంచవినోదము లెన్ని కంటిఁ గాం
చితి నిజరూప మన్నిఁటను జిత్రగతిన్ సరయూస్రవంతిఁ గాం
చితిని నయోధ్యఁ గంటి నృపశేఖరుఁ బంక్తిరథున్ సతీసుతా
న్వితుఁ గనుఁగొంటిఁ గంటి సరవిన్ భరతాదులలీల లన్నిఁటిన్ 400

చ. భువనము లన్నిఁటన్ విభుని పుట్టువు బాల్యవినోదలీలలన్
వివిధవిచిత్రముల్ గనుచు వేమరు వేయిఁటి వేయిహాపులన్

వివశుఁడ నైతిఁ గాని రఘువీరుని జూపు వసంతోడ్పుఁ గొనఁ
చ్ఛవినిధి నర్భకాకృతిని సాదరుఁ గాంచుచుఁ దిర్గుచుంటి నే. 401

క. మాయా మోహిత మతినై
యీయబ్జభవాండపంక్తి నటు తిరిగెదు నా
కాయెడ శతకల్పములకు
నాయాశ్రమ మొక్కెడన్ గనంబడె నంతన్. 402

ఆ. తిరిగితిరిగి యట్టు లరుదెంచి యాశ్రమ
మందుఁ గొంతకాల మధివసించి
మగుడ రామజన్మమహోత్సవముఁ జూడ
నెలమి నాయయోధ్య కేగినాఁడ. 403

తే ఉత్సుకత మీఱ రామజన్మోత్సవంబు
నాశిశుక్రీడఁ గనుఁగొంటి నట్లు లేగి
ముజ్జగమ్ముల గొజ్జఁగుజ్జు బొజ్జ
లోపలన్ గంటి నగణితరూపములను. 404

తే. కననగున్ గాని వాని వాకొనఁగ నౌనె
మగుడఁ గన్గొని రామకుమారరూప
మొండొకం డందు మోహశోకులుండ నగుచు
భ్రమలఁ గుమిలితిఁ బల్మారుఁ బలువితముల 405

క. అటు మోహాకులమతినై
దిటవేది తపించుచుండి తేఁజితి నందున్
ఘటికాద్వితయమునకు హ్రా
త్పుటమున మోహాంపుఁ దెరలు తొలఁగి చనంగన్. 406

వ. అటు పటుసంశయాకులుఁడనౌ నుదరస్థుని నన్నుఁ గాంచి యా
దట నగె నవ్విభుం డపుడె తద్వదనంబుననుండి బైటకున్

దటుకున దూఁకితిన్ విభుఁ డతం డటులే శిశులీలలన్ ననున్
దటవటఁ జేయఁ దక్కొన వెదన్ సుఖశాంతుల వెంత తేర్చినన్. 407

ఉ. ఆవిభు పారిభవంబుఁ గనినంతఁ దనుస్మృతిఁ దప్పి నేలపై
వా విరి మాట లేక పడి పాహి! ప్రపన్నశరణ్య! యంచు లో
లో విభు వేఁడుకొన్న వికలుండగు నన్గని స్వామి నైజమా
యావిభవంబుఁ బోనడఁచి యర్థిఁ గరాబ్జము మోపె నౌదలన్. 408

ఉ. ఆవిధి భక్తకోటి కభయావహ మైన కరాబ్జ మౌదలన్
వావిరి ప్రీతి మోపి యెడఁబాపెను దుస్సహశోకమోహముల్
సేవకసౌఖ్యదాయి రఘుశేఖరుఁ డట్లపు డేను స్వాంతమం
దావిభు భక్తవత్సలత నారసి యంజలి మోడ్చి వేఁడితిన్. 409

క. ఎలమి మెయి సమ్మదాశ్రువు
లలమఁ గనుంగొనలఁ బులకితాంగుఁడనై యం
జలిఁ గూర్చి ప్రస్తుతించితిఁ
బలుమరుఁ బలుగతుల విభుని భక్తి తలిర్పన్. 410

కాకభుశుండి తనకు భగవంతుఁడు ప్రసన్నుఁడై వరము
లిచ్చిన వృత్తాంతముఁ దెల్పుట.

ఉ. పిమ్మట నాకృపాబ్ధి రఘువీరుఁడు ప్రేముడిమీఱు వేఁడుకో
లమ్మెయి నాలకించుచు నిజాశ్రితుఁడంచు ననుగ్రహించి నన్
గమ్మనివల్కుఁ బల్కె నిటు కాకభుశుండి! వరమ్ము వేఁడుకో
మ్మెమ్మెయి సుప్రసన్నుఁడఁ జుమీ! వర మిచ్చెద నేదొ కోరుమా!

క. కోరుదువో యణిమాదులఁ
గోరుదొ కైవల్యపదముఁ గోర్కె మజ్ఞాండేన్

గోరుదా కోరుము నీమదిఁ
గోరిన కోరికి యెదేని కొంకక యిడుదున్. 412

చ. వినయవివేకవిజ్ఞతల వేఁడుము తాపసదుర్లభంబునౌ
ఘనపద మెట్టిదే నడుగు తాదన కిత్తు ననన్ దలంతుఁ బే
ర్కొనె విభుఁ డెద్దియో నడుగుకొమ్మని యన్నిటిఁ గాని స్వాంఘ్రిభ
క్తిని నిడఁ బేర్కొనందుగ క్షితిన్ వృథ భక్తివిహీనసౌఖ్యముల్. 413

చ. లవణవిహీనభోజ్యముల లాగున భక్తివిహీనసౌఖ్యముల్
భువి వృథగావె యంచుఁ దలపోసి వచించితి స్వామితోడ "స
ర్వవిదుఁడ వౌదు దేవర! వరం బిడ నీవు ప్రసన్నుఁ డైతివేన్
భవదమలాంఘ్రిపద్మరతి భక్తియు రక్తి యొసంగ వేఁడెదన్. 414

తే. మునులు యోగులు నీకృపఁ గనినఁ గాని
సంతతాన్వేషణము సల్పిసల్పి దేని
వేఱలో గాని పడయఁగా నేర రట్టి
శ్రుతిపురాణప్రసిద్ధ విశుద్ధభక్తి. 415

తే. నన్నుఁ గరుణించి యిమ్ము ప్రపన్నబంధు!
ప్రణతబంధు! కృపాసింధు! భక్తవరద!"
యనుచు వేఁడిన భక్తకల్పాగమంబు
ఘనగభీరోక్తి "నేవమ" స్తనియెఁ గూర్మి. 416

ఉ. క్రమ్మఱఁ బల్కె వాయసశిఖామణి! ధీచతురుండ వయ్య! యీ
వెమ్మెయిఁ గోరకుండు పర మిట్టి దొడళ్ళఁ దపోగ్ని వేల్చి నే
మమ్ములఁ గోటి సల్పియును హాను లెదే కనఁజాలకుందురో
యమ్మహితాంఘ్రిరక్తి యది యడ్గితి ధన్యజనుండ వెంతయున్. 417

క. సచ్చరిత! భక్తిఁ గోరితి
మెచ్చితిఁ ద్వచ్చాతురికిని మేల్మేలు పరం

బిచ్చితిఁ గాను నాకృప నీ
యిచ్చును శుభగుణము లెల్ల నెపుడు వసించున్. 418

క. భక్తిజ్ఞానవిరాగా
సక్తులు నీ కొదవు మత్ప్రసాదమునఁ గథా
సక్తియు మదంఘ్రికమలా
సక్తియు సాధన మొకండు సలుపకె యొదవున్. 419

చ. సకలకథారహస్యముల సారమతిన్ దెలియంగఁ గందు ని
న్నిఁక నిటు మాయలున్ భ్రమము లెప్పుడుఁ గప్పక యుండు మత్కృపన్
త్రికరణశుద్ధి నెంచుము మదీయపదంబుల నన్ను బ్రహ్మరూ
పసు నజు నప్రమేయు శ్రితవత్సలుగాఁ గని వాయసోత్తమా! 420

క. శ్రుతివిశ్రుతమహా నాస
మ్మతము నెఱింగింతు వినుము మతి నితరములా
గతుల విడి నను భజింపుము
మతి నిడి నాపల్కు పల్కు మహితవిచారా! 421

సీ. నామాయఁ బుట్టిన నానాచరాచర
భూతకోటుల నొక్కపోల్కి చెలిమిఁ
గనుదు నందైనను మనుజు లతిప్రియుల్
వారలందునఁ బాఱువారు ప్రియులు
పాఱులందున వేదపారగు లాప్తులు
వారిలో శ్రుతిమతాచారు లాప్తు
లందు విరాగు లత్యాప్తులు వారిలో
జ్ఞాను లందునను సుజ్ఞాను లధికు
తే. లట్టి సుజ్ఞానులందు ననన్యశరణుఁ
డైన మద్భక్తుఁ డధికాప్తుఁ డరయ నాకు

ధర మదేకావలంబుఁడో దాసవరుని
కంటెఁ బ్రియుఁ డొండు లేఁడు నిక్కంబు చూవె. 422

ఆ. భక్తిహీనుఁడేనిఁ బ్రహ్మణ్యుఁడైన నా
కాతఁ డెల్లవారి యట్టివాఁడ
భక్తియుక్తుఁడేనిఁ బరమనీచుం డయ్యుఁ
బ్రాణసముఁడు నాకు వాఁడు తలఁప. 423

క. రుచియింపకుండు నెవనికి
శుచియు సుశీలుండు సుమతి సువ్రతుఁడో నా
యుచితజ్ఞుఁడైన దాసుఁడు
సుచరిత ! విను శ్రుతిపురాణసూక్తనయంబున్. 424

సీ. ఒక్కతండ్రికి నుండ్రు పెక్కండ్రు తనయులు
భిన్నస్వభావప్రవృత్తు లౌచు
ధనికుఁ డొం డగుఁ దపోధని వేఱొకం డగుఁ
బండితుం డగు నొండు పామరుఁ డగు
దాతయౌ నొక్కఁడు జ్ఞాతయౌను మఱొక్కఁ
డజ్ఞుఁడో నొకఁడు సర్వజ్ఞుఁ డౌను
వార లందఱియందు వాత్సల్య మొకరూప
యుండుఁ గాని పిత కెవండు మిగుల

తే. నెడనుడి నొడళ్లఁ బితృభక్తి నెనయు ధర్మ
వొండు లే దంచుఁ గలనే మఱొండు చింత
లుడిగి పితృసేవ సలుపు నాయుత్తముండె
యతిపితృ ప్రియపాత్రుఁడౌ నజ్ఞుఁడయ్యు. 425

ఉ. ఆవిధి నాసృజించిన యనంతచరాచరసృష్టి నెల్ల నే
నావిరి యొక్కరూప సమవత్సలతన్ గనుఁగొందుఁ గాని మా

యావరణంబుఁ బాసి నిరహంకృతియై యెపుడున్ ద్రిశుద్ధ మ
త్సేవ లొనర్చు వానిని విశేషకృపన్ గనుఁగొందు నాప్తుగన్. 426

క. స్త్రీపున్నపుంసకాంతర
మేపాటి గణింపకుండ నెవ్వరినేనిన్
గాపాడుదు నగతికులై
లోపలి కపటాదు లుడిగి లోనను గొలువన్. 427

చ. కొలువుము సర్వభావములఁ గూరిమి నాసలఁ బాసి సన్న తా
వలముగ నెంచి ని న్నెపుడుఁ బర్వకయుండును గాల మన్న నా
కెలమి నొడల్ గగుర్పొడిచె నింపగు నావిభువాణి విన్న నా
కలవియె! తత్సుఖానుభవ మాడ నెడంద యెఱుంగు దానినిన్. 428

క. ఛవినిధి సందర్శనసుఖ
మవలోకన మెఱుఁగు నెఱుఁగు నావిభువాక్య
శ్రవణసుఖానుభవంబును
శ్రవణము లెటు తెలుఁగ నేర్చు రసన వచింపన్. 429

మ. ఉపదేశించుచు బాలరాముఁ డటు లెన్నో రీతులన్ నాకు బో
ధపడన్, గ్రమ్మఱఁ బాకృతార్భకుని చందానన్ క్షుధార్తున్ బలెన్
సుపరిమ్లానముఖుండు సాశ్రుసలిలాక్షుం డౌచుఁ బోర్వెట్టఁగా
నుపలాలించుచుఁ దల్లి వచ్చి సుతుఁ బ్రేమోత్కంఠయై తీసెఁ
దాన్. 430

ఉ. ఏసుఖ మాసఁ జేసి పరమేశుఁ డుమేశుఁ డభద్రి వేషముల్
వాసి ధరించె రామపురవాసులు నేసుఖమందు మగ్నులై
రాసుఖ మించుకంత కలనైన నొకప్పుడుఁ గన్నవాఁ డెదన్
వీసము లెక్కసేయఁ డొకపెద్దగ బ్రహ్మసుఖానుభూతినేన్. 431

క. అటనుండి కొంతకాలం
బటు లవ్విభు బాలలీల లన్నియుఁ గనుచున్
గుటి కరుదెంచితి విభు న
క్కుటికను నే ముక్తివరముఁ గని మోదమునన్. 432

క. తనవానిగ విభుఁ డటు ననుఁ
గనుఁగొనినది మొదలు మాయ క్రమ్మదు మగుడన్
వినిచితి నిటు మాయాగతి
ననఘా! వినుమయ్య! నాదు ననుభవము లిఁకన్. 433

ఆ. వినుము వైనతేయ! విభునిప్రాభవ మది
కానరాదు తదనుకంప లేక
యతని ప్రాభవంబు నరసి కన్గొన కున్న
నాప్రతీతి కుదుర దతనియందు. 434

ఆ. ఆప్రతీతి యొదవ కబ్బదు సంప్రీతి
ప్రీతిలేక భక్తి దృఢము కాదు
జ్ఞాన మబ్బఁ బోదు సద్గురుకృపలేక
సమకొనును విరక్తి జ్ఞానముననె. 435

. హరిపదభక్తి లేక సుఖ మబ్బు నెటుల్? సహజప్రమోదముల్
దొరకొనకున్న నెట్లొదవు దుర్లభశాంతిసుఖంబు? నావ యే
వెరవున నీరు లేక చను? పీడను గామ మెటుల్? ముదం బెదన్
దొరకొనకున్నఁ? గామ మది త్రుంగనిదే సుఖ మబ్బునే? కలన్.

సీ. సంతోష మదిలేక శమియింప దాకాంక్ష
యాకాంక్ష యుడుగమి నరిది సుఖము
రామభక్తిని గాని కామంబు లుడుగవు
మొలక భూమిని గాని మొలవనిగతి

జ్ఞానంబుననె కాని సమత సిద్ధింప దా
కాశముననె యవకాశ మట్లు
శ్రద్ధ లేకున్నచో సద్ధర్మ మెఱుఁగరా
దవని విడిచి గంధ మందని యటు
తపమునం గాని తేజము తనరఁబోదు
జలము లేనట్టి రస మొందు గలుగనిగతి
శీల మబ్బదు సాధుసంసేవ లేక
తేజమునఁ గాని రూపంబు రాజిలనటు. 437

క. మదిఁ గుదురు కుదురుకొన దెపు
డెదను సుగం బొదవకున్న నెద విశ్వాసం
బొదవమిని సిద్ధి కలుగ ద
దొదవదు భక్తియును నమ్మకుండిన గురునిన్. 438

తే. కుదుర దెద భక్తి విశ్వాస మొదవకున్న
భక్తి యొదవమి రాముఁడు వశుఁడు కాఁడు
రామకృప లేక సుఖము దుర్లభము చుమ్ము
జీవులకు స్వప్నమం దేని క్షితితలమున. 439

చ. అని యిటు లాత్మ నెంచి విహగాధిప! తర్కవితర్కముల్ మదిన్
బొనరుపకుండఁ బూషకులభూషణునిన్ భజియింపు మిందు నే
వినిచిన రామవైభవము వింత యొకింతయుఁ గాదు కన్నులన్
గనినది కాని మించి పలుకం జుమి! వింత విశేష మింతయున్. 440

ఉ. రాముని నామరూపగుణరమ్యచరిత్రము లెం దనంతముల్
ధీమహితుల్ యథామతిఁ దదీయగుణంబులఁ బాడుచుంద్రు తా
వేమఱుఁ బాడిపాడి యల వేదములున్ దరిఁ గానకుండు నం
దామశకంబు మున్నుగ ఖగాధిప! నీవర కెల్ల పక్షులున్. 441

క. తమతమ యోపిన కొలఁదులఁ
దమకముతో నెగసి మింటి దరిఁ గానని య
ట్లమితమగు రామమహిమము
దమకు యథామతిని గనియు దరిఁగనరు బుధుల్. 442

సీ. రాముండు శతకోటి కామాధికాభుండు
శతకోటి సుత్రామసమవిభవుఁడు
దుర్దమరిపుకోటి దోర్దండమర్దనా
డంబరశతసమ వ్యాప్తుఁ డజుఁడు
శతకోటిపవమాన సమబలుం డనఘుండు
శీతాంశుశతకోటి శీతలుండు
శతసహస్రాంసు తేజఃప్రచండుండు భ
వాపహుండు త్రివిధతాపహరుఁడు
తే. దుర్గముఁడుఁ గాలశతసమదుస్సహుండు
దుర్ధరుఁడు దురాధర్షుఁడు ధుర్వహుండుఁ
గాలకోటిసమానకరాళరూపుఁ
డయుత శతకోటితీర్థసమానఘుండు. 443

సీ. అంభోధిశతకోటిగంభీరుఁ డవ్విభుఁ
డచలేంద్రకోటి సమాచలుండు
నమితపాతాళ సమాగాధమహిముండు
శతకోటిసురధేను సమవరదుఁడు
నీరజాసనసమ నిర్మాణ నిపుణుండు
శారదాసమ వాగ్విశారదుండు
శతకోటిహరిసమ జగదవనధురీణుఁ
డయుతోగ్రకల్ప కల్పాంతకరుఁడు

తే. ధనదశతకోటిసమమహాధనికుఁ డతఁడు
శేషఫణిధరశతసమ క్షితిధరుండు
నయుతమాయాసమాన మాయావి యాతఁ
డనుపముఁడు నిరవధికుండు నను శ్రుతులు. 444

తే. రామునకు రాముఁడే సాటి రాముఁ బోల్ప
నొకఁడు లేఁడని శ్రుతు లెపు డుగ్గడించు
వే మిణుంగురులం బోల్ప వెలుఁగుతేని
కెల్లిదం బైన యట్లవు నీయుపమలు. 445

క. నిరవధికుఁడు నిరుపముఁ డగు
హరి కుపమల నెన్నొ కూర్చి యగ్గింత్రు మునీ
శ్వరులు యథామతి గృప నా
హరి భావగ్రహణుఁ డౌట నన్నియుఁ గొనుఁ దాన్. 446

క. ఆరాఘవగుణపారా
వార మగాధంబు దానఁ బారముఁ గాంచన్
వేరి కగు సాధువులచేఁ
బేరిమి నే వివిన విధమె వినిపించి తిటుల్. 447

క. కరుణావరుణాలయు సుఖ
శరణు హరిన్ భావవశుని తన్మాజారమణున్
బెరిమ మదమానమోహా
వరణంబులఁ బాసి కొలువు వాఙ్మతిశుద్ధిన్. 448

ఉ. నావుఁడు నాభుశుండివచనంబుల కాగరుడుండు సమ్మదం
బావహిలన్ రఘుప్రభు మహామహిమంబుఁ దలంచి హర్ష బా
ష్పావృతలోచనుం డయి యనాదివిభున్ నరుఁ డంచు మున్ను దా
భావనఁ జేసి నందులకుఁ బల్మరు లో దురపిల్లెఁ బిమ్మటన్. 449

క. కరటవరేణ్యున కెరఁగెను
మఱిమఱిఁ దలవంచి విభుసమానుగఁ గనుచున్
సరసిజభవ భవనములేన్
దరియింతురె గురుపు లేక తతభవవార్ధిన్. 450

ఉ. సంశయసర్ప మొండు ననుఁ జయ్యనఁ బట్టిన మన్ప భానుమ
ద్వంశుఁడు నన్ను నీకడకుఁ బంచెను గారుడమంత్రవేత్త వం
చంశుమదన్వవాయు విషయంబున లోఁగల మోహముల్ భ్రమల్
సంశయముల్ దొలంగ మునిచంద్ర! భవత్కృప నంచు వేఁడుచున్.451

ఉ. క్రమ్మఱఁ దార్క్ష్యుఁ డిట్లనియెఁ గ్రమవినమ్రమమృదూక్తియుక్తి లో
ముమ్మడి మీఱు ప్రేముడిఁ బ్రభూ! విను మజ్ఞత నడ్గుచుంటి నే
నిమ్మెయి సత్కృపన్ బలుకవే! నిజదాసు ననుగ్రహించి నన్
బమ్మినవేడ్క నీవు రఘువర్యుని ప్రాణసమానుఁ డౌదు చూ! 452

క. సుమతివి సకలజ్ఞుఁడవును
దమశమపరుఁడవు సువివేకధాముఁడవును రా
మమహీశు దాసవర్యుఁడ
వమలుఁడ వెట్లొదవె వాయసాకృతి నీకున్? 453

సీ. ఈకాకిరూపు నీ కేకతంబునఁ గల్గె?
నీకత విఁటి పీ వేకతమునఁ?
గల్పాంతమున నేని గాలంబు నిన్ డాయ
దనియె శంకరుఁ డయ్య దన్నుత మగునె?
కాలకబళ మౌను గాఁ జరాచరసృష్టి
యీరేడు లోకాలు నెల్లగతుల
బలిగాక బ్రహ్మాండభక్షకంబౌ కాల
మునకును డాఁగువాఁడును గలాఁడె!

తే. యట్టి దుస్తరకాలమే యంట దంట !
యోగబలమొ ! జ్ఞానమహిమమో ! కతం బ
దేమొ ! యోజింపు నీకుటి నేను డాయ
సంతసే ఛాసె నామోహ మయ్య దేమొ ! 454

కాకభుశుండి తనకుఁ గాకిరూపు వచ్చిన పూర్వవృత్తాంతముఁ దెల్పుట

చ. కృప నెఱిఁగింపు మన్న ఖగకేసరి పల్కుల నాభుశుండి మె
చ్చి పలికె నిట్లు లీవు ననుఁ జేసినప్రశ్నము పక్షినర్య ! న
న్నివు డెద విస్మృతార్థముల నెన్నిఁటినో తలఁపించెఁ జిత్తమం
దపరభవంబులన్ సలిపి నట్టివి నీపలు కొప్పె నెంతయున్. 455

క. మచ్చరితము వినిపించెద
సచ్చరిత ! వినంగ దయ్య ! జపతపముల కే
యచ్చునను రామభక్తియ
మెచ్చగు ఫల మదియ లేని మేలును మేలే. 456

ఉ. చేకుఱెఁ గాకిరూపునను శ్రీరఘుదేవుని భక్తి కాన నా
కీకరటాంగమే కడు నభీష్టము దేనను స్వార్థసిద్ధి తాఁ
జేకుఱు దానినే జనులు చెల్మి రయొనస్తు కదే పూత్రైమిగాఁ
జేకొని నీచునేన్ జెలిమిఁ జేయు మ టంచనుఁగాదె వేదముల్. 457

తే. వట్టుఁ బుట్టించు ననికాదె పట్టుపురుషుఁ
బట్టి పెంతు ర దెట్టి యేవంబు గాని
స్వార్థ మాసించి జను లెట్టి యధముసైన
గారవింతురు మదిఁ గోరి కార్యసిద్ధి. 458

చ. త్రికరణశుద్ధి రామజగతీపతియంఘ్రులఁ బ్రీతిఁ గాంచుటే
సుకృతఫలంబు స్వార్థమును క్షోణిని రాఘవభక్తియుక్తుఁడే

సుకృతి యతం డతండె పరిశుద్ధుఁడు రాఘవభక్తిసిద్ధి సా
ధక మగు నేభవం బదియు ధన్యము హీనభవం బ దెట్టిదేన్. 459

తే. బ్రహ్మసమమూర్తి యైనను రామవిముఖుఁ
డైనఁ గవికోవిదాళి కొండాడ దతని
భక్తి సిద్ధించె నిమ్మెనఁ బ్రభునియందుఁ
గాన నా కెంతో మమత యిక్కాకిమేన. 460

క. తనువు హరిభజనసాధన
మనియెడు ప్రాఁబల్కుపల్కు నరసి త్యజింపన్
దను విచ్ఛామరణుఁడ నై
నను, విను మును మోహ మెంతొ న న్నలయింపన్. 461

క. నానాయోనులఁ బుట్టితి
నానాజప యోగ యాగ నయమార్గములన్
నానాగతులఁ జరించితి
నేను జనింపనిది లేద యేయోనియునున్. 462

ఉ. పూనికిఁ బెక్కుయోనులను బుట్టి యొనర్చితిఁ బెక్కుకర్మముల్
గాని సుఖింప నీకరటగాత్రమునన్ వలె నొండొకప్పు డీ
శానవరాప్తి నాకు బహుజన్మకథాస్మృతి కల్గె నంట ద
జ్ఞానము నన్ను మత్ప్రథమజన్మకథన్ వినిపింతు వి న్మిఁకన్ 463

క. నాతొలిపుట్టువుకత విన
వే తొలఁగున్ బాము లెల్ల విభుచరణాబ్జ
ప్రీతియు సమకొను విను విన
తాతనయ! వచింతు మత్ప్రథమజన్మకథన్. 464

తే. పూర్వకల్పంబునం దఘమూలమైన
కలియుగ మొకప్పు డొదవె నాకలి నధర్మ

పసులునున్ శ్రుతిప్రతికూలవర్తను లయి
రందు నరనారు లందఱు నఘమయు లయి. 465

ఉ. అక్కలివేళ శూద్రకులమందు జనించితి నాయయోధ్యలో
నొక్కపు డేఁ ద్రిశుద్ధిఁగల యుగ్రవిలోచన కింకరుండనై
తక్కిన వేల్పు లెల్లరను దద్దయుఁ దిట్టుచు శ్రీమదాంధతన్
మిక్కిలి గర్హ్యవాది నయి మేదుర దంభమలీనబుద్ధినై. 466

ఉ. అందు వసించుచున్నఁ దెలియన్ జుమి! రామపురీప్రభావ మే
నం దొకయింత నేఁ డెఱిఁగినట్లు ధనుర్ధరుఁ జూచు రాఘవుం
డెందు నెడంద నిల్చినపుడే తెలియందగుఁ దత్ప్రభావ మా
చందముఁ గన్ననాఁడె రఘుచంద్రపరాయణచిత్తుఁ జూటయున్. 467

## కలికాలవర్ణనము.

సీ. కఠినమై వచ్చె నాకలికాల మంచున
నరనారు లెల్లరు దురితరతులు
కలికల్మషంబులు కబళించె ధర్మమున్
సద్గ్రంథము ల వెల్ల సడలి యడఁగె
డాంబికుల్ పెక్కు మతంబులఁ గల్పించి
బయలుతీసిరి బహుపద్ధతులను
మోహవివశు లైరి ముజ్జగమ్ముల జనుల్
కబళించె లోభంబు కర్మవితతి

తే. వినుము కలిలక్షణంబుల విహగనాథ!
యేర్పడ వచింతు నరనారు లెల్ల రిందు
శ్రుతివిపక్షవిరోధు లై యుండఁ జొప్పడ దెటు
జగతి వర్ణాశ్రమాచార సద్వ్యవస్థ. 468

క. నిగమానుశాసనంబుఁ బ
రిగణింప కెవారు సంచరించిరి స్వేచ్ఛన్
జగతీశులు జనవంచకు
లగుచును శ్రుతివంచనాళి లగుచును విప్రుల్. 469

సీ. అతిదంభవేషి దంభాచారయుక్తుఁడే
కలి సదాచారుండు ఖగకులేంద్ర!
చ్యుతసదాచారుఁడున్ శ్రుతిపథత్యాగియె
కలికల్మషవిరాగి గరుడవర్య!
నఖశిఖాదులఁ బెంచి నలువొప్ప నటియించు
తెక్కలిజోగియె నిక్కపుముని
పరధనాపహరణప్రాజ్ఞుండె ప్రాజ్ఞుండు
పరిహాసకుశలుఁడె పరమకుశలుఁ
తే. డొరుల నగ్గాడువాఁడె మాన్యుండు కలిని
వాఙ్మనశ్శుద్ధి బొంకాడువాఁడె నాటి
వాగ్మి, వదర నేర్చినవాఁడె పండితుండు
కల్ల లల్లంగలాఁడె సూ! ఘనచతురుఁడు. 470

తే. హేయమహా వేషభూషల నెన్నొ తాల్చి
పొట్ట నింపుచు భోజ్య మభోజ్య మనక
యన్నిఁటన్ దిర్గు కలికృత్రిమాకృతు లటఁ
బూజ్యులైరి చూ! పరయోగిపుంగవు లటు. 471

తే. ఆటకానికి నాడు శాఖాట మట్టు
ఆలిచేఁ గీలుబొమ్మయి యాడ మగఁడు
శ్రుతిపథామరసాధువిరోధు లగుచుఁ
గామకింకరులైరి చూ! తొమ్మెజనములు. 472

ఉ. జందెము లూని యన్యులు ద్విజాతి కొనంగిరి మంత్రదీక్షలం
బొందఁగ రాని దానములఁ బొందుచుఁ బీఠములన్ బురాణముల్
పొందికఁ జెప్పుచున్ జపతపోవ్రతనిష్ఠల నాచరించి రం
దెందఱొ నూత్నధర్మముల నెంచి రచించిరిలన్ మహామతుల్. 473

తే. గురుజనులు శిష్యవిత్తాపహరులు గాని
శిష్యహృత్తాపహరు లెందు జిక్క రైరి
గురుఁడు శిష్యగుణాగుణ మరయ గ్రుడ్డి
శిష్యుఁడు గురూక్తి వినకున్కిఁ జెవిటిఁ బోలె. 474

సీ. చీకుచెవిటివారి చెల్మి యట్లై కలిన్
గురుశిష్యబాంధవం బరయవచ్చెఁ
బొట్టపోసి కొనెడు నట్టి ధర్మంబునె
కఱపిరి సుతులకుఁ గన్నవార
లక్కలి నరనారు లాడఁబో రొకరు బ్ర
హ్మజ్ఞానమునె కాని మాఱుపలుకుఁ
గాసున కాసించి కావించి రాగడాల్
గురుభూసురాఘాతకు లయి జనులు

తే. బ్రహ్మవిదుఁ డైనవాఁడె పో! బ్రాహ్మణుండు
మేము మీకంటె నల్లఁతుల మే మ టంచు
నన్యకులు లగ్రకులుల నెగ్గాడువార
లైరి బ్రాహ్మణ్య మత్సరాస్యంబు గామి. 475

క. పరవనితాలంపటులును
పరమోహద్రోహకపటభావులు నైరి
దర జ్ఞానులు నద్వైతులు
హరితురగమ! వింటె! కలిమహామహిమంబున్. 476

క. తము చెడి శ్రుతిపథనిరతులఁ
దమువోలెను జెఱిపి శ్రుతి వితర్కించుచు దో
షము లెంచు శ్రుతివిరోధులు
యమయాతన యుగయుగాల నందిరి కలిలో. 477

మ. సిరిఁ గోల్పోయిరొ యాలిఁ గోలుపడిరో జీవింప నేసాధనం
బరయన్నేరకొ హీనజాతు లల సన్యాసాకృతిన్ దాల్చి జే
గురుచీరల్ తలబోడి చేసికొని టక్కుల్ జూపి విప్రాళిచేఁ
గరమున్ బూజలఁ గొంచుఁ దా ముభయలోకభ్రష్టులై రక్కలిన్.

క. పాఱులు నిరక్షరాస్యులు
వేఱిడులును గాముకులును వృషలీపతు లా
చారవిదూరులు గాఁగా
నారసి కల్పించి రెల్ల రాచారంబుల్. 479

చ. పలువురు వర్ణసంకరులు పాపమయుల్ ప్రభవించి యక్కలిన్
బలుదురితంబులన్ సలిపి బాములఁ గుడ్చిరి తత్ఫలంబుగా
ములుగుచు రోగశోకములమూలముగన్ శ్రుతిసమ్మతమ్ము ని
ర్మలము వివేకయుక్త మగు రాఘవభక్తిపథంబు నొల్లకే. 480

క. కల్పించిరి బహుపద్ధతు
లల్పులు మోహాంధు లగుచు హరిభక్తిపథం
బల్పముగ నెంచి యుండ్రా
కల్పాంతము ఘోరనారకంబుల వారల్. 481

తే. విషయహతవిరక్తు లగుచు విభవ మొంది
యక్కలిన్ జోగు లిండ్లను జక్కబెట్ట
ధనపరాయణులై తపోధనులు నెగడ
లేమి వసివాఁడి రల గేస్తు లేమి లేమి. 482

శా. ఇల్లాలిన్ సతి సత్కులీనఁ గృపలే కిల్లున్ వెడల్గొట్టి వే
యుల్లిన్ జేర్చినఁ దెంపులన్ జెనఁటులన్ హేయాంగులన్ బూరుషుం
డిల్లాలున్ నిజవల్లభున్ గుణనిధిన్ హృద్వీథి మన్నింపకే
యుల్లంబందునఁ గోరు కాముకులతో నోలాడెఁ జుమ్మా కలిన్. 483

చ. సుతుఁడు సతీముఖాంబుజముఁ జూచెడు దన్కనె తల్లిదండ్రులన్
హితమతి నాదరించుట సుమీ! శ్వశురాలయ మింపుజూపు నా
సుత రిపురూపు లట్ల కనుఁజూ! స్వకుటుంబజనంబు నెల్ల నే
గతిఁ గలి దంభమోహమదకామమహాధిపరీత మాటచే. 484

క. పాపపరాయణు లౌచును
భూపులు నిజధర్మ మేది భూజనుల సతం
బేపణఁచు చేపరించిరి
రేపుచు దర్పాంధులై చరించుచుఁ గలిలో. 485

క. కేచమాత్రాభూషణలు వి
కచనయనలు మేను నగలఁ గై సేయరు తా
రుచిరాంగి సుమంగళు లిలఁ
గచభూషాప్రియులు జుమ్మి! కలి విశ్వసల్, 486

సీ. తామసులై జనుల్ దానధర్మవ్రత
జపతపోయాగముల్ సలుపుచుండ
సదనులఁ గురియింప రైరి వర్షముల ని
లింపు లోషధులు ఫలింప వయ్యె
బాటిల్లె మాటికిఁ గాటకంబులు కలి
నన్న మబ్బక చచ్చి రవనిజనులు
నిప్పచ్చరంబున నెవ్వఁ గుందిరి మహీ
జనులు పెక్కురు హెచ్చెఁ జాల మమత

తే॥ హీనకులుఁ డయ్యు ధనియె కులీనుఁ డయ్యె
క్షితిని జందెమె ద్విజకులచిహ్నమయ్యె
ఇల దిగంబరుఁ డౌటె యోగీశచిహ్న
మయ్యెఁ గలియుగవేళ నోహరితురంగ ! 487

ఉ. వేదపురాణసమ్మతము వేఱేఁడిదైయె తెగనాడువాఁడె పో
సాదువుదై వభక్తుఁడును శాస్త్రసలిలో గుణదూషకుండు దు
ర్వాది గుణానభిజ్ఞుఁ డగువాఁడె కవీంద్రుఁడు గాని కానఁగా
రాదు చుమీ ! యుదారకవిరాజిరవం బది యెందు నక్కలిన్. 488

చ. తలఁచిరి సౌఖ్యముల్ వడయ ధర్మవిరోధులు నీచు భూజనుల్
తెలివి యలంతి యాఁకలియుఁ దీవ్ర మెదన్ మమకార మెచ్చు లో
నలమె దురాగ్రహంబు దురహంకృతియున్ గతమేమి లేకె లో
కుల కిల రోగపీడ లొడఁగూడెఁ గడున్ గనరావు భోగముల్. 489

క. అల్పాయు వైదుపదియేం
డ్లల్పంబుగ నైన జనుల కవివేకమునం
గల్పాంతమునను జెడని వి
కల్పంబును బ్రతుకుతీపుఁ గడుఁ బొడవయ్యెన్. 490

సీ॥ తనుజానుజావివేచన మెదఁ గోల్పుచ్చి
కలి మనుజులను విహ్వాలులఁ జేయ
శాంతిసుఖము లేదు సంతోష మది లేదు
హీనుల యాచింప నెగ్గులేదు
వర్ణాశ్రమాచారపద్ధతి లేదయ్యె
ధరజనుల్ విరహావిత్రస్తులైరి
సందడించెను నిండి ఛద్మమాత్సర్యముల్
పారుష్య మిల నలుపార్శ్వములను

తే. దానదాక్షిణ్యదమదయల్ గానరావు
వంచనముఁ గించుతనముఁ గన్పించె నెందు
నఖిలజనములు కుటుంభరాత్ము లైరి
బరుల దూఱెడువా రైరి ధరణిజనులు. 491

తే. అవగుణాగార మఘమయ మైనఁ గాని
ఘోరకలికాలమందు మేల్గుణ మదొక్కఁ
డలరు విన వయ్య! యిం దబ్బు సులభగతిని
నన్యయుగముల దుస్సాధ్య మైన ముక్తి. 492

సీ. వరయోగిజనులు శ్రీహరిని ధ్యానము జేసి
గతిఁగాంత్రు భవమున కృతయుగమున
భగవదర్పణబుద్ధిఁ బలుజన్నము లొనర్చి
దేహి దాఁటు భవాబ్ధిఁ ద్రేతయందు
ననితరగతు లొచు హరి నమ్మి పూజించి
దాఁటుదురు భవాబ్ధి ద్వాపరమునఁ
గృతముఖ్యయుగములఁ దతభక్తియోగయా
గాదులచేఁ గాని యంద రాని

తే. భవవిముక్తిని గలివేళఁ బడయు నరుఁడు
కేవలంబును హరినామకీర్తనమున
నరయ హరినామగుణగణస్మరణఫల మ
నంతమూఁ జుమ్మి కలిని శకుంతవర్య! 493

మ. కలివేళన్ వరయోగయాగములు సాగన్నేర వట్లౌట ని
క్కలి రామప్రభునామకీర్తన మదొక్కండౌ భవాంభోధి క
వ్వలిఁ జేరంగ ననన్యసాధన మదెవ్వండే ననన్యాశ్రయుం
డెలమిన్ దద్గుణజాల మెంచిన భవం బీఁదున్ సునాయాసతన్. 494

ఉ. సలుపఁ దలంచినంతటన సల్పెద నన్న ఫలించుఁ బుణ్యముల్
సలిపినఁ గాని చింతనములన్ ఫలియింపవు దుష్కృతంబుః ల
క్కలి మహితప్రభావ మది కంటె! కలిన్ హరినామకీర్తనం
బలఘుతరావలంబము చుమా! భవవారిధి నిస్తరింపఁగన్. 495

క. కలియుగముఁ బోలు యుగ మది
తలఁప మఱొం డెదియులేదు తతభవజలధిన్
సులభగతి నిందు దాఁటుదు
రిలాజనులు రామనామ మెంచుచు నెదలన్. 496

తే. తపము జ్ఞానము యజ్ఞము దానము నివి
ధర్మమున కొప్పు నాల్గుపాదంబు లౌచు
దాన మందునఁ గలిని బ్రధాన మౌట
దాన మిడఁదగుఁ గలిగిన దానిలోన. 497

## ♦ యుగధర్మములు ♦

క. యుగధర్మంబు ల వన్నియు
యుగయుగముల నెల్లవారి యుల్లంబులలో
నెగడు హరిమాయ ప్రేచఁగఁ
యుగధర్మము లింక వినఁగ దోయి ఖగేంద్రా! 498

సీ. శుద్ధసత్త్వగుణము సుప్రసన్నత సమ
తవివేకమును గృతధర్మము లిల
నధికసాత్త్వికము నత్యల్పరాజసమును
గర్మాభిరతి త్రేతధర్మ మరయ
నల్పసత్త్వతమస్సు లధికరజస్సును
హర్షభయోద్వేగ మరయ ద్వాప

రయుగధర్మం బౌను రాజసం బత్యల్ప
మధికమహా తామస మతివిరోధ
తే. మౌను గలియుగధర్మంబు లౌను బుధజ
నంబు లాయాయుగస్వభావంబు లెఱిఁగి
ధర్మము లొనర్తు) వీడి యధర్మరతిని
హరిపదాశ్రితు యుగధర్మ మంటఁ బోదు. 499
క. నటకపటవికటచర్యకు
నటభటుఁడు భ్రమింప నటులు నళినాక్షు సము
త్కటభక్తిఁ గొల్చు జనములు
దటవటగా రెవరుఁ గాలధర్మంబులకున్. 500
క. హరిమాయాగుణదోషము
లరిమురి హరిసేవఁ గాని హరియింపవ టం
చరసి మదిఁ బాసి యాసల
హరి నమ్మి భజింప నగును హరితురగవరా! 501

కాకభుశుండి తొల్లి తాను గురుధిక్కార మొనర్చి శివశాపమును బడసిన విధము జెప్పుట.

తే. అట్టి దుస్తరకలివేళ నాయయోధ్య
లోన బెక్కేఁడు లుండి యాపై నొకస్రు
గాఢదుర్భిక్ష మొదఁగూడ క్షామపీడ
నోర్వఁజాలక చనినాఁడ నుజ్జయినికి. 502
క. పటుదీనవృత్తి నటమటఁ
గటకట పడుచుండి కొంతకాలంబున కా
పుటభేదనమున సిరి మి
క్కుటముగ లభియింప శంభుఁ గొలువఁ దొడఁగితిన్. 503

ఉ. ఆపురిఁ బాఱుఁ డొండు పరమార్థవిదుండు సదాశివాంఘ్రిపూ
జాపరతంత్రుఁ డయ్యు హరిపాదపరాఙ్ముఖవృత్తి లేనివాఁ
డాపరమేశుపూజ విడి యన్య మెఱుంగనివాఁడు నీతిని
ష్ఠాపరుఁ డుండె నే నతని ఛద్మమతిం గొలువం గడంగితిన్. 504

ఆ. ఆకరుణాకరుం డగు ద్విజాగ్రణి నాదు బహిర్వినమ్రతన్
గైకొని పుత్రు నట్లు కడు గారమునన్ జదివించి పెక్కిఁటిన్
నా కుపదేశమున్ సలిపె నర్మిలి శాంభవమంత్రరాజమున్
నాకపటప్రవృత్తిని మనోగతిఁ గానకె నిర్వ్యశంకినై. 505

క. పంచాక్షరిమంత్రము నటు
లంచితగతి దీక్ష నొసఁగి యర్మిలి నుపదే
శించిన వివిధహితోక్తుల
వంచన నాశివునిగుడి జపం బొనరిచితిన్. 506

క. ఖలుఁడను మలసంకులమతి
నలఁతి నహంకృతియుతుండ నధముకులుండన్
జలపాది నౌదు ద్విజు లన
నలుగుదు హరి యనిన భక్తు లనినం గానీ. 507

శా. ఆనాయాచరణంబుఁ గన్గొని గురుం డత్యంతముం గుంది యెం
తే నెయ్యంబునఁ జేరఁ బిల్చి ననుఁ దా నిట్లాడె నోవత్స! మ
ర్గానాథున్ భజియింపనౌ ఫలమొకో! రామాంఘ్రి సద్భక్తి య
వ్వానిం గోత్రజశంకరాదులె యొరుల్ వందింత్రనన్ వింతయే. 508

మ. భవనీరేజభవార్చితుం డగు రఘుస్వామిన్ విరోధించుచున్
శివ మాసించెడువా రభాగ్యులు కదే చింతింపఁగా నన్న రా
ఘవపాదార్చకుఁ డంచు శంకరునిఁ బల్కన్ గిన్క వాటించి తా
యవనీదేవుని మాట నక్షరయుతుండౌ కొండికం గావుటన్. 509

క. పామరుఁడ హీనకులజుఁడఁ
బాములకున్ బాలు వోయు భంగిఁ దనరె నా
కామెయి విద్యాపాటవ
మేమన గురు వనిన ద్వేష మేర్పడె బుద్ధిన్. 510

క. ఏవగలు లేక రేవగ
లావగఁ జలపట్టి గురుని నరయఁగ నాభూ
దేవశిఖామణి నాయెడ
నేవిద్వేషమును లేక హితవులు గఱపెన్. 511

క. ఘనపదవిఁ గాంచి యల్పులు
ఘనతకుఁ గారకులు నైన ఘనుల నణంత్రా
ఘనపదవిఁ గాంచి ధూమం
బనలంబునఁ బుట్టి యనల మార్పెడు నట్టుల్. 512

చ. అనిశపదప్రహారముల నధ్వములన్ బరిభావ మొంది నే
లను బడియుండు ధూళి యనిలంబున బట్టు చలించి తొల్త న
య్యనిలమునందె క్రమ్ముకొని యావయి రాజకిరీటకోటినెక్కె
గనులనె కప్పఁ బ్రాజ్ఞు లిది కాంచియకా! ఖలమైత్రి వీడుటల్॥ 513

చ. పలువలతోడి చెల్మియును వైరము రెండును మేలు గావు వా
రలఁ గడు దవ్వుదవ్వులఁ దొఱంగఁగనౌ శునిజాతి నట్లయం
చల కవికోవిదాళి యనయంబు నయంబు నుపన్యసించు వా
రల తగులాట మింతయుఁ గరంబు భరంబు చు మయ్యా! కాశ్యపీ!

క. కపటమతి నాకు గురువరు
నుపదేశము నచ్చకుండె నుండఁగ నట్లో
క్కపుడు శివమంత్ర మే గుడి
జపియించుచునుండ గురుఁడు చనుదెంచుటయున్. 515

మ. కడు మదమెత్తి నేను గురుఁ గాంచియు లేచుట మాని చేతులేన్
ముడువఁగ నైతి నన్నటు కనుంగొని నాయవిధేయతం దలం
పిడక గురుం డెదం గినిసి యేమనఁ డయ్యెను గాని నెమ్మదిన్
మృడుఁడు సహింపఁ డయ్యె నటు లే నొనరించిన గుర్వవజ్ఞకున్. 516

ఉ. కోవెలలోన జైలిపలుకుల్ వినవచ్చె నమానుషంబులై
యీవిధి నంత నోరి చెనఁటీ! గురు వెంత కృపాళు వైన బో
ధావధి యైన శాంతమతి యైన ననీతిఁ జరించి తీవు ని
న్నేవిధ సైఁపనోప నయహీనుని శాపవిదగ్ధుఁ జేయకే. 517

క. దుష్టుని నిను దండింపమి
భ్రష్టం బవు నాదు నీతిపథ మిది యెవఁడేన్
దుష్టుఁడు గురుఁ జలపట్టిన
భ్రష్టుం డగుఁ గల్పకోటి రౌరవగతులన్. 518

చ. అటు శతకల్పముల్ నిరయయాతనలన్ గడుఁ గ్రాఁగి క్రాఁగి యం
తటఁ బశుపక్షిదేహములు దాల్చుచు రాల్చుచు బెక్కుమాఱ్లు వాఁ
డటమట లాడు నోరి! కలుషాత్మ! గురుం డవు దేరఁ గొండపా
మటు పడియుంటి లేవ కటులే పడియుండుము కొండచిల్వవై. 519

క. తొఱ్ఱను బడియుండుమురా!
యఱ్ఱాకలి వేఁగుచుండి యధమగతి నరే
కుఱ్ఱ! నీగుర్వవజ్ఞకుఁ
దఱ్ఱతనంబునకు నిదియె తగుఫల మగురా! 520

క. అని యిటు శివశాపోక్తు ల
టనంతమున వినిన యంత హాహాకారం
బొనరించి గురుఁడు జాలిన్
గని నను భయకంపితాంగుఁ గనికర మొదవన్. 521

క. అటు నాదుర్గతిఁ గనుఁగొని
కటకటపడి కరుణపేర్మి భూసురవరుఁ డా
నిటలాక్షు మ్రోల నంజలి
ఘటియించి నుతించె గళము గద్గదికపడన్. 522

దండకము:- శ్రీశాంబుజాతాస నాద్యర్చితాంచ త్పదాంభోజు, నంభోజ మిత్రాబ్జ నేత్రున్, పవిత్రున్ భవున్ భర్గునిన్, నిర్గుణున్, నిర్వి కారున్, నిరీహున్, నిరీశున్, నిరాకారు, నోంకారరూపున్, మహాకాలకాలున్, కరాళున్, కృపాలున్, కపాలిన్, త్రిశూ లిన్, చిదానందసందోహు, వందారు బృందారకా బృంద మందారుఁ, గందర్పకోటిప్రకాశున్, పినాకేశు, నాకేశు, నాకా శకేశున్, లసత్కాశసంకాశగౌరాంగు, భస్మాంగరాగున్, విరా గిన్, హరున్, భావజారిన్, గజారిన్, భుజంగేంద్రధారిన్, లస ద్బాలబాలేందుధారిన్, సురాహార్యధీరున్, హిమాహార్యగౌరున్ జటాధారి, నీశున్, మహేశున్, గిరీశున్, పరేశున్, సురంగేశు, గంగాజటాజూటుఁ, బశ్వల్లలాటున్, గళేకాలకూటున్, స్మశా నాటు, నష్టిభవద్వ్యాగవాటున్, నమత్సంశ్రితత్రాతుఁ, క్రీడాకి రాతున్, మురారాతి రాతిన్, పురారాతి, నిర్ధారితారాతిషడ్వర్గు, దుర్గేశు, దుర్గాపవర్గప్రదున్, శంభు, దిగ్వాసుఁ, గైలాసవాసున్, లసత్కృత్తివాసున్, శివున్, విశ్వసృట్సారథిన్, భూరథున్, వారిధీశేషుధిన్, ద్ర్యక్షు, నుగ్రాక్షుఁ, నుక్షధ్వజున్, భిక్షు, రక్షో వినాశంకరున్, సృష్టిరక్షావినాశంకరున్, శంకరున్, శాంకరీసం యుతున్, కింకరీభూతభూతాయుతున్, శర్వు, సర్వేశు, సర్వజ్ఞు సర్వాత్ము, నిర్వాణరూపున్ నినుం గొల్తు నోదేవ! దేవాది దేవా! మహాదేవ! కైవల్యకల్యాణకారీ! విభూ! నీదు పాదా రవిందంబులన్ గొల్వ కున్నంత పర్యంత మాత్మన్ సరుం డిందు

నం దెఁదునన్ శాంతిసౌఖ్యంబు లొందండు తాపత్రయవ్యాధి
ముక్తుండు గాఁ డో ప్రభూ! నీప్రభావం బశేషంబుగా శేష
భాషాశ్రుతుల్ గూడి భాషింప లే రన్న నే నెట్లు నేర్తున్ జడుం
డన్ ఖలుఁడన్ భవోన్మత్తచిత్తుండ నేనే మెఱుంగన్ జపంబున్
దపంబున్ మహాయోగమున్ యాగముం ద్యాగమున్ బుట్టుచా
వన్న రోగంబులన్ రేవగల్ వేఁగుచుంటిన్ విభూ! కావు మాప
న్నుఁడన్ బన్నగాభూష! యాపన్నలోకావనా! పావనా!
యాశుతోషా! ప్రభూ! శేషభూషా! శివా! శంకరా! పార్వతీశా
నమస్తే! నమస్తే! నమః. 523

క. పంకరుహగర్భకులమణి
శంకర సంతుష్టికొఱకు సలిపిన స్తవ మీ
శాంకరదండక మిది
యకలంకమతిన్ జదివినన్ దలంపులు నిండున్. 524

ఆ. విప్రవరుని వినుతి విని సుప్రసన్నుఁడై
యాశుతోషుఁ డీశుఁ డలరె నంత
"విప్రవర! వరమ్ము వేఁడుకొ" మ్మంచును
మాట వినఁగ వచ్చె మగుడ గుడిని. 525

ఉ. ఆపయి వేఁడె నీవిధి ధరామరుఁ డీశ! ప్రసన్నుఁ డైతివేన్
నాపయి, నీపదంబుల ననారతభక్తి నొసంగు దేవ! మా
యాపరతంత్రుఁ డౌచు ననయంబు విశృంఖలవృత్తిఁ దిర్గు నీ
పాపమయుండు జీవుఁడు కృపన్ గను కింక యొనర్ప కీజడున్. 526

క. ఈపాపనిపైఁ గోపము
శాపము నెడఁబాపు మయ్య! శంకర! కరుణా
కూపార! దీనరక్షా
వ్యాపార! శ్రితానుకంప యది యేపారన్. 527

క. ఈపాపఁడు మాపాపఁడు
కాపాడుము వీని నచిరకాలంబుననే
శాపోపశమన మొనరిచి
శాపానుగ్రహసమర్థ! శంకర! దేవా! 528

చ. పరమశుభంబులన్ బడయఁ బాపని వీని ననుగ్రహింపునాఁ
బరహితవృత్తియౌ ద్విజుని పల్కుఁ "దథా" గని మెచ్చి వెండియున్
హరుఁ డట దివ్యవాణి నిటులాడె "నితం డొనరించు నీవురా
చరణము సైఁపరా దయిన సైఁప క దేను శపించితి బె రుషన్. 529

శా. నీసౌశీల్యము నీదుసౌమ్యతయు నీనీతివ్యవాత్సల్య మె
వ్వాసిన్ లోఁ దలపోసి వీని ననుకంపన్ గాచితిన్ భూసురేం
ద్రా! సాధుల్ పరమోపకారులు ద్విజుల్ ప్రాణప్రియుల్ జుమ్మి! నా
కాసీతేశు న రైన వీని కనుభాష్యం బొను నాశాపమున్. 530

మ. విను మోకుజ్ఞ! జనుస్సహస్రమున నిన్ బ్రాపించు నీశాప మై
నను ని న్నంటవు పుట్టుచావులవెతల్ నాపల్కులన్ నమ్ము మే
తనువుందాల్చినఁ దెల్పిఁ గోల్పడ వయోధ్యన్ రామజన్మస్థలిన్
జననంబంది ననున్ భజించితివి కావన్ రామసద్భక్తియున్. 531

క. రామకృప కలుగు నీకు ధ
రామరభజనంబు కంటె హరిఁ దనుపు వ్రతం
బేమియు లే దని సారసము
గా మదిఁగని బ్రహ్మవిదులఁ గారింపకుమా! 532

తే. శక్రువజ్రంబునన్ జక్రిచక్రమునకు
గాలదండంబునన్ నాదు శూలమునకు
బడియు బ్రదికినవా రైన బ్రతుకఁబోరు
బ్రహ్మవిద్ద్రోహమయవహ్నిఁ బడిరయేని. 533

క. ఈనానుడి విశ్వాసము
నేనాఁ డేమఱక మెలఁగు మిల దుర్లభమై
కానఁబడ దేది నీ కిఁక
నీనడక నొకండు నడ్డ నేరం డనఘా! 534

క. అని యీగతిఁ బశుపతి ప
ల్కిన గురుఁడు "తథా" స్తటంచు ఖీతిఁ జతికిలఁబ
డ్డ ననున్ నెనరునఁ దేఱిచి
చనె శంకరు మదిఁ దలంచి సదనంబునకున్. 535

క. అంతటఁ గాలగతిన్ నేఁ
గొంతకు వింధ్యాద్రిఁ బుట్టి కుండలినై దే
హాంతముఁ గని యశ్రమ జ
న్మాంతర మొందితిని జు మ్మనాయాసముగన్. 536

ఁ. చినిఁగిన చీరలన్ విడిచి చెచ్చెరఁ గ్రొ త్తవి తాల్చినట్లు లేఁ
దనువు లనేకముల్ విడిచి తాల్చితిఁ గ్రొత్త వనేకభంగులన్
అనఘుఁడు శంకరుం డ టనయంబు నడంచి త్రయీపథమ్ముఁ బ్రో
చిన యతఁ డయ్యె నేను నొకచేటును లేక భవాబ్ధిఁ బుచ్చితిన్.537

## కాకభుశుండి తాను లోమశశప్తుడై కాకిజన్మ మందిన వృత్తాంతముఁ జెప్పుట.

క. ఏయోనులందుఁ బుట్టిన
నాయెడ జ్ఞానంబు నిలిచె నాటి రఘుకు్లో
నాయకభక్తియు గురుని
కృపాయత్త మనఃప్రవృత్తి యచలం బగుచున్. 538

. ఆప్రమథేశ శాపమున నట్లిటఁ బుట్టిన రామభక్తిఁయున్
విప్రకృపాప్రవృత్తియు నవిస్మరణీయము లాయె నాయెడన్

సుప్రథితంబు వేల్పులకుఁ జొప్పడరానిది వేదగేయమా
విప్రకులంబునందుఁ బ్రభవించితి నేఁ గడసారి బాముసన్. 539

ఉ. బాఁపనియింట నట్లు ప్రభవం బయి పిన్నతనంబుఁ బుచ్చితిన్
బాపలఁగూడి వేడుకను బాడుచు నాడుచు రామలీలలన్
ఆపయి శైశవం బరుగునంత ననున్ జదివించెఁ దండ్రి కా
నీ పఠనంబునందు రుచి నెక్కొనకుండె మదిన్ విరక్తిమై. 540

ఉ. రామపదైకసక్తమయి రాగము భోగము వాసి కేవల
ప్రేమవిలీనమా మతిని వేఱొకఁ డిచ్ఛ యొనర్పకుంటి నే
పామరుఁ డీవిగిడ్డి నెడఁబాసి ఖరంబును గొల్చుఁ జెప్పు మ
ట్లామెయిఁ దండ్రియున్ విసిగె నాదట నన్ జదివించి తాఁ దుదిన్. 541

క. కొంతకుఁ దలిదండ్రులు దే
హాంతము నొందఁగను బోతి నడవులఁ బడి శ్రీ
కాంతు భజించుచు నాయా
చెంతలఁ గల మునులఁ గనుచుఁ జేమోడ్పుచున్. 542

క. రామప్రభు గుణగాథలఁ
బ్రేముడి నడుగుచును నుడువ వినుచు వినుచు చే
నామోదంబునఁ దిరిగితి
నామెయిఁ బరమేశుకృప ననాహతగతినై. 543

శా. దారాపుత్రధనేషణంబు విడె సీతానాథుపాదంబు లిం
పారం గాంచి కృతార్థజన్ముఁడనుగాఁ గారొక్క మదిన్ గోర్కు లా
సారాచారుల మౌనిపుంగవులఁ బృచ్ఛంజేసితిన్ దాని నా
రారామప్రభు సర్వభూతమయుఁ డం చాడన్ గుణాతీతుగన్. 544

క. సగుణబ్రహ్మోపాసకుఁ
డగుటను నే నిర్గుణాత్ముఁ డని వాదు విభున్

బొగడ మనసొప్ప డయ్యెను
నెగడఁగ రామాంఘ్రిరక్తి నిచ్చలుఁ బ్రోత్తై. 545

చ. గురువచనంబులన్ దలఁపుకూరఁగ నిచ్చలు నాత్మ జానకీ
వరు చరణాంబులన్ నిలిపి పాడుచుఁ దద్గుణగాథ లన్యనుల్
దిరుగుచు నందు మేరుజగతీధరశృంగమునన్ వటాంబొకం
డరసితి దానినీడను మహాముని లోమశుఁ గంటి వేడుకన్. 546

చ. కని మునిపాలి కేగి పదకంజములన్ నుదురంట మ్రొక్కి వేఁ
డిన నతిదీనవృత్తిని గడింది ప్రియమ్మున నావినీతవా
ణిని విని యాకృపాళుఁ "డవనీసురశేఖర! యిట్టు లేకతం
బునఁ జనుదెంచి" తం చడుగ మోదముతో నిటులంటి మౌనికిన్. 547

క. "భగవానుఁడ వఖిలజ్ఞుఁడ
వగుదు చతురమతియు నగుదు వనుకంపాబ్ధీ!
సగుణబ్రహ్మోపాసన
పగిది నెఱింగించి నన్ గృపంగను" మన్నన్. 548

చ. అటు నను బ్రహ్మవిద్యఁ బడయన్ గడుఁ బాత్రునిగాఁ దలంచి యా
దట వినిపించె రామచరితంబులఁ దద్గుణలీల లన్ని యా
దట నల బ్రహ్మవిద్వరుఁడు తాపసవర్యుఁడు లోమశాఖ్యుఁ డొ
క్కట వినిపించె రామగుణగాథలఁ బిమ్మట బ్రహ్మరూపుగా
నిటువలె నెంచెఁ దా ననుభవైకసుగమ్యుగ నద్వితీయుగన్. 549

చ. అనఘుఁ డనామయుం డజుఁ డనంతుఁ డనంతపరాక్రమక్రముం
డనుభవవేద్యుఁ డాద్యుఁడు సుఖాలయుఁ డాఢ్యుఁ డనామరూపుఁడున్
ఘనుఁ డవినాశుఁ డీశుఁ డవికారుఁ డఖండుఁడు వాఙ్మనఃపరుం
డనుపముఁ డద్వితీయుఁ డఖిలాత్ముఁ డతం డతఁ డీవ బాలకా! 550

క. నీటికి నలలకు భేదము
బాటింపని యట్లు జీవపరమాత్మలకున్
బాటింపదు భేదం బే
నాటను శ్రుతి యనుచు నిర్గుణబ్రహ్మంబున్. 551

క. పలువిధముల వర్ణించిన
నలరదు మది సగుణరూపకారాధనమం
దలరినగతి నపుడే నం
జలిగూరిచి యంటిఁ దపసిజాబిల్లి కిటుల్. 552

మ. "సగుణోపాసనరీతిఁ దెల్పవె మునీశగ్రామణీ! యెవ్విధిన్
భగవద్భక్తి సుధాబ్ధిలోనఁ దనియు న్మత్స్యాంతమత్స్యం బదే
పగిదిన్ రామపదాబ్జదర్శనము లభ్యం బౌనొ బోధింపు మా
పగిదిన్, దద్విభుఁ గన్నులారఁ గని యాపైఁ బొందు నీబోధముల్" 553

క. అని నే వేఁడిన మౌనియు
ననుపమకథ లెన్నొ పలికి యటు సగుణోపా
సన ఖండించి నిరూపిం
చిన నిర్గుణమతము మౌనిశేఖరుతో నేన్. 554

ఉ. వాదవివాదముల్ సలిపి వానిమతం బటు లోటుపుచ్చి నా
వాదము నెగ్గనాడిన నవజ్ఞను సైఁపక కిన్కఁజేసె నా
వాదుపయిన్ మునీంద్రుఁడు నవజ్ఞను గిన్క యొనర్పకుండునే
సాదును రాయిడిన్ మలయజంబుననైన దవాగ్ని పుట్టదే. 555

క. మాటికి మునిలోకాగ్రణి
నాటుకొలిపి జ్ఞానమతము నామత మటు లు
త్పాటింపఁ బూని కినిసిన
గాటపుఁ దలపోత నిట్లు కావించితి నేన్. 556

ఆ. ద్వైతబుద్ధి లేక దాపరించునె కోప
మట్టి ద్వైతబుద్ధి యజ్ఞతఁ గద
దాపరించు మాయఁ దబ్బిబ్బుగా జీవు
లేవిధిఁ బరమాత్మ నెనయువారు? 557

సీ. కనుఁగొన్నఁ దన్నుఁదాఁ గర్మబాధను లున్నె!
వేదయుగునె పరుసవేది గలుగ!
ద్విజుల కెగ్గొనరింప బెడిదయకున్నె కులంబు!
ఖలమైత్రిని సుబుద్ధి పొలియకున్నె!
జగతిఁ బరద్రోహి జంకి కొంకక యున్నె!
కాముకుండు కలంకి కాకయున్నె !
భద్రమతిఁ గనునె! పరసతీలంపటుఁ
డందునె సుగముఁ బరాపవాది!

తే. సుకృతమునఁ గాకయున్నె విశుద్ధయశము!
దుష్కృతమ్మునఁ గాకున్నె దుర్యశంబు!
పాప మొకఁడున్నె హరికథాలాపముననుు!
బృథివి భవమున్నె పరమాత్మవిదున కెందు! 558

సీ. నృపనయం బెఱుఁగని నృపురాజ్య మాగునె!
కుల మెలర్చునె బ్రహ్మకులుల దెగడ!
వెత యొండు కలుగునె! క్షితి లోకహితకారి
కబ్బునె సుఖము! పరాపవాది
కనుకంప మించిన యన్యధర్మం బున్నె!
కోపమున్ మించిన పాప మున్నె!
నరదేహ మొందియు హరి భజింపని నష్ట
మాహరిభక్తికి కైనలాభ

తే మొండొకం డున్నె! యంచు లో నూహ లెన్నొ
సలిపి యిట్టులు సగుణపక్షంబె నెగ్గ
నాడినన్ నాదుశౌర్యంబు నరసి మౌని
యిట్టు లనె బిట్టు కిన్క నోచెట్టినవె ! 559

ఉ నాయుపదేశముల్ వినవు నమ్మవు నెమ్మది వాదులాడె దా
రా! యవివేకి! నిక్కమము నాడిన నైనను జంకు దన్నుఁటన్
వాయసమట్టు లోన నొకపక్షముఁ బూనితి కానఁ బక్షినై
వాయసదేహ మందు మన వందుర కొదలఁ గొంటి నానుడిన్. 560

క. అమ్మాయి దత్క్షణమున ననుఁ
గ్రమ్మఱ నన్ గాకిరూపు రఘువంశమణిన్
నెమ్మది నిల్పి స్మరించుచు
నమ్మని వలఁగొంచు నెగసి యాడితి మింటన్ 561

క. భవుఁ డనె భవాని కపు డిటు
లవనీధరపుత్రి! నిర్జితాంతర్ద్విషులై
భువనముల రామమయముగ
నవలోకించెదు బుధాళి కహితుఁ డెవం డౌ. 562

ఉ. కాకభుశుండి పల్కె విహగప్రభు! యవ్వలిగాథ వింటె! కా
కాకృతిఁ నొంది యుల్లగసి యాడితి నందు మునీశుదోష మే
వీకను లేదు నాదు మదిఁ బ్రేమపరీక్ష యొనర్చె రాఘవుం
డాకరణిన్ మునీంద్రు హృదయంబునఁ బ్రేరకుఁడై నటించుచున్. 563

చ. మునిమతిఁ ద్రిప్పి లోనరసి ముమ్మడి మీఱెడు నాదుపేర్మి నన్
గనుచుఁ ద్రిశుద్ధి నాత్మపదకంజసమాహిత చిత్తవృత్తిగన్
బొనరఁగ నెప్పటట్టులె తపోధనుచిత్తముఁ దీర్చ రాముఁ డ
మ్మునియును బుద్ధి నాసహనమున్ విభుపైఁ గల బత్తినిల్కడన్. 564

క. కనుఁగొని విస్మయ మందుచుఁ
జనచేఁతకు మిగులఁ బొగిలి తద్దయుఁ గూర్మిన్
జనిపి జరిని గూర్చుండఁగ
నునిచి నసుక్ రామమంత్ర ముపదేశించెన్. 565

తే. బాలరాము నుపాసించు భంగిఁ దెలిపె
నాకృపానిధి యంత నాయాత్మ బాల
రామరూపంబె కడు నభిరామ మగుచు
నొప్పె నాగతి మును నీకుఁ జెప్పితిఁ గదె. 566

మ. పేరిమన్ రామచరిత్రమానస మొగిన్ విన్పించు చామౌని యా
దర మొప్పారఁగఁ గొంతకాల మటు లొద్దన్ నిల్పి న న్నాడె నీ
శ్వరకారుణ్యము నంది వింటి నపురూపంబైన యీరామరా
ట్చరితం బియ్యది రామభక్తమణి వాటన్ నీకు విన్పించితిన్. 567

ఆ. రామభక్తి లేని పామరావళి ప్రోల
నెఱుకపరపఁ దగ ది దెన్నఁ డంచు
నెన్నొ విధుల నాకు నెఱిఁగింప నమ్ముని
యడుగు లంటినాఁడ నమితభక్తి. 568

ఉ. అమ్మెయి మౌనియున్ నిజకరాంబుజ మల్మెలి మోపి నాతలన్
సమ్మతి దీవనల్ సలిపె జ్ఞానవిరాగగుణాబ్ధి వా డెదన్
నమ్మము నీమనమ్మ సుగుణమ్ముల కిమ్మగు రామభక్తి నీ
సొమ్మగుఁ గామరూపమును జొప్పడు మత్కృపఁ జేసి పుత్రకా! 569

క. రామప్రభునకుఁ గూర్చిన
ప్రేముడి చుట్టంబ వగు దవిరతము నీ కి
చ్ఛామృతియుఁ గామరూపము
రామపదాంబుజయుగానురక్తియు నొదవున్ 570

తే. కాలకర్మస్వభావసంకలిత దుఃఖ
రాశి ని న్నంటఁబో దిఁక రామకథలఁ
గల మఱుంగు ల వెల్ల నీ కలయకుండఁ
దేటతెల్లంబుశై తామె తెలియవచ్చు. 571

ఉ. ఈమెయి రామదేవు భజియించుచు నీవు వసించు నట్టిచో
నామడమేర దన్కఁ జెరలాడ దవిద్యయు నక్కలంకులన్
నీమదిఁ గోరుకోరికలు నిండు న వెల్లను రామరాట్కృపన్
రామపదానురక్తియుఁ దిరం బగు నిచ్చలుఁ గ్రొత్తలై మదిన్. 572

చ. హరికృప దుర్లభం బొకఁడు నారయలేద కుమార! నీ కటం
చరిమిలి దీవనల్ సలుపునంత మునీశ్వుఁ డమానుషోక్తి యొం
డరిదిగ విన్బడెన్ "మునికులాగ్రణి! నీపలు కెంతొ నిక్కమై
పరఁగెడుఁ గా కితండు తనువాఙ్మతిశుద్ధి మదీయభక్తుఁడౌ" 573

తే. అనుఁడు నామింటి పల్కు ల వాలకించి
మిన్ను ముట్టితి బిట్టులమిని జెలంగి
శంక లెడబాసెఁ బ్రేముడి సందడింప
వేడ్క వీడ్కొంటి మునివరు పనుతిఁ జేసి. 574

క. అమ్మౌని యడుగుందమ్ముల
ముమ్మడి ప్రేముడి శిరంబు మోపి తదాజ్ఞన్
సమ్మతిఁ గొని సమ్మదమున
నిమ్మహితాశ్రమమునకు ని కేతెంచితి నేన్. 575

క. హరికృప సుదుర్లభములగు
వరములఁ గొని కుటికి వచ్చి ప్రభుఁ గొలువఁగ నా
కిరువదియు నేడు కల్పము
లరిగెను గుటి నిందు నుండ హరితురగవహా! 576

క. రామప్రభుగుణగాథలఁ
బ్రేముడిఁ గీర్తింతు విహగవితతులు నిచ్చల్
నేమమున వచ్చి వినఁగాఁ
బ్రేముడి నారామరాట్చరిత్రము లెల్లన్. 577

చ. నరతను నెప్పు డాను రఘునాథుఁడు భక్తహితార్థచిత్తుఁడై
ధరణి నయోధ్య నప్పుడు తత్పురి కేగుచు బాలలీల లం
దరసి తదర్భకాకృతి నిజాత్మను నిల్పి ముదంబు మీఱఁ గ్ర
మ్మఱ నరుదెంచుచుందు ఖగమండలమండన! పర్ణశాలకున్. 578

క. కాకాకృతిఁ గాంచినకథఁ
వాకొంటి ఖగేశ! నీదుప్రశ్నంబులకున్
వాకొంటి నుత్తరంబులఁ
గాకుత్స్థుని భక్తిమహిమ కడు నిబ్బరమా. 579

ఉ. రామపదానురక్తి, రఘురామపదాంబుజ దర్శనంబు శం
కామయశాంతి నాకుఁ గరటాంగమునందె లభించెఁ గాన నా
కేమెయిఁ గాకిమేన్ గడు నభీష్టము మిన్నని భక్తిపక్ష మా
లోమశుతోడఁ బోరి మునిలోకసుదుర్లభమా వరంబులన్. 580

క. పడసితి నిట్టిడి భక్తిని
విడి జ్ఞానపథంబ కోరి వెతపడు నతఁ డా
పుడుకుదోడుకు నింటను విడి
యడవుల జిల్లేడుపాల కలసిన యటులా. 581

క. హరిభక్తి వీడి యొకం డొక
వెరవున సుఖవాంఛ సేయు వెఱ్ఱితలంపుల్
శరధి దరిలేక కాల్నడఁ
దరియించు తలంపు చూవె తర్కింపంగన్. 582

ఉ. నావుఁడు నాభుశుండివచనంబుల కాగను డుండు సహస్రదం
భావహిలన్ వచించె వినయమ్మున నయ మ్మనయమ్ముఁ దోఁప ని
ట్లోవిభు! నీప్రసాదమున నుల్లము చల్లపడంగ వింటి నీ
తావిభుసచ్చరిత్ర మవధానముతోడ శమించె మోహముల్. 583

కాకభుశుండి గరుడునకు భక్తిజ్ఞానముల యభేదప్రవృత్తిఁ దెల్పుట.

ఉ. వింటి భవత్కృపాప్తి రఘువీరకథాగుణరాజి మోహమున్
గెంటి మదిన్ గుశంక లణఁగించి తమోనిశ మేలుకొంటి నా
తొంటిభ్రమం బణంగె దయతో నెఱిఁగింపు మొకింత వేఁడఁగా
నుంటి బుధాళి జ్ఞానమున కొం డుపమింపఁగ లే దనుం గదా! 584

ఉ. వేదపురాణకోవిదులు వేమరు జ్ఞానసమంబు దుర్లభం
బేమియు లేదటంచు వచియింత్రు కదా! యలలోమశుండు నీ
కాదట యట్టి జ్ఞానమ కదా! యెఱిఁగించెను భక్తిరీతిగా
సా దని యాదరింప వల జ్ఞానము నాకత మేమొ తెల్పుమా! 585

క. మునివర ! భక్తిజ్ఞానము
ల నంతర మ దెంత కలదొ ! లలి నెఱిఁగింపన్
జనవె ! యనుకంప నన నా
వినతాసుతు వినుతవాణి విని తాపసియున్. 586

ఉ. ఆదరమూరఁ బల్కె నుభయమ్మున భేద మొకింత లేదు నా
గాదకులావతంస ! యుభయమ్మును సంసృతిభంజకంబు లే
భేద మొకింత పల్కిరి మునిప్రవరుల్ వినిపింతు దాని నీ
వాదట సావధానమతివై వినుమా యనుమాన మేచుచున్. 587

సీ. జ్ఞానవిరాగ విజ్ఞానయోగములు పు
రూపములు భక్తి స్త్రీరూప మగును
బుధ ప్రతాప మేసరణిని బ్రబలమౌ
నబల సాజముగ దా నబలయ కద

అతిధీమలు విరాగు లౌవారలేకాని
విషయైషు లింతుల పీడలేదు
హరిమాయ జగతిని హరిణాక్షిరూపౌట
జ్ఞాననిధులె వీడఁ జనరు సతుల

తే. భక్తియును మాయ స్త్రీస్వరూపంబు లౌట
నిర్వ రొండొరుఁ దామ మోహించుకొనరు
భక్తి రామప్రభుప్రేమపాత్ర మగును
మాయ యెన్నఁగ నర్తకి మాడ్కిఁ దనరు. 588

తే. భక్తి ననుకూలుఁ డౌటను భక్తవరదుఁ
డారఘూత్తముఁ డమ్మాయ యడరు భక్తి
ననుపమము రామభక్తి యెవ్వనియెడంద
వెలయు నాతని దరిజేర వెఱచు మాయ. 589

. రామపదానురక్తిని గరం బలరారెడు వేని మానసం
బామహితాత్మ్మ్రమోలఁ జెరలాడదు చూపను ప్రాభవోన్నతిన్
రాముని మాయ యియ్యది దిరంబుగ నెంచియె భక్తిఁ గోరుకొం
డ్రేమెయి మాను లెల్ల రది యెల్లగుణంబుల కెల్లయం చెదన్.590

క. ఈరామరహస్యం బిది
వేరికినేఁ దెలియఁ బడదు వేగమ యెద నె
వ్వారేని దెలిసిరే నిది
చేరదు మోహంబు వారి సీతేశుకృపన్. 591

క. విను మయ! భక్తిజ్ఞానము
లను గలభేదము మఱొండు లలి వినిపింతున్
దనరు నది వినినకతనన్
దినకరకులచరణభక్తి దృఢమగు నిచ్చల్. 592

చ. కత యి దెఱుంగ వచ్చుటయ కాని యకథ్య మవర్ణ్యమహాః జుమీా
పతగకులావతంస! సుఖవారిధియున్ గుణరాశి చేతనా
యుతుఁ డవినాశి జీవుఁ డతఁ డుద్భవ మందుచు నీశ్వరాంశుఁడై
తీఁతి హరిమాయఁ జిక్కువడెఁ గీరవనౌకములట్ల బద్ధుఁడై. 593

శా. మాయాజీవుల కొక్కలంకె పడె నెమ్మై మిథ్యయే కాని యా
మాయాగ్రంధి తొలంగ దేగతి న దెమ్మై జీవి సంసారియౌ
నో యానాటనె మాయలంకె బిగువౌ నూడంగఁ బో దెన్నఁ డా
మ్నాయంబుల్ ముడిఁ బాపు సాధనములెన్నన్ వేయిఁటిన్ బల్కినన్

తే. జీవహృత్కుహరమ్మున నావరించు
కన్నుఁగానని మోహాంధకారమందు
నెటు తమోగ్రంధి కనఁబడు నెట్టు వీడు
నిట్టి సంయోగ మాహరి యెన్నఁ డేని
గూర్చెనేన్ మాయముడి చిక్కు కుదురవచ్చు. 595

గీ త మా లి క :

సాత్వికశ్రద్ధ యను గోవు స్వాంతమందు
హరికృపన్ వచ్చి నిల్చిన నతులజపత
పోవ్రతాది శుభాచార వరతృణమ్ము
మేసి యది ప్రేమవత్స మెమ్మెయిని గాంచి
పాలుచేఁప నివృత్తియన్ బందమునను
గట్టి విశ్వాసపాత్రమున్ బట్టి నిర్మ
లాత్మ యనుదోగ్ధ సద్ధర్మ మనెడి పాలఁ
బితికి నిష్కామమయవహ్ని బిట్టు గాచి
హర్ష రూపానిలమునఁ జల్లారఁబెట్టి
తమధృతిని దోడువెట్టి ప్రసన్నతయను

కుండ నొకఁడూని దాఁచినాఁ గుదుటఁబెట్టి
సత్యవాగ్రూప రజ్జు విచారమంథ
ములను గొని త్రచ్చి తీయఁగవలయు నందు
విమల వైరాగ్యరూపమా వెన్నముద్ద. 596

సీ. యోగాగ్ని రగిలిచి యురుశుభాశుభకర్మ
సమిధలఁ దగిలించి సరగఁ గాచి
విమలవిరాగమన్ వెన్నను విజ్ఞాన
ఘృతమును దీసి యాఘృతము బుద్ధి
తోడఁ జల్లార్చనోఁ దొలఁగఁగ మమతనాఁ
దెట్టియఁ గాంచి యా తేరిన నెయి
విజ్ఞానరూపిణి విమలబుద్ధి యదాని
స్వాంతరూపకసుదీపమున నింపి

తే. సమతయను సెమ్మెపైఁ బెట్టి జాగ్రదాద్య
వస్థలను ప్రత్తిఁ ద్రిగుణరూపకము లైన
గింజలూడ్చి సుషుప్తినాఁ బింజతోడఁ
వత్తి యొనరించి వెలిఁగింప వలయు దాని. 597

క. ఇవ్విధి జ్ఞానమయంబౌ దివ్వెను
వెలిఁగింప వలయుఁ దేజోనిధి యా
దివ్వె తను జేర వచ్చిన
క్రొవ్విన మదముఖ్యశలభకోటి దహించున్. 598

ఆ. "సోహమస్మి" యను ననంత వృత్తియ తత్ప్ర
చండదీపశిఖ యఖండతేజ !
వ్యక్తమైనయంత నాత్మానుభవసుఖం
బడఁగును భవమూలమా భ్రమంబు. 599

ఆ. ప్రబలమగు నవిద్యపరివారమును మోహ
రూపతమము నపుడె రూపడంగు
నవ్వెలుంగు వడసి యాబుద్ధి హృన్మంది
రమునఁ గూరుచుండి గ్రంథివిప్లు. 600

క. మాయాగ్రంథిని ముడివిడఁ
బోయినని కృతార్థుఁ డగును భువి జీవుం డా
మాయయు ముడిచిక్కెడలఁగ
నీయక విఘ్నంబు లెన్నో యేర్పడసేయున్. 601

తే. బుద్ధిసిద్ధులఁ బ్రేరేచి బుద్ధికడకుఁ
బనుప నయ్యవి యమ్మాయయవనుపుఁ జేసి
బుద్ధి కడియాసలం గొల్పి పొంచివంచి
బలిమి లోఁజొచ్చి జ్ఞానదీపంబు నార్పు. 602

క. ఆసిద్ధిబుద్ధులం గన
దాసలఁ బడి బుద్ధి చతురయగునే, నహితం
బేసవ నాశంకించుచు
గాసింపకయున్న నవ్వి గాసింత్రు సురల్. 603

ఉ. ఆరయ బుద్ధిసిద్ధు లవి యడ్డకయున్నను బుద్ధి నింద్రియ
ద్వారగవాక్షపంక్తులను బాతుకయున్న సురల్ కవాటముల్
బారుగ విచ్చి యావిషయవాయువు రాకకుఁ దా వొసంగ నా
దారిని లోనఁ జొచ్చిన సదాగతి యార్పును జ్ఞానదీపమున్. 604

తే. విషయఝంఝానిలము బుద్ధి వికలపరచ
నాఱు విజ్ఞానదీపము గూరు దమము
విడదు మాయామయగ్రంథి విషయరతులె
కాని యింద్రియదేవతల్ జ్ఞానపరులు
గా రెవం డింక నీదివ్వెఁ గ్రాలఁజేయు. 605

క. క్రమ్మఱ జీవుఁడు భవబం
ధమ్ములఁ బడి పుట్టుఁ గిట్టు దరియింప నతీ
తమ్ము హరిమాయ యెమ్మెయి
సమ్మతి హరిభక్తిప్రాపు సమకూరనిచో. 606

ఉ. చేయ నెఱుంగఁ దాఁ దెలియఁ జేయఁగ నొల్లకు జ్ఞానసాధనం
బేయెడఁ గష్టసాధ్యము ఖగేశ ! యొకానొకచో ఘనాతుర
న్యాయమునన్ ఫలించిన ననంతము లందగు నంతరాయముల్
యేయెడఁ గత్తిపై నడకయే చుమి! జ్ఞానపథావలంబమున్. 607

ఉ. జ్ఞానపథావలంబు లయి సాధన మొంతొ నిరంతరాయులై
పూనికిఁ జేసి కాని కనఁబోనిపదం బపవర్గ మద్ది శ్రీ
జానిపదారవిందపరిచర్యను గోరకయున్న నబ్బుఁ దాఁ
దాన వరించి వచ్చి యని తద్దయుఁ బల్కు శ్రుతుల్ పురాణముల్.

క. జలమునకు స్థలమునుంబలె
నిలుపఁగ నాధార మగును నిర్వాణపదం
బలర హరిభక్తి యొండిటఁ
గలుగదు కైవల్యసిద్ధి ఖగకులతిలకా ! 609

ఉ. భక్తులు కొంద ఱందునవె భక్తినె కోరుచు నుంద్రు నెమ్మదిన్
ముక్తి నిరాదరించి భవమూల మవిద్య తొలంగు నవ్యధన్
భక్తిని, దాన భక్తుని శుభాశుభకర్మము లెల్ల మ్రగ్గుఁ జూ !
భుక్తపదార్థ మెం దరుగుపోలిక నజ్జఠరాగ్నిదీప్తిచే. 610

ఉ. సేవకసేవ్యభావములు సేకుఱకున్న భవాబ్ధి దాఁటరా
దేవిధి నన్న నిశ్చయము హృత్స్థితిఁ దెచ్చి భజింపుఁ డయ్యా! సీ
తావిభుపాదపద్మము లతండు జడంబును జేతనంబుగన్
వావిరిఁ జేతనంబు జడభావమునం బొనరించు దిట్టయా, 611

తే. చెప్పితిని జ్ఞానసిద్ధాంత మిప్పు డేను
భక్తిమణిమయదీప ప్రభావము నిఁక
వినుము వినిపింతు రేవగల్ వెలుఁగు నిద్ది
నూనెయున్ బత్తివత్తులు లేని దివ్వె 612

తే. గాఢమోహాంధకారముకా ఱడంచు
లోభవాయువు లార్పఁగ లోను బడదు
మాడ్చుఁ గామాదిశలభసమాజములను
దరిఁజన దవిద్యయనియెడు దైన్య మెపుడు. 613

ఉ. కామముఖారిషడ్గణము కాఁటియపెట్టదు జీవు లెల్లరన్
బ్రామెడు మానసవ్యథలు బ్రామవు ప్రామవు రోగశోకముల్
భూమి సుధాసమం బగును బో గరళం బల రామభక్తి చిం
తామణిఁ హృత్స్థలిన్ సతముఁ దాల్చెడు ధన్యజనాళి కెమ్మెయిన్.

తే. భక్తి చింతామణిన్ వశవర్తిగాఁగఁ
గొనెడువారికిఁ గలనేని వనటలేద
యహితుఁడే హితుండౌను జే దమృత మౌను
బడయఁడు సుఖంబు లమ్మణిఁ బడయు కెవఁడు. 615

క. ఈమణికై యత్నించెడు
ధీమహితులె చుమి ! చతుర సుధీమణు లవనిన్
రామకృపలేక పడయం
డీమణి సుప్రకటమైన దేనియు నెవఁడున్. 616

సీ. సుగమ మామణిఁ గొనందగు సాధనము కాని
హతభాగ్యులై ఖలు లాదరింప
రిలను శ్రుతిపురాణము లను పర్వతముల
రామకథాఖనుల్ రాణమీఱుఁ

ద్రదహాస్యవిదులు స్రదత్న ములఁ గూడి
సుమతియున్ ద్రవుగోల సొంపుగఁ గొని
జ్ఞానవిరాగసచ్ఛక్షువులన్ బ్రీతిఁ
దడవిన నమ్మణిఁ బడయవచ్చు

తే. రామదేవునికంటె నారామభక్తుఁ
డెక్కుడని తోఁచు నామది నెంచిచూడ
రాఘవాంబుధి భక్తినీరంబు గ్రోలి
సద్ఘనంబులు భక్తహృత్స్థలులఁ గురియు. 617

తే. మలయగిరిచందనము నంటి మారుతంబు
తత్సురభి నన్యతరువులఁ దత్సమముల
సేయుగతి సాధుపవనంబు శ్రీశుభక్తి
వడసి యన్యుల దమయంతవారి సేయు. 618

క. అరయఁగ నీయన్నిఁటికిని
హరిభక్తి యొకండె ఫలము యది సన్మైత్రిన్
దొఱఁగి సమకొనదు వేఱేఁట
హరిభక్తిని వడయు సజ్జనాశ్రితుఁ డతఁడే. 619

తే. జ్ఞానమంథానగిరిఁ బూని పూనికమెయి
సాధువిబుధులు బ్రహ్మపయోధిఁ ద్రచ్చి
భక్తిమధురకథాసుధ వడసి తాము
తనివి తీఱఁగఁ గ్రోలుదు రనవరతము. 620

క. అరయ విరాగమునా రయొర
మెఱసెడు జ్ఞానాసిఁ దీసి మిడిసెడు కామా
ద్యరిషడ్వర్గబలంబుల
నరిగొని గెలుపొందువారె హరిభక్తు లిలన్. 621

## గరుడుఁడు కాకభుశుండిని సప్తప్రశ్నముల నడుగుట.

చ. అనవుఁడు కాకిజోగినుడు లాదట మీఱఁగ నాలకించి యా
వినతకుమారుఁ డాడె వినిపింపుము దేవ! కృపాపరుండవై
నను నిజదాసుగాఁ దలఁచి నాయడుగం దలకొన్న ప్రశ్నముల్
తను వెది దుర్లభంబు? వరధర్మ మ దేది? మహాఘ మేదియా.622

మ. సదసల్లక్షణముల్ వచింపుము మహాసౌఖ్యం బెదో! దుఃఖ మె
య్యదియో! మానసరోగ మేదో! యనుకంపాంభోనిధీ! తెల్పు మిం
పొదవంగా ననఁ గాకపాళి యనె ని ట్లోతార్క్ష్యా! వాకొందు ని
య్యదె నీయడ్గిన శంక కుత్తరము లిష్టాలింపు మింపారఁగన్. 623

చ. ధరణిఁ జరాచరాభిలషితం బగు మానవమూర్తికంటె లే
దరయఁగ దుర్లభం బొకఁడు నఁదఁగ నయ్యపవర్గదుర్గతుల్
సరిపడు మేటి నిచ్చెనయు జ్ఞానవిరాగసుఖప్రదంబునౌ
నరతను విద్ది కాంచి హరి నమ్మి భజింపనివాఁ డభాగ్యుఁడౌ. 624

క. కనియు నరుఁ డలభ్యతను వి
దనయము విషయైషి యగుచు హరిఁ గొలువండే
నెనయు మణిఁ బాఱవైచుక
కనకమ్మును మార్చి గాజుఁ గైకొను వెఱ్ఱిన్ 625

క. దారిద్ర్యంబును మించిన
దారుణదుఃఖమును సాధుదర్శనసుఖమున్
మీఱిన భూరి సుఖంబును
ధారుణి వేఱొండు లేవు తలపోయంగన్, 626

క. తనువాఙ్మానసములఁ దా
మనయము నుపకారశీలు రౌదుర సాధుల్

పొసరుపఁ బరోపకృతి స
జ్జనులవలెఁ బరాపకృతికి శ్రమియింత్రు ఖలుల్. 627

చ. అసఘులు సజ్జనుల్ పరహితార్థముగాఁగ నిజత్వచంబు నె
ప్డును నొలిపించుకొం చలయు భూర్జమహీజము లట్టివార లెం
దునఁ బరబంధనార్థముగఁ దో ళ్ళొలిపించుక నొచ్చి చచ్చు న
జ్జనుమును బోలువా రిల నసజ్జనముల్ పరపీడనక్రియన్. 628

ఉ. వ్యర్థు లసాధువుల్ దలఁపఁ బాములఁ గొక్కులఁ బోలునట్టి ని
స్స్వార్థపరార్థఘాతకులు వంటల నన్నిఁటి మంటెఁ గల్పి తా
మర్థిని మాటెఁ గూలు కరకాకృతి నొడ్లను బాడుచేయుచున్
వ్యర్థముగా నశింత్రు భువనాహితవృత్తిని దోఁకచుక్కలై. 629

ఆ. తోఁకచుక్క పొడుపు దుష్టజనోదయం
బార్తిఁ గూర్పు జగతి కనవరతము
విశ్వసుఖద మైన విశదాంశు నుద
యంబు సజ్జనోదయంబు ముజ్జగముల. 630

సీ. ధర నహింసను మీఱు పరధర్మ మెది లేదు
పరనింద మీఱు పాపమును లేదు
హరిగురుదూషకు లయుతజన్మంబులఁ
గప్పలై పుట్టుదు రిప్పుడమిని
బాఱు దూఱెడువారు ఘోరదుర్గతు లొంది
కాకిమేనులఁ బుట్టి గాసిఁగాంత్రు
వేల్పులఁ బ్రాముళ్ల వీఁగి దూఱెడువారు
రౌరవాదులఁ గూలువారు సుమ్మి!

తే. సాధుదూషకుఁ డొల్లక జ్ఞానభాను
నంధకారప్రియంబు దివాంధ మాను
గబ్బిడము దాచు భువిఁ బుట్టి గాసిఁగాంతు
రఖిలమున్ నిందసేసెడు నట్టివారు. 631

క. విను మానసరోగము లిఁక
వినుపింతు ఖగేశ! ప్రజలు వీని కతననే
వనట వసివాడుచుండెద
రనయము మోహంబ మూలమగా నన్నిఁటికిన్. 632

మ. సకలవ్యాధులు మోహమూలముననే జన్మించు నిమ్మేన లో
భకఫంబున్ మఱిఁ గామవాతమును గోపం బన్న పిత్తంబు నీ
త్రికమున్ హెచ్చయి సన్నిపాతమను న్వ్యాధిం గూర్చి వేధించు లె
క్కకు మీఱున్ విషయాభిలాష లను నుగ్రవ్యాధు లిం కెన్నియో.

సీ. మమతయె తామర మాత్సర్యమే తీఁట
ప్రమదవిషాదముల్ వాఁపు లరయఁ
గామంబు కడుపుబ్బ గర్వంబు వాతంబు
తృష్ణణంబు జ్వరవిశేషము లగు
నొరులకల్మిని జూచి యోర్వలేమియు క్షయ
ఘోరమగా క్రౌర్యంబ కుష్ఠ మరయ
భూరిదంభకపటముల్ క్రిమివ్యాధు లిఁ
కేల సెప్పఁగ నిట్టి వెన్నొ కలవు

ఆ. ఒక్క తెగులునఁ బడి సొక్కిపోలెదు నరుం
డనయ మఖిలహృద్వ్యాధాకరంబు
లవు నసాధ్యరోగనివహంబునన్ డిందు
పడి సుఖం బ దెట్లు పడయఁ గలఁడు. 634

తే. ఇట్టిడి తెవుళ్ల నరు లలయింపఁ బడుచు
జపతపోవ్రత ధర్మనిష్ఠావరిష్ఠ
భేషజంబుల వాడియు వేలకొలఁది
నయముఁ గాంచ రొకింత మానసికరుజల. 635

చ. మహిఁ గల జీవులెల్లరును మానసికామయ పీడ్యమానులై
తహతహ లాడుచుందురు సదా సుఖదుఃఖభయాకులాత్ములై
యహివలభుక్కలేశ! యిప్పు డాడిన యన్ని తెవుళ్ల నొచ్చియున్
మహిజనులం దెవారి మతిమంతులు గాని యెఱుంగరేసుమా!

క. ఈపాపపుఁ దెవుళులు మది
లోపలఁ దెలిసినను గాని లొంగవు చుమ్మీ!
యేపగు విషయకుపథ్యము
ప్రాపున మునిమతుల నొరులఁ బల్కఁగ నేలా? 637

ఉ. తా్మవినుతప్రచార! విను సద్గురువైద్యవచఃప్రతీతియున్
వావిరి శ్రద్ధనాఁగ ననుపానము శ్రీరఘురామభక్తిసం
జీవనమూల సౌషధముఁ జిత్తవినిగ్రహ మన్న పథ్యమున్
శ్రీవరసత్కృపామహిమ చేకుఱకున్నఁ దొలంగ వీరుజల్. 638

చ. హృదయమునన్ విరాగబల మేర్పడి నప్పుడె నీరుజంబుగా
నెదఁ దలపోయు మప్పుడ చుమీ! సుమతిస్ఫుట హెచ్చు నిచ్చలున్
బదపడి మాను దుర్విషయవాంఛ లనంగను దుర్బలత్వ మ
ప్డాదవును రామపాదరతియున్ సువివేకమయాబ్ధిఁ గ్రుంకిడన్. 639

ఉ. శ్రీరఘురామభక్తి యది చేకుఱకున్న సుఖంబు లే దటం
చారసి గ్రంథకోటి నిగమాగమముల్ వచియించె శంభుఁ డం
భోరుహసంభవుండు శుకముఖ్యులు బ్రహ్మవిచారకోవిదుల్
నారదుఁ డాదిగాఁ గలుగు నాకమహర్షులుఁ బల్కి రిద్దియే. 640

సీ. కుండేటి తలపైనఁ గొమ్ములు మొలవనీ
వడ యెండమావుల నుడుగఁబోని
కటికచీఁకటి ప్రొద్దుఁ గప్పినఁ గప్పనీ
మంచున శిఖి యుదయించఁ బోని
నేయి నీటను ద్రచ్చి తీయఁగఁ బోవనీ
యిసుకను దైలంబు పొసఁగఁబోని
కమఠపృష్ఠంబున గగ్గురు వొడమనీ
గొడ్రాలిచూలు మార్కొనని యొరులఁ

తే. బూలు బూచినఁ బూయనీ వ్యోమతలము
హరివిముఖుఁ డెందు భద్రము లందఁబోఁడు
హరిపదారాధనముకంటె ననువు మీఱు
సాధనము లేదు సంభవాంభోధిఁ గడవ. 641

క. మశకముగనైన విధిసము
మశకము విధిసముగ నైన మార్పఁగలం డా
దశరథనందనుఁ డనుమతి
విశదమతుల్ గొలుతు రతని విగతభ్రములై. 642

క. శ్రుతిసిద్ధాంతపుఁ బలుకిది
వితథంబు మదీయవాణి విను మోవినతా
సుత! హరి భజించునాతఁడె
యతిదుస్తరసంభవాబ్ధి కంతుం గాంచున్. 643

క. అనుపమమహా హరిచరితము
వినిపించితి మతికొలంది విహగేంద్ర! యిదే
విను వేదసారవచనం
బనయము నాసలను బాసి హరిఁ గొలువఁగనౌ. 644

క. నన్నుం బోలిన శఠుపైఁ
బెన్నన రొనరించినట్టి విభు రాఘవుఁడన్
బెన్నిధిని దొఱఁగి యేలా
యన్నము వేఁడంగ భవభయార్తుల కిలలో. 645

చ. శుకసనకేశ్వరాదులకు సొంపయి చిత్తము వచ్చు నాకకుత్
స్థకులుచరిత్ర మడ్గి నను ధన్యు నొనర్చితి కాక నీకు నో
శకునవరేణ్య! మోహ మెటు చందమునన్ బొనఁగూడె నయ్య! పా
యక గడె యైన సజ్జనసమాగమ మబ్బుట దుర్లభంబగున్. 646

ఉ శ్రీవరుసేవ కర్హుఁడనె చెప్పుము పక్షివరేణ్య! నే జగ
త్పావనుఁ జేసె న న్నిటు లపావనుఁ బక్షికులాధమాధమున్
దేవుఁ డతండు నన్ దనమదిన్ నిజదాసునిగాఁ దలఁచి నేఁ
డీవిధి సాధుగోష్ఠి యిటు లేర్పడఁ జేసి కృతార్థుఁ జేసె నన్. 647

క. అన్నిఁట హీనుఁడ నైనను
సన్నుతయశు నిన్నుఁ గనుట సఫలుఁడ నైతిన్
బన్నగభుక్కులతిలకా!
పన్నుగ రామున్నకథను బల్కితి వింటే. 648

ఉ. దాఁపుర మింత వెట్టక యథామతి రామచరిత్ర మెల్ల నీ
కీపగిదిన్ వచించితి ఖగేశ్వర! రామకృపాబ్ధిపార మే
రూపునఁ గాంచఁగల్గు చతురుం డొకరుండుఁ గల్గఁడె యంచు సీ
తాపతిసద్గుణావళులు దద్ద దలంచె భుశుండి ప్రేముడిన్. 649

సీ. శ్రుతు లేని మహిమంబు సుదఁ గాంచఁగా లేక
నంత మం చనునో నిరంతరంబు
భీమభవామయభేషజం బెవ్వాని
పావననామంబు ప్రణతతతికి

నంభోజసంభవ శంభుప్రభృతు లేని
చరణముల్ గొల్తురు శరణ మనుచు
సిద్ధసాధకయోగి సద్ధర్మపరులేని
నెవని సేవింపక భవము దాఁట

తే. రట్టి యశ్రుతపూర్వదయాస్వభావుఁ
డైన దినమణికులమణి కేనిఁ బోల్తు
నావిభుఁడు నిన్ను న న్నెప్డు డరయుఁ గాత
సద్దయామయదృష్టిని సంతతమ్ము. 650

క. శరణార్థినైన మాదృశ
దురితాబ్ధినె శుద్ధుఁ జేసెఁ దోఁవు బేర్మిన్
గరముఁ గని కనికరమ్మునఁ
బరిపూర్ణకృపాబ్ధి నతని వందింతు మదిన్. 651

క. కవులైన యోగిజనపుం
గవు లైన యతీశులైన ఘనమునులైనన్
భువి నెవనిఁ గొలువకుండిన
భవజలధిఁ దరింప రట్టి ప్రభువరుఁ గొలుతున్. 652

చ. అనుచు నతండు రామచరణాంబుజభక్తినిమగ్నుఁ డౌచుఁ బ
ల్కిన నుడు లాలకించి పలికెన్ గతసంశయుఁడై ఖగేంద్రుఁ డో
యనఘచరిత్ర! భక్తిసురసార్ద్రము నీనుడి విన్న యంత నే
తునిఁగెను మోహసంజనితదుఃఖము లే సఫలుండ నైతిఁ జూ. 653

ఉ. సచ్చరితా! భవత్కృపను సర్వవిధంబుల సౌఖ్య మబ్బె లో
నిచ్చలుఁ గ్రొత్తలై నెగడె నెయ్యముఁ దియ్యము రాఘవాంఘ్రులన్
మచ్చిక మోహసాగరనిమగ్నునకున్ దరి వైతి వీవు నా
కిచ్చట నే నొనర్పఁగల దెయ్యది ప్రత్యుపకార మాడుమా! 654

చ. కరటవరేణ్య! నీదు పదకంజములన్ గయిదోయిఁ గూర్చి వే
మరుఁ బరిపూర్ణకాముఁడవు మాధవపాదపయోజభక్తిత
త్పరుఁడవు నిన్నుఁ బోల్ప ధరపైఁ గలఁడే యొకభాగ్యశాలి యా
గిరితరుసాధుభూనదుల కృత్యము లెల్ల పరార్థములే గదా! 655

క. కవు లవని సాధుహృదయము
నవనీతముఁ బోల్త్రి రెల్లు నవనీతము తా
ద్రవమవు నిజతాపముననె
ద్రవమవుఁ బరతాపమునను దత్సాధుమతుల్. 656

చ. జననము జీవనం బవని సార్థక మయ్యెఁ దొలంగె శంకలున్
మునికులముఖ్య ! నీకృప, ననున్ నిజదాసునిగాఁ దలంపు మం
చనయముఁ దత్పదంబుల వరాంగము వంచి నమస్కరించి వీ
డ్కొని మది రాము నిల్పి గరుడుం డెగసెన్ నడిమింటి వీధికిన్.657

క. విను మోగిరివరసుత ! స
జ్జనసాంగత్యంబుఁ బోల్పఁ జను లాభ మ దెం
దునలేదు కాని హరికృప
పొనరక తత్సాధుగోష్ఠి పొసగ దను శ్రుతుల్. 658

• శ్రీ రా మా య ణ క థా ఫ ల శ్రు తి •

మ. అవనీభృత్సుత నే వచించిన రఘూపాఖ్యాన మాలించినన్
భవపాశంబులు బాయుఁ బాయును మనోవాక్కాయజంబైన త
త్త్రివిధాఘంబు శ్రితామరద్రు వగు నా శ్రీరామపాదద్వయిన్
దవులున్ భక్తి తిరంబుగాఁ గడుఁ బవిత్రం బీచరిత్రం బిలన్. 659

చ. సుమతియు, ధర్మకర్మరతి, సూనృతసక్తి, దయాపరత్వమున్
యమనియమాదిసాధనము లగ్రజసేవయుఁ దీర్థయాత్రలున్

శమదమనీతినిష్ఠలును జ్ఞానవిరాగ సుయోగయాగము
ఖ్యము లగు వేదచోదితశుభాచరణంబుల కెల్ల భక్తియే. 660

క. ఫలమగు, నాహరిభక్తియ
దలవడు నెవ్వనికొ యొకని కాహరికృపచే
నిల ముని దుర్లభభక్తియ
దలవడు సులభముగఁ గథయి దాలించినచో. 661

సీ. ఏవ్వాని మానసం బేప్రొద్దు హరిపదాం
భోజానురక్తమై బొరలువాసి
యాతఁడె ధర్మపరాయణుఁ డాతండ
కపకోవిదుఁ డతండ ఘనబలుండు
పండితుం డతఁడె భూమండలమండనుం
డతఁడె దాతయుఁ గులత్రాత యతఁడె
చతురుఁ డతఁ డతండ శ్రుతిసారవిదుఁ డతం
డఖిలజ్ఞుఁ డతఁడ నయానయజ్ఞుఁ
తే. డింతి! వేయేల యారఘుకాంతశుభప
దాబ్జభక్తిపరాయణుఁ డైన మాన్యుఁ
డేకులంబున జనియించు నాకులంబ
జగతి మాన్య మసామాన్య మగును జువ్వె!. 662

సీ. పరమపాతివ్రత్యభవ్య నారియ నారి
నిజధర్మ మెడయని ద్విజుఁడె ద్విజుఁడు
దివిషత్తటిని పాఱుదేశంబ దేశంబు
నీతిఁ జరించెడు నృపుఁడె నృపుఁడు
ప్రథమగతిం గాంచు వరధనంబె ధనంబు
పుణ్యారతిఁ గలట్టి బుద్ధి బుద్ధి

క్ష్మాదేవతాభ క్తి కల పుట్టువే పుట్టు
సత్సంగతిని బుచ్చు క్షణము క్షణము

తే. రామభ క్తి పరాయణుఁ డౌ మహీతుఁడు
పుట్టిన కులంబ సుకుల మోహాలఁతిమిన్న!
యీకథఁ గల నీమనోభీష్ట మరసి
మఱుఁగు పెట్టినఁ జెప్పితి మదికొలంది. 663

మ॥ వినిపింపన్ జన దీచరిత్ర మిది లోభిక్రోధికుక్షింభరా
వని దేవద్విషు లైనవారికి రఘుస్వామిన్ విరోధించు నా
తని కింద్రోపముఁడౌ నరేంద్రుఁ డయి యాతం డెంతవాఁడైననేన్
విన నర్హుల్ జుమి! యీ చరిత్రము బుధుల్ విప్రప్రియుల్ ధార్మికుల్.

క. రాముఁడు ప్రాణప్రియుఁ డౌ
నేమహితుల కట్టివారు నిల గురుదేవ
క్ష్మామరసేవాసక్తులు
రామకథన్ వినఁగఁ దగిన ప్రాజ్ఞులు చుమ్మీ! 665

ఉ. రామపదాసుర క్తిని గరం బపవర్గసుఖంబును గోరు దేని ద
ద్రామకథాసుధారససుధారలఁ గర్ణపుటంబు లొగ్గి లోఁ
బ్రేముడిఁ గ్రోలఁగాఁ దగును బ్రేయసి! నావచియించి నట్టి దీ
రామచరిత్ర మెన్నఁగ నిరస్త సమస్తభవామయౌఘమూ. 666

చ. కలికలుషవ్యథాపహము గాఢభవామయభేషజం బి దిం
దులఁగల సప్తకాండములఁ దోరఁపు భ క్తిపథంబు లెన్నియో
కల వల రాముఁ జేరఁగను గాని తదీయకృపావిశేష మెం
దలవడనున్న దన్న నరుఁ డడ్డిడఁ డాహరిభ క్తిపద్ధతిన్. 667

క. ఈకథఁ గపటము నెఱుఁగక
వాకొను నరుఁ డొందు నిష్ట వాంఛాసిద్ధుల్
వాకో నిది యూఁకొనిన భ
వాకూపారమును గోష్పదాకృతి దాఁటున్. 668

చ. అనవుఁడు రామగాథ యది యంతయు నాదట నాలకించి యు
ట్లనె మృదుమంజులోక్తి చెలువారఁగ నాయమ నాథ! నీకృపన్
మనమునఁ గాసివాసె ననుమానము మానెను రాఘవాంఘ్రులన్
నెన రుదయించెఁ గ్రొత్తలయి నిచ్చలునున్ గృతకృత్యనైతి నేన్.

క. శివకర మశివహర ముమా
శివసంవాదంబు కలివృజినసంహారమున్
భవభయహారంబు సుజన
శ్రవణమనోహరము నొచు రాజిల్లు నిలన్. 670

శా. రామానుగ్రహ మూని పావనచరిత్రం బిద్ది వాకొంటి నీ
రామాఖ్యానముఁ బోలి రెం డెది మదిన్ రమ్యంబు కాఁబో దిలన్
రామోపాసకుఁడైన వానికిఁ గలిన్ ధర్మం బెదే సాగ దా
రాముం గొల్వఁడు పాడుఁ డాతని గుణగ్రామంబు నాలింపుఁడీ. 671

తే. జపతపోయోగయాగాది సాధనములు
సాగనేరవు కలిని దుష్కాల మగుట
నొండు పని వీడి కపటంబు నోడి మదిని
బాడుఁ డాడుఁడు వేఁడుఁ డాభవ్యచరితు. 672

ఉ. గ్రద్ద నజామిళుం గరిఁ గిరాతు ధనాంగన నెంద టెందఱన్
దద్దయుఁ బెద్దసేయఁడె యధోగతి నున్న సముద్ధరించి ము

న్నద్ది తలంచి కొల్వ్వ పతితావనపావననాము రాము నీ
బుద్ధిఁ బొరల్ దొరంగి, రఘుపుంగవుఁ గొల్చి తరింపకుండిరే. 673

చ. శ్వపచకిరాతముఖ్యులగు పాపులునైతము రామనామ మొ
క్కపరిఁ దలంచి పావనులు గావుటఁ జేసి యుగ్గడించు వే
ని పతితపావనత్వమును నిచ్చలు వేదపురాణరాజి య
ట్టి పతితపావనున్ విభుఁ గడింది ప్రియంబున సంస్మరింపుమా! 674

తే. హంసవంశావతంసేతిహాస మిద్ది
పాడినను విన్న వాకొన్న వారివారి
కలిమల మనోమలంబులుఁ గడిగి వైచి
తుదకు శ్రీరామసాయుజ్యపదవి నొసఁగు. 675

క. అంచితమతి నిడి యిందలి
పంచశతచతుష్పదముల భావించినచోఁ
బంచేంద్రియజనితేహా
సంచయము నవిద్య పాయు సవితృకులు కృపన్. 676

క. ధరణి నిరీప్సుల కెల్లర
కరిమిలి నిర్వాణ మొసఁగి యగతికుల నిరం
తరకరుణఁ బ్రోచు రాఘవ
కరుణాంబుధి కీడుజోడుఁ గలదె తలంపన్. 677

క. ననుఁ బోలిన మందుఁడు నె
వ్వని కరుణాలేశమునను బడసెనొ విశ్రాం
తిని దత్కృపాబ్ధి రాఘవు
నెనయంగల ప్రభువరేణ్యుఁ డెవ్వం డవనిన్. 678

క. నను\u0c01 బోలిన దీనజనున్
నిను\u0c01 బోలిన దీనహితు గణింపఁగ నెందున్
గనఁబోము కాన మనకున్
ననుపు కుదిరె భవభయం బణఁపుము రామా ! 679

తే. కామినీకాంచనంబులఁ గాముకునకు
లోభికిని గల్గు నట్టి యాలోలుపత్వ
మొదవఁ జేయుము నాకు నీపదసపర్య
నలుపు టందున జానకీజాని ! రామ ! 680

ఉ. తొల్లిఁటికాల మందు నలఘూర్జటి పల్కిన రామగాథ నేఁ
డల్ల రఘూత్తమాంఘ్రి కమలాంచిత భక్తిరతుండు యోగిరా
ట్టల్లజుఁడైన యీ తులసిదాసుఁడు తెల్లముగాఁగ భాషలో
నల్లెను హృద్యపద్యముల నాదట స్వాంతతమఃప్రశాంతికై. 681

శా. ప్రేమాంభఃపరిపూరమున్ శుభదమున్ విజ్ఞానభక్తిప్రదం
బామోదావహమున్ భవాపహము మాయామోహవిచ్ఛేద మీ
శ్రీమద్రామచరిత్ర మానసమునన్ బ్రీతిన్ మునుంగాడినన్
బ్రామంబోవు భవార్కదీధితుల వుగ్రంబౌచు నెవ్వారలన్. 682

ఇది శ్రీమద్భారద్వాజస గోత్రపవిత్ర రామనార్య
తనూభవ, సుజనవిధేయ, శ్రీసూర్యనారాయ
ణనామధేయ ప్రణీతంబును, సకలకలిక
లుషవిధ్వంసనంబు నగు శ్రీమదాంధ్రతుల
సీ రామాయణం బను శ్రీరామచరిత
మానసమున విమలవైరాగ్యసంపాద
నకామకం బయిన సప్తమ సోపా
న ముత్తరకాండము సమాప్తము.

# ఆంధ్ర తులసీరామాయణము (బాలకాండము)

## సమీక్షలు - పండితాభిప్రాయములు

మదరాసు విశ్వవిద్యాలయమున ఆంధ్రభాషా శాఖాధ్యక్షులగు

"విద్యారత్న" శ్రీ నిడుదవోలు వేంకటరావు M. A. గారు (రచించిన సమీక్ష)

శ్రీ శివః

## ఆంధ్ర తులసీరామాయణము - బాలకాండము

### స మీ క్ష

ఉ॥ 'రా' యను నక్షరంబు ముఖరంగతటి న్నటియించి నంతనే
పాయు నఘంబు 'మా' యన కవాటగతిం జొరనీ దభేద్యమై
ఆయఘహారి తారకమహత్తర మంత్రము సంస్మరించి 'రా
మాయ నమో' యటంచుఁ గుసుమాంజలిఁగూర్చి యుపక్రమించెదన్.

ఆంధ్రవాఙ్మయమున రామాయణకథ భారతకథకన్న నెన్నియో విధములుగా విరిచుర ప్రచారమును బడసినది. చదువురాని వారి కనువైన జానపదగేయము మొదలుకొని, సాహిత్యశ్రేణిలోని మహోత్తమ కావ్యము వఱకును, రామకథను గూర్చిన గ్రంథములు, వివిధవాఙ్మయ శాఖలలో నైదారువందలకు మించి యుండును.* ఇవి ప్రాయకముగా సంస్కృతమున వాల్మీకి రామాయణకథ ననుసరించినవియే. ఈతరువాత నితర భాషల యందలి రామాయణములు కూడ యనువదింపఁబడు చున్నవి. తమిళభాష యందలి కంబమహాకవి విరచిత రామాయణ మాంధ్రీకృతమైనది. నేడు హిందీవాఙ్మయము నందలి తులసీదాస

---

* తెలుఁగుభాషలో కెల్ల పెద్ద ద్విపదకృతియగు కట్టావరదరాజు రామాయణము (నాల్గు సంపుటములు) పరిష్కరించు సందర్భమున 'ఆంధ్రరామాయణ గ్రంథ సూచిక నొకదానిని సిద్ధపఱచితిని.

రామాయణము భాషాప్రాధాన్యమును బట్టి వాఙ్మయవీథి నలంకరించు చున్నది.

మధురకవితారచనా ప్రథితులగు మైలవరపు సూర్యనారాయణ మూర్తిగారు, తులలేని వెలలేని, తులసీదాసకృత రామచరిత మానస మును తెలుఁగుఁ గావించి యందలి ప్రథమసోపానమగు బాలకాండము నాంధ్రవిద్వల్లోకమున కందించినారు. చారిత్రకదృష్టితోడను సాహిత్య విమర్శకదృష్టితోడను, సమీక్షించిన మైలవరము వారి కృతి యితః పూర్వరచితములైన తులసీరామాయణము లన్నింటికన్న ప్రత్యేక విశిష్టత గలది. దాని నించుక వివరించెదను.

తులసీరామాయణము తెలుఁగులోనికి వచ్చుట కిది మొదటి పరియాయము కాదు. దీని మొదటి యాంధ్రానువాదము.

(1)*మహోద్దండకవి పండితుఁడు సంగీతసాహిత్యనిధి శ్రీ శిష్టు కృష్ణ మూర్తిశాస్త్రి విరచితము. ఇది క్రీ. శ 1880 ప్రాంతము నాటిది. గ్రంథ మంతయుఁ బూర్తిగ ననువదింపఁబడినది. కొన్ని కాండములు మండనరహరి కామయ యను కవీంద్రునిచే రచింపఁబడినవి. అముద్రితము. ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది.

(2) కీ. శే. శ్రీ భాగవతుల నృసింహశర్మగారి పద్యానువాదము. ముద్రితము. యథామూలము గాదు.

(3) కీ. శే. శ్రీ పసుమర్తి శ్రీనివాసరావుగారి వచనకృతి. ఇది వావిళ్లవారిచే ముద్రితము.

(4) ఆంధ్రి తులసీరామాయణము మైలవరపు వారిది.

---

(1)*తులసీరామాయణము తొలి తెలుఁగు సేత. వ్యాసము, శ్రీమతి నివేదిత. పరిశోధన పత్రిక మద్రాసు జూన్, జూలై 1953. సం.14. పుటలు.16-27. ఇందీ గ్రంథమును గూర్చి సంపూర్ణ వివరణము గలదు.

ఆంధ్రభాషాంతరీ కరణములలో నేటికృతి చివరదే యైనను బహుముఖములుగాఁ బరిశీలించిన నిది వానికన్న భిన్నమై ప్రత్యేక ప్రతిష్ఠగల ప్రాథమిక స్థానమునుబడయ నర్హతగలది. దాని కుపపత్తు లివి.

(1) శిష్టువారి భాషాంతరీకరణము మొదటిదైనను నది యేక కర్తృకము కాదు. ఇద్దరు కవులు రచించినది. మఱియు నందు మూలము లోని దోహా చౌపాయీ మొదలగు హిందీవృత్తము లట్లే తెలుఁగు లోని కనువదింపఁబడినవి.

ఉదాహరణమునకు—

చౌపాయి – కంకణి కింకిణి నూపురధుని సుని
కహత లఖనసన రాము హృదయ గుని
మానహు మదనదుందుభీ దీన్హీ
మనసా విశ్వవిజయ కహు కీన్హీ.

తెలుఁగు – ఘనసూపుర కంకణభూషాధ్వని
విని విభుఁడనె సుగుణుని తమ్మునిఁ గని
మనసిజుఁడు జగమ్మును గెలువన్
జన నగు భేరీధ్వనియె యనంగన్.

(2) భాగవతుల వారిది పద్యకృతి యైనను భావానువాదము. తులసీరామాయణములోని భావములలోఁ గొన్నిఁటిని గ్రహించి రచించినది. కావున పూర్ణానువాదము కాదు. మూలగ్రంథకారుని యభిప్రాయము లన్నియు మన కవగతములు కావు.

(3) వసుమర్తి వారిది వచనము. ఇది మూలానుసారిగ నున్నను కేవల గద్యరచన.

ప్రస్తుతానువాదము పైవానిలోని వ్యత్యాసములను దిద్దితీర్చుచు నాంధ్రతులసీరామాయణములకు మకుటాయమానమై యున్నది.

(1) ఈ గ్రంథ మంతయు నేకకర్తృకము. ప్రస్తుతము బాల కాండమే ముద్రితమయ్యును గ్రంథ మంతయు నామూలాగ్రముగ నను

వదింపఁబడినది. ఏక కర్తృత్వమువలన మూలగ్రంథములోని భావముల నొకేరీతి నవగాహన చేసికొనుట కనుకూలపడును.

(2) ఇందు మూలమున నున్న హిందీభాషా వృత్తములు గాక తెలుఁగు ఛందస్సులలో ప్రచురప్రచారముననున్న చంపకోత్పల మత్తేభశార్దూలాది వృత్తములు, సీసగీతాదులు మొదలగునవి ప్రయుక్తములైనవి. మఱియు సుపరిచితచ్ఛందస్సులు సద్యోరసస్ఫురణ కలిగించును.

(3) మూలగ్రంథములోని భావము లన్నియు యథాతథముగా సుగ్రాహ్యమగు శైలిలో సంతరింపఁబడి యున్నవి. పై చౌపాయి భాషాంతరీకరణము చూడుఁడు.

క॥ నలుదెసలం గనుఁగొని చం
చలదృష్టిన్ భీతహరిణశాబకరీతిన్
జెలఁగఁగ జానకికంకణ
ములధ్వను లెద నాఁట రామభూపతి పలికెన్.

చ॥ అనుజుఁడ! వింటె! విశ్వవిజయం బనులాలసఁ జూపి మన్మథుం
డొనరఁగ భేరికొట్టె నన నొక్కరవం బగు నంచుఁ గన్గొనెన్.

927 – 928 పద్యములు.

(4) భక్తిరసప్లావితములగు గ్రంథములోని విశేషము తెలియుటకు, రసానుభవము కలుగుటకు, పద్యరచనయే యనుకూలము. కాని గద్యముకాదు. ఈ కవితా సూక్ష్మమును గుర్తించియే ప్రస్తుత గ్రంథకర్త దీనిని నిర్వచనపద్యకృతిగా నిపుణతతో నిర్వహించినాఁడు. ఇది యెంతయు ప్రశంసనీయము. ముద్రిత బాలకాండమున పదునాలుగు వందల యిరువదొక్క పద్యములు గలవు.

(5) పై గుణములన్నింటికన్న దీనికి ప్రత్యేకత నాపాదించినది ఆంధ్రీకృతికర్త భక్తిపరత. అది యీ గ్రంథమున ప్రతిపాదమున ప్రతి

పద్యమున, ప్రతిసన్నివేశమున ప్రస్ఫుటమగుచునే యున్నది. కవులలో ఆధ్యాత్మికవివేచన, ఆస్తికత, లుప్తమైన యిక్కాలంబున గ్రంథకర్తలైన సూర్యనారాయణమూర్తిగారు కవులలో వయసున చిన్నలయ్యు ఆధ్యాత్మికభక్తిభావనచే నభివంద్యులై పెద్దతనమును వహించిరి.

సహజముగ భక్తిరసోన్ముఖమగు భావనయున్నగాని పరమభక్తాగ్రేసరుఁడును, మహాకవియు, నగు తులసీదాస రచనలోని యంతరార్థము గ్రహింప నలవికాదు. ప్రస్తుత గ్రంథకర్త నిసర్గభక్తిసంభరితమనస్కుఁడు కాబట్టియే తులసీదాసమానసము నందలి గంభీరభావమును, భక్తిసంపదను, తమకవిత్వమూలమున, ఆంధ్రమహాజనుల కందింపఁ గలిగినారు. ఇది సర్వథా సర్వదా ప్రశంసనీయము.

తులసీదాసువలెనే భాషాంతరీకరణకర్తయును శివకేశవభేదము పాటింపని అద్వైతసిద్ధిగలవాఁడు. కృతిసమర్పణమున జూడుడు.

ఉ॥ మానుగ మున్గి తేలుచును మానిత రామకథా స్రవంతిలో
మానినిఁ గూడి తారకసుమంత్రజపం బొనరించు నెవ్వఁ డ
వ్వాని కతిప్రియం బి దని పట్టము గట్టెదు సర్వమంగళా
జానికి జానకీధవుని చారుచరిత్రము దీని నియ్యెడన్.

ఈ రామాయణ కావ్యమంతయుఁ బూర్వప్రబంధరీతిని శ్రీకారముతో ప్రారంభమై, ఇష్టదేవతా స్తోత్రాదికము స్వీయవంశవర్ణనము, పూర్వకవిస్తుతి, షష్ఠ్యంతములు, గలిగియున్నది. కవితాశైలి గాంగనిర్ఝర సదృక్ధారాళ వాగ్ధాటి-పద్యరచన హృద్యము. పదబంధము భక్తిరసబంధురము.

తొలిపలుకులో సంస్కృత హృదయులును సాహితీవేత్తలునగు, శ్రీ కేశిరాజు వేంకటనృసింహ అప్పారావుగారు వ్రాసినట్లుగా నీకవి చిత్తవృత్తియందు జీవితవిధానము నందు బమ్మెర పోతనను బోలినవాఁడు. హిందీభాషలో పోతనతోఁ బోల్పదగిన మహాకవి తులసీదాసు. అతని రామచరిత మానస మను కావ్యామృతమును ఆంధ్రకావ్య చింతామణి

పాత్ర నందించిన శ్రీమైలవరము సూర్యనారాయణ కవివర్యుని "ఆంధ్ర తులసీదాస" నామాంకితముతో నాంధ్రలోక మాదరించు గాత !

ఇది తెలుగువారు పారాయణముచేయు పవిత్ర గ్రంథము. ప్రతి గ్రంథాలయమును, కళాశాలయును, నలంకరించుకోఁ దగిన ప్రశస్తకృతి. ఆంధ్రమహాజను లెల్లరును దీని నాదరించి గ్రంథకర్తకితోఁ డధికముగఁ బోత్సాహ మొసంగి తక్కిన భాగములు త్వరలో వెలువడు భాగ్యము లభింపఁ జేయుదురు గాత మని యభ్యర్థన.

ఇట్లు,

మ ద రా సు 1-10-1956 — నిడుదవోలు వేంకటరావు, విద్యారత్న.

# పండితాభిప్రాయములు.

సుప్రసిద్ధ విద్వాంసులు, శతావధానులు.

బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు చిరివాడ (కృష్ణాజిల్లా)

అయ్యా! ఆంధ్రతులసీరామాయణము బాలకాండము చదివితిని. తులసీదాసు ప్రతిభ సమస్తము కూలంకషముగా తెలిసికొనుటకు కావించిన మీ ప్రయత్నము సఫలము. మీ తెలుఁగుకవనముఁ ధారలోఁ గాని, ప్రసన్నతలోఁగాని, నానుడిలోఁగాని, మఱియెందుఁగాని లోపము లేక మిగులసంతోషముఁ గూర్చుచు చదువరిని చదివినకొలఁదిఁ జదివించుకొనుచుఁ బోవును. ఇతోఽధిక ప్రయత్నముతో మిగిలిన కాండములనుగూడ సమాప్తిచేయఁ గోరుచున్నాను.

వేలూరి శివరామశాస్త్రి.

శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు,

శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయము (తిరుపతి)

తాము దయతో పంపిన జానకీజానిశతకము, తులసీదాసు రామాయణము బాలకాండమును చేరినవి. ధన్యవాదములు. అందందు చూచి

తిని. ఇతరకార్యభారముచే ప్రకృతము సాంతముగా చదువ వీలులేమికి చింతిల్లుచున్నాను. చదివినంతలో మీకవిత ప్రాచీనపద్ధతిలో ధారాళమైన నడకనడచిన దని వ్రాయ సంతసించుచున్నాను. ఇంత మంచి కవితా సంస్కృతిగల మీరు మూలమును సరిగా అనువదించి యుండినచో ఎంతో బాగుండెడిది. మహాకవుల రచనలను మనస్వతంత్రభావములతో కలుపుట నాకంతగా మనోజ్ఞ మనిపించదు. తెనుగు నుడికారమునకు ఛందస్సునకు అనురూపముగా చిన్నమార్పులు చేయుట విధిలేని పని. ఆ మేరను మీరుట మూలగ్రంథరచనకు స్ఫోరకము గాఁజాలదు గదా. నాకు హిందీభాష తెలియదు. కాన అందలి విశిష్టత నావంటివారికి మనస్కరించునట్లు మీవంటి విదుషులు రచింపవలెనని నా ఆశ.

భవదీయుఁడు,

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు, ఎమ్. ఏ.

ఆల్ ఇండియా రేడియో (విజయవాడ)

మీరు దయతో పంపిన మీ గ్రంథములు రెండును ఆంధ్రతులసీ రామాయణము, శ్రీజానకీజానిశతకము – కృతజ్ఞతతో గైకొంటిని. మీది పవిత్రము, నిర్దుష్టము అయిన కవిత్వము. శోభాసంపన్నమైన మీవాగ్విలాసమునకు ఇతరుల అభిప్రాయము లేల! తులసీరామాయణ మంతయు అచిరకాలమున ప్రకటింతురని ఆశించుచున్నాను.

పిం. లక్ష్మీకాంతం.

భాషాతత్త్వవేత్తలు, విద్వాన్ మహారాణిపేట, విశాఖపట్టణం.

శ్రీ గంటి జోగిసోమయాజిగారు. ఎమ్. ఏ. ఎల్. టి. 9—8—1956

ప్రొఫెసరు, ఆంధ్రభాషాశాఖాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

శ్రీయుతులు మైలవరపు సూర్యనారాయణమూర్తిగారు తెనుగున అనువదించిన తులసీదాసకృతిని తిలకించితిని. గంగాప్రవాహము

హిందూస్థానమును పవిత్రమును ఫలవంతము నొనర్చినట్లే తులసీదాసు కవితాప్రవాహమును అందలి భక్తజనక్షేత్రములను రసమయ మొన ర్చినది. అట్లు రూపొందిన రామచరితమానసమును తెనుఁగువారలకు చక్కనిభాషలో లలితమైన శైలిలో నందించిన శ్రీమూర్తిగారు చాల ప్రశంసనీయులు.

ఈ గ్రంథము భక్తులకు ఆదరణీయము. హిందీకవితలోని మెఱుఁగులను తెలిసికొనఁదలఁచినట్టియు, హిందీభాషానభిజ్ఞులైనట్టియు ఆంధ్రుల కందఱకు నిది తప్పక పఠింపఁదగినది.

విద్వాన్, సోమయాజి.

విద్వాన్ శ్రీ K. సుబ్బరామప్పగారు మహారాజకళాశాల,
ఎమ్. ఎ. బి. ఇ. డి. మైసూరు
ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు, మైసూరు విశ్వవిద్యాలయము 13-8-56.

ఆర్యా! మీరు పంపించిన ఆంధ్ర తులసీరామాయణము, (బాల కాండము) శ్రీ జానకీజాని శతకము అందినవి. రెండును ఉత్తమకృతులు "తులసీరామాయణము" ఉత్తమోత్తమము.

హిందీసాహిత్యమున పాండిత్యమును గడించినందులకు సద్విని యోగ పఱచితిరి. తెలుగువారిలో భాగవతమున కున్నంత వ్యాప్తి రామాయణ అనువాద గ్రంథాలకు లేదు. బహుశః జనప్రియత్వముగా వాల్మీకి-రామాయణమును అనువదింపని కారణమని తోచెడిని. ఉత్తర హిందూస్థానమునను హిందీసాహిత్యమునను జనప్రియత్వము నందిన కృతి తులసీదాస రామాయణము. దీనిని మీరు చక్కని శైలిలో అను వదించితిరి. ఈ గ్రంథరాజము గూడ జనప్రీతిని చూఱగొనఁ గలదు. "స్వాంతస్సుఖాయ" అని కూడ చెప్పికొన్నారు. కావున మీకృతి విశ్వశ్రేయమై వెలయుగాక !

ఇట్లు, బుధజనవిధేయుఁడు
కె. సుబ్బరామప్ప.

డాక్టరు, 323 విద్యానగరము,

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, ఎమ్.ఎ.ఆనర్సు, హైదరాబాదు 7

ఉస్మానియా విశ్వవిద్యాలయము. 2-9-56

తమరు దయతో పంపిన ఆంధ్ర తులసీరామాయణము నందలి బాలకాండము చేరినది. చేరినదే తడవుగా దాని నామూలాగ్రము చదివి ఆనందపరవశుఁడ నైతిని. ఆమహాకవి వాగమృతముఁ గ్రోలవలెనని చిర కాలము నుండి నామనమునఁగల యాసక్తి నీతమ యాంధ్రీకరణము పూరించుటయే కాక దానిని తమ కవితామృతముతోఁ గూడ జత సేయుటచే ద్విగుణీకృత మాధుర్యమును చూఱ యిచ్చినది. భాషలో భక్త్యావేశములో భావగాంభీర్యములో తమ గ్రంథము సర్వవిధముల పోతన్నగారి కవిత్వమును దలపించుచున్నది. తమ కవిత్వ మనువాద మయ్యు రసబంధురమై స్వతంత్రము వోలె భాసిల్లుచున్నది. అచిర కాలముననే శేషభాగమునుగూడ ముద్రించి తులసీదాసుఁ డాంధ్రిమున నవతరింపని కోఱత తీర్తురు గాక!

ది. వేంకటావధాని.

సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్సభాపతులు

శ్రీ తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు

కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారు బి. ఏ. బి. యల్.

సాహితీ సమితి, రేపల్లె.

దేశములో రమారమి ముప్పది సంవత్సరముల క్రిందట స్వాతం త్ర్యోద్యమము బయలుదేరి రామరాజ్య పదబంధము తరచుగా జను లకు కర్ణ తాడిత మగు చుండుటచే రామాయణము మీద ప్రీతి విజృం భింపసాగినది. తత్ఫలితముగా గీర్వాణవాణి నుండి కొందరు కొందరు వాల్మీకి రామాయణము పద్యరూపమునను, గద్యరూపమునను,

వెలయించుట సంభవించినది. ఆరోజులలో హిందీభాషా ప్రచారము ప్రారంభమై విస్తృతి గాంచి హిందీభాషలోని ఉత్తమ గ్రంథములు కొన్నికొన్ని ఆంధ్రీకృతములైనవి. ఆ భాషలో తులసీ దాస విరచిత రామాయణ కావ్యమునకు గల ప్రాభవము ప్రశస్తియు మఱి యేగ్రంథమునకును లేదు. తులసీరామాయణమునకు రామచరిత మానసమని, ప్రధాననామము. తొలిదినములలోనే వసుమర్తి శ్రీనివాస రావుగారు రామచరిత మానసమును వచనరూపమున నాంధ్రీకరించిరి. భాగవతుల నృసింహశర్మగారు కేవలము యథామాతృకముగా గాక కొంత స్వేచ్ఛతో ఆంధ్రభాషలో పద్యానువాదము రచించినారు. మూలగ్రంథములోని భావములు యథాతథముగా గ్రహింపవలె నను కోరిక జనించుట సహజము. కావున మూలాతి క్రమణము కానీని అను వాదములు బయలు వెడలినవి. శ్రీ మైలవరపు సూర్యనారాయణ మూర్తిగారు హిందీభాషలో విశేషపరిశ్రమచేసి విద్వత్తు సంపాదించి తులసీరామాయణమును పద్యరూపముగా ఆంధ్రీకరించినారు. మూర్తి గారి వంశములో రామభక్తి యున్నట్లు గోచరించును. పెద్దల యాశీర్వ చనబలమున ఈయన యేతద్గ్రంధరచన ఆరంభించి పరిపూర్తిచేయ గలిగినారు. ఈయన మూలానుసారముగా ఈ గ్రంథము సరళముగా ప్రసాదగుణభూయిష్ఠముగా నిర్వహించినారు. ప్రసిద్ధకవులెల్లరు ఆంధ్ర భాషలో వాడిన వృత్తాదులనే ఈయన అవలంబించి చక్కగా నడపి నారు. సర్వశ్రేణులవారును దీనిని బఠించి పరితోషము నందవచ్చును.

ఐరోపాదేశ కవులును, విద్వాంసులును, ఒక భాషలోనుండి మఱియొక భాషలోనికి పద్యకావ్యముల ననువదించునపుడు మూల గ్రంథములోని ఛందస్సులనే అనువాదమున గూడ సాధ్యమైనంతవరకు అవలంబింతురు. నిపుణముగా ఆకార్యమును నిర్వహింప గలుగుట ఉత్తమమని మా అభిప్రాయము. కాని మన దేశమున ఆవిధానము

ననుసరింపక కవులు తమకు తోచినరీతిని అవలంబించుచున్నారు. మాతృ కను చదివినప్పుడు కలుగు రసస్ఫూర్తి ఇట్టి యనువాదములు చదివి నప్పుడు కలుగదు...

సాహితీసమితి, రేపల్లె } — శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి.

"ఆర్షవిద్యాభూషణ"

శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ.

సంస్కృతోపన్యాసకులు, S. R. R. and C. V. R కాలేజి

విజయవాడ.

నీ ఆంధ్రతులసీరామాయణము ఆంధ్రభాషకు నూతనాలంకా రము. నీకైత అనేకస్థలములలో ప్రాచీన కవుల రచనలను తలపించు చున్నది.

జటావల్లభుల పురుషోత్తము.

"సాహిత్యభూషణ"

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఎ. బి. యల్.

ఆంగ్లభాషోపన్యాసకులు. S. R. R. and C. V. R. కాలేజి

విజయవాడ.

"ఆంధ్రతులసీరామాయణము. బాలకాండము. గ్రంథకర్త. మైల వరపు సూర్యనారాయణమూర్తి."

మహాత్ముల జీవితగాథలు ధార్మికచరిత్ర లగును. మానవులలో పలువురు సామాన్యులు. సాధకులు అల్పసంఖ్యాకులు. సాధకులు జ్యోతుల బోలువారు. తమ్ము దాము కాల్చుకొనుచు ఒరులకు వెలుగు నిచ్చునవి దివ్వెలు. మహత్త్వశిక్షణము యాతనముతోనే కలదు. దాని నెఱుగనివాడు సంయమికాలేడు. తీవ్రానుభూతి నెఱుగక ప్రజ్ఞానమును

బడసినవాడులేడు. పంకిలమందు బుట్టి క్రమసాధనవలన నీటిపై తలయెత్తు తామరతూడు స్వర్ణరశ్మిసంస్పర్శకతన ప్రఫుల్లముఖియైన శతపత్రసుందరి యగులీల, దుర్దాంతస్థితియందు ప్రభవించి క్రమతపస్సువలన వృద్ధినంది ప్రఫుల్లజీవులై భాస్వదాశయ సుగంధమును మహాత్ములు దశదిశలకు ధారవోయుచుందురు. వీరిని జ్యోతులనుడు. లేక పుష్పసంచయమనుడు. గురుగుణసౌరభదానమువలన మహాత్ములు మానవలోకమునకు అనంతమైన అభ్యుదయమును జేకూర్చుచుందురు. ఇట్టి మహనీయులలో భక్తశిఖామణియైన తులసీ దాసొకడు.

రామనామమందలి భక్తిమహార్ణవము నాపోశన మొనరించిన మహాత్ముడాతడు. ఆర్యావర్తమందలి ప్రజలకు రామునియెడల నెంత భక్తి కలిగెనో తులసీదాసుపై గూడ నంతభక్తి కలిగెను. కావున పండితులును పామరులునుగూడ తులసీరామాయణమును పఠించుచు పునీతు లగుచుందురు. రసానుభూతితో వ్రాయబడిన గ్రంథము. రసభరిత హృదయములం దవలీలగ ప్రవేశించుటాశ్చర్యముకాదు. తులసీదాసు శైలి పన్నీటియేరువలె నడచును. కావున నెల్లరకది హృదయంగమమగుచున్నది.

ప్రస్తుతగ్రంథకర్త భక్తిభరితహృదయులు. హిందీయందు ఘనపాండితిని సంపాదించిరి. ఆంధ్రశారద నారాధించు సాధకులు. మాతృకలోని యూహాలను గ్రహించి నిర్దుష్టమైన తెలుగురచనలో వ్యక్తీకరించిరి. "స్వాధ్యాయప్రవచనములు తపస్సు" అని ఉపనిషత్తులు వాక్రుచ్చుచున్నవి. గ్రంథకర్తతపస్సు అనల్పమైనది. ఈ పవిత్రగ్రంథరచన వలన వారు ధన్యజీవులైరి. ఆంధ్రవసుంధరలో నీ యుద్గ్రంథము సముచితాదరమునందునని విశ్వసించుచున్నాను.

మహాశివరాత్రి 1957 } జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
విజయవాడ.

శంకరవిజయాది గ్రంథకర్తలు. "కవితాభూషణ"

బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు

కళాశాలపండితులు, అమలాపురం. 19—2—57.

మీరు పంపిన తులసీరామాయణము, జానకీజానిశతకము, చేరినవి. ఆమూలాగ్రముచదివితిని. ముదమొందితిని. హిందీభాష యనభ్యస్తమగుటచే మూలముతో సంప్రతింపఁజాలకపోయితిని. కాని మీయాంధ్రీకరణము ఆంధ్రీకరణమువలె లేక యిదియే మాతృకయనున ట్లనర్గళధారాశోభితముగా నుండుటచే నాద్యంతము చదువక విడువఁజాలనైతి ననుటలోనే మీరచనాప్రశస్తి వ్యక్తమగుచున్నది. వర్ధమానచంద్రులగు మీరీమహాగ్రంథమును బూర్ణముగా రచించి ఆంధ్రులమన్ననలకు పాత్రులగుదురుగాక అని ఆశించుచున్నాను. మీ యాంధ్రీకరణముచే పరమభాగవతోత్తముఁడగు శ్రీతులసీదాసమహాకవి యాంధ్రలోకమునకు దగ్గఱబంధువు కాఁగలడని నాయాశ. పరమేశ్వరుఁడగు శ్రీరామచంద్రుఁడు మీసంకల్ప మీడేర్పక మానఁడని నావిశ్వాసము.

ఇట్లు, శ్రేయోభిలాషి.

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

"ఆంధ్రరచయితలు. ఆంధ్రపురాణాది" గ్రంథకర్తలు.

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.

ప్రధానాంధ్రపండితులు, వీరేశలింగాస్తికోన్నత పాఠశాల, రాజమహేంద్రవరం.

26—10—1956.

మీరుపంపిన ఆంధ్రతులసీరామాయణము, జానకీజానిశతకము క్రిందటివారము అందుకొని, చాలసంతోషముతో కృతజ్ఞతతో చదువుకొన్నాను. మీకమ్మయును చేరినది. ఆంధ్రతులసీరామాయణము చాలభాగము చదివితిని. మీకవితాప్రవాహములో దోగి మూలగ్రంథ

ముతోడి నాయజ్ఞానసంబంధమును కడుగుకొన్నాను. మీ కవిత్వమున కొకజీవము, జపము కలదని యర్థముచేసికొన్నాను. ఈనడుమ కంబ రామాయణము తెనుఁగులో వెలయుట చూచినపుడు తులసికూడ తెనుగులోనికి దిగవలయునని మిక్కిలి అనుకొంటిని. మీరుచేసిన యీ సంకల్పము కల్పాంతమువఱకు ఉండదగినది. రామగాథ యెవరువ్రాసి నను ఎట్లువ్రాసినను నాకు శిరోధార్యము. అందులో మనోజ్ఞమైన మీశయ్యాసౌభాగ్యముతో తులసీరామాయణము చేతికందినది. పాత్రదర్శనీయమైన గ్రంథశ్రేణిలో మీగ్రంథము నలంకరించుకొందును.

మిగులు కాండములు త్వరలో రావలయునని ఆంధ్రవాణి మీ వలన అమోఘమైన సపర్యచేయించుకొనవలెనని కాంక్షించుచున్నాను.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

. ఉ భ య భా షా ప్ర వీ ణు లు.

## శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు

సంస్కృతాంధ్రపండితులు – స్థానికోన్నతపాఠశాల-రామచంద్రపురం. 28-2-57

ఈ నెల 1 వ తేదీని మీరు పంపిన పుస్తకాలు అందినవి. రామ చరితమానసరచన ధారావాహిగా ఉంది. ప్రారంభరీతిగాక చేయి తిరి గిన నిద్రాతనం గూడ ఎడనెడ గోచరించి సంతోషించాను.

అసలు రామశబ్దమే జగన్మనోహరమైన మాధుర్యంతో పుట్టింది. దాని స్పర్శ దేనినయినా బంగారంచేస్తుంది. అసలు తులసీవ్రభువును కూడ చదువుతే ఎంత ఆనందించేవాడనోగదా!

భవదీయుడు,

ఇం॥ హ.

మహాకవి. సరస్వతీపుత్ర

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు,

కడప, - 6-3-57

తమరు దయతో బంపిన పుస్తక మందినది. ఆపాద చూడము చదివి యానంద పడితిని. ఇంతకు ముందు శ్రీ భాగవతుల నరసింహ శర్మగారి గ్రంథమును నేను జదువలేదు. నేను చూచినది గద్యానువాదము మాత్రమే. అది నాకు తృప్తినివ్వలేదు.

తమ రచనము పక్కమైన పురాణశయ్య. ఇది మన జాతీయము. ఈ నడుమ లేనిపోని చిత్తారివను లెక్కువై - మనకవు లీ యుదారమై-ధారాళమైన శయ్యనే పోగొట్టు కొనుచున్నారు. శిల్పమును పేర సహజధోరణి మఱుగిపోవుచున్నది. తమ రాసహజ ధోరణిని సాధించితిరి. చాల సంతోషము.

మూలములోని భావముల నెంతయో ముచ్చటగ తెన్గునకు దించితిరి. స్వకపోలకల్పనములు గూడ రసమున కుపస్కారకములై యున్నవి. తమ యీ ప్రయత్నముతో తెన్గువారికి తులసీదాసు అర్థము కాలేదన్న కొఱత పోయినది.

"పుట్టపర్తి"

-